

గ్రంథకర్త.
బ్ర॥ శ్రీ. బాలకవి. శతావధాని
అనుముల.సుబ్రహ్మణ్యశాస్త్రి గారు.

కృతిపతి
మ॥రా॥శ్రీ రామకృష్ణారెడ్డి గారు.
దైవముదిన్నె.

1929.

# ఉపోద్ఘాతము

ఈ వజ్రనాథచరిత్రమును వ్రాసినకవి అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఈయన నెల్లూరి మండలవాసి. ఈయన గతించి యిప్పటికి అయిదారు సంవత్సరములయినది. ఈయన కర్నూలు బళ్లారి మండలములలోనున్న ఎల్లరెడ్లతోడను మిక్కిలి మైత్రిగలిగి వర్తించెడువాఁడు. అందును శ్రీదైవముదిన్నె రామారెడ్డిగారితోఁ బ్రాణమైత్రి. దైవముదిన్నె రామారెడ్డిగారనఁగా దత్తమండలవాసులకుఁ జిరపరిచితులు. ఆయన కవితాలోలుఁడు, త్యాగశీలుఁడు, ధార్మికుఁడు, రసజ్ఞుఁడు, సర్వకల్యాణగుణ సంపన్నుఁడు, అనవేమారెడ్డి ప్రభృతులతోఁ దులతూఁగువాఁడు. ఆయనకీ కవి ఆస్థానపండితుఁడై యుండెను. ఇతఁడు కవితారచనయందేకాక రాజకీయ వ్యవహారములయందును గడుంగడు దక్షుఁడు. ఆయా సమయములయందీ కవి రచించిన చాటువులు ఒకపుస్తకమునకుఁ సరిపడియున్నవి. ఈతని కవిత ప్రాచీన సాంప్రదాయానుకూలముగా నున్నది. అచ్చటచ్చటఁ బాండిత్యపుఁగొరఁత దెలుపు పద్యము లున్నను మొత్తముమీఁద గవిత్వము రసవంతమైనది. ఇతఁడు 'రెడ్ల చరిత్రము, సంయుక్తాపరిణయము' అను మరిరెండు గ్రంథములు రచించెను. ఇందలి సంయుక్తా పరిణయము దైవముదిన్నె రామారెడ్డిగారికే అంకిత మీయఁబడినది. ఇది అముద్రితము.

ఈ వజ్రనాథచరిత్రమునకుఁ గృతిపతి శ్రీదైవముదిన్నె రామకృష్ణారెడ్డిగారు. శ్రీరామారెడ్డిగారి దాయాదులు. వీరును రామారెడ్డిగారివలెనె ఉదారులు, కవితాలంపటులు, ధార్మికులు, త్యాగశీలురు. వీరీ కవిని స్వయముగాఁ బ్రార్థించి యీగ్రంథమును వ్రాయించుకొన్నట్లు తెలియుచున్నది.

ఈగ్రంథమునందలి యితివృత్తము శివపురాణాంతర్గత మని కవియే చెప్పినాఁడు. దీనియందు మనుచరిత్రయందువలె నొక గృహస్థు

నింటికి సిద్ధుఁడు వచ్చుట, అతఁడు తన దేశసంచారమునుగూర్చి తెలుపుట, సిద్ధాదేశముచే సాగృహస్థు తీర్థయాత్రలకుఁ బోవుటయును గలవు. పిమ్మట కథ మారిపోవుచున్నది.

ఈకవి కవిత్వమును గూర్చి నేను వ్రాయుటకన్న యొక పద్యమును ఉదాహరించి రుచిఁజూపి మిగిలినది రసజ్ఞలోకమునకు విడిచివేసెద. సిద్ధుఁడు తన దేశసంచారమును గూర్చి వజ్రనాభునితోఁ దెలుపుపట్లనున్న పద్యమును జూడుఁడు.

సీ. ఆఁకలైనపుడెల్ల ♦ నందించు మాయన్న
పూర్ణమ్మ రుచియైన ♦ భోజనంబు
నడువలే కాయాస ♦ పడుచున్న బలమిచ్చి
రక్షించు మధుర మీ ♦ నాక్షి దేవి
ఒంటిగా భయమొంది ♦ యున్న భ్రాంతఁటెఁ గుంకు
మపురక్షఁబెట్టుఁ గా♦మాక్షి తల్లి
కష్టముల్ తలఁచి దుః♦ఖముఁజెంద నిద్రకై
జోకొట్టు మాయమ్మ ♦ జోగుళాంబ
గీ. ఎండవానల గాలికి ♦ బెండువడినఁ
జల్లనగు చూడ్కి నమృతంబుఁ ♦ జల్లుచుండు
త్రిపురసుందరి వెనువెంటఁ ♦ దిరుగుచుండెఁ
లీల నే యాత్రలనుజేయు♦ వేళయందు.

ఈకవి వ్రాసిన సంయుక్తాపరిణయమును నచిరకాలములోనే శ్రీరామిరెడ్డిగారు ముద్రింపఁజేయుదు రని విశ్వసించుచున్నాను.

పండితవిధేయుఁడు,
సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి.





# వజ్రనాభ చరిత్రము.

## ప్రథమాశ్వాసము.



శ్రీరామామణి చెక్కిలిం బుణుకుచుఁ ♦ జెంతన్ మహీకాంత శృం
గారంబుం గని తాళలేక కుచయు♦గ్మంబందుఁ గేలుంప నీ
కేరీతిన్ విడదవ్రిధారణము శౌ♦రీ! యంచు నవ్వించు భూ
నారిన్ ముద్దిడు విష్ణుఁ డేలుతఁ గృపన్ ♦ మా రామకృష్ణాధిపున్.

మ. జనితానందరసాప్తితో సుపరతిన్ ♦ సాగించుచున్ మౌళిచం
ద్రుని వీక్షించి విలక్షచిత్తయగుచున్ ♦ దుర్వారవేణీలతా
ఘన కంపంబునఁ జంద్రునిన్ భయపడం♦గాఁ జేయు నయ్యద్రిజా
ననమున్ ముద్దిడు శంభుఁ డిచ్చుత సిరిన్ ♦ మా రామకృష్ణయ్యకున్.

మ. శ్రుతిపాఠంబున నిర్జరాభయ[illegible]నన్ ♦ లోకప్రజాసృష్టిసం
గతి వాణీసరసోక్తులన్ ముఖచతు♦ష్కంబైన దివ్యాధరా
మృతపానంబున కింక నొక్కమొగమున్ ♦ మేలొప్ప నాసించు వా
క్పతికాంతుం డిడుతం గృతీశ్వరున కా♦చంద్రార్క మాయుష్యమున్.

సీ. కలశపయోరాశి ♦ గారాబుతొలిబిడ్డ
కడుపార వలరాజుఁ ♦ గన్నతల్లి
పిన్నజాబిలి నెత్తి ♦ పెంచిన సైదోడు
కలుముల నొడఁగూర్చు ♦ కంబుకంఠి
రతికి సంసారంపు ♦ రహి దెల్పు నిలుపెద్ద
పంట వలంతి చే♦పట్టు సవతి

సురకామినులపూజఁ ♦ జొక్కెడు దొరసాని
దానవారాతి య♦ర్ధాంగలక్ష్మి
గీ. అహరహంబును సత్కృపా♦మహిత యగుచు
భువిని గోరంట్లవిభుని స♦త్పుత్రుఁడైన
రామకృష్ణాధిపుని నాత్మ♦ధామమందుఁ
గోరి నిలిచి భాగ్యములు సే♦కూర్చుఁగాత.
సీ. ఏయమ్మ శైశవం ♦ బేపారఁ జలికొండ
తిప్పలు వన్నెల♦ కుప్పలయ్యె
నేయమ్మ యౌవన♦ప్రాయంబు దోఁప మ
న్మథ వైరిగిరికి జా♦మాతయయ్యె
నేరామ లసదలం♦కారపత్రశస్తికి
బాలచంద్రుఁడు పూల♦మాలయయ్యె
నేతల్లి సంసార ♦ మించుకఁ జేయఁ గై
లాస భూధరము♦ నివాసమయ్యె
గీ. అట్టి శర్వాణి మృదుపాణి ♦ యభవురాణి
పరమకల్యాణి గోరంట్ల ♦ ప్రభుతనూజు
రామకృష్ణునిఁ బలిచి రా ♦ రమ్మటంచు
మించు నైశ్వర్య మిచ్చి ర♦క్షించుఁగాత.
సీ. ఏసారసాక్షి ప♦ద్మాసనుసతియౌటఁ
బ్రచురించుఁ గోమల♦పాణితలము
ఏలోలనేత్రి మ♦రాళగామినియౌటఁ
దమిఁదెల్పు మందయా♦నములసొంపు
ఏతన్వి సురమాని ♦ మాతయౌ టెఱిఁగించుఁ
బరిపూర్ణశాంతకృ♦పారసాప్తి
ఏలేమ బాలేందు♦మౌళిసోదరి యౌటఁ
దెలుఁపు గోమల దివ్య ♦ దేహలతిక

గీ. అట్టి శ్రీవాణి మదబంభ♦రాభవేణి
లలితరోచిష్ణు సద్గుణా♦లంకరిష్ణు
రాజశేఖరభ్రాజిష్ణు ♦ రామకృష్ణు
మత్కృతీశ్వరు దరిఁజేరి ♦ మనుచుఁగాత.

మ. వినుతింతున్ నిగమాంతసంతత మహా♦విఖ్యాతచారిత్రునిన్
మునిరాజన్య నమస్కృతాంఘ్రియుగళున్ ♦ భోగీంద్రభూషావృతున్
ఘనబర్హిర్ముఖ కార్య నిర్వహణు వి♦ఘ్నధ్వాంత మార్తాండునిన్
మును మత్కావ్యము సంతరాయములలో ♦ మున్గింపకుండన్ దయన్.

గీ. రాముకార్యార్థమై సాగ♦రంబుదాటి
జానకినిఁ గష్టములనుండి ♦ సంతరించి
అవనిఁ జిరకాల ముత్తమ♦యశముగన్న
అంజనాసుతు హనుమంతు ♦ నభినుతింతు.

మ. ఘనవాల్మీకిని వ్యాసమౌనిని శుకున్ ♦ గాళిదయాపాత్రుఁ జో
రుని దండిన్ భవభూతి మాఘకవి భ♦ద్రున్ శంకరున్ సోము భా
సుని మాయూరుని భారవిన్ సుకవిపూ♦జ్యున్ మల్హణున్ బిల్హణున్
మనమందున్ మును వేఁడెదన్ విబుధస♦న్మాన్యైకపారీణులన్.

మ. వరగీర్వాణవచస్సుధాకలిత ది♦వ్యాంధ్రోక్తిభాగీరథిన్
బరువెత్తించె నెవండు భారతమహా♦వారాశి కా నన్నయన్
స్థిరపాండిత్య విచక్షణుం డయిన మా ♦ తిక్కయ్యనుం బ్రెగ్గడన్
గరుణాపూర్వులఁ బెద్దనాదులను వీఁ♦కం గొల్తు నశ్రాంతమున్.

మ. స్వపటాటోపమునన్ స్వకీయకృతులన్ ♦ శ్లాఘించు చన్యుండుని
క్కపుఁ దెల్విన్ రచియించు కావ్యముల లె♦క్కల్ లేని దోషంబులన్
జపలస్వాంతమునం గనుంగొనుచుఁ ద♦త్సారస్యముల్ గ్రోలకే
కపిచేష్టల్ పచరించు కాకవుల మ్రొ♦క్కంబోదురే? సత్కవుల్.

సీ. అధివసించెను నెవం♦డమరచింతాత్మకా
రాస్థాన మంటప♦హర్మ్యమందు

అలరించె నేఘనుం • డల్ల సీతారామ
విభుని శాస్త్రీయ వా•గ్వితతిచేత
ఆలించె నెవ్వఁడు • బాలసరస్వతీ
తర్కతీర్థుఁ డటంచుఁ •దనయుఁ బిల్వ
పాలించె నెవఁడు సా•పాటు వస్త్రము విద్య
నొసఁగి విద్యార్థుల • నుచితరీతి
గీ. యశము నార్జించె నెవఁడు నా•శశిగ నట్టి
బుక్కపట్టణ సత్కులాం•భోధి పూర్ణ
చంద్రుఁడౌ బుచ్చి వేంకటా•చార్యవర్య
పాదయుగళంబు సతతంబు • భక్తిఁ గొలుతు.

వ. ఇట్లభీష్టదేవతాప్రార్థనంబును సుకవీశ్వరాభివందనంబును కుకవిధిక్కారంబును సద్గురుస్మరణంబును గావించి యేదైన నొక్క ప్రబంధనిర్మాణ కుతూహలుండనై యున్నంత.

సీ. భువనాద్భుత మహావి•భవ రమావాసమై
పరగు దైవము దిన్నె•పురనివాసి
మాన్యగోరంట్ల రా•జన్య పూర్వార్జిత
పరిపూర్ణ సత్పుణ్య•భాగ్యరాశి
గోరంట్ల మాధవ • శౌరి కారుణ్య సం
పాదిత సకలవై•భవ విభాసి
వరకామినీ ద్వయీ • సరస సల్లాప సం
భావితాకార రే•ఖావిలాసి
గీ. సకలసుగుణ పయోరాశి • సర్వకావ్య
లక్షణాలోకనాభ్యాసి • లలితసుకవి
భాషణసుధాసరోహంస • భవనిరాసి
యైన ధనదుండు రామకృ•ష్ణాభిదుండు.

వ. వెండియు నతండు నిఖిల భూమండల మండనాయమాన పాండుర డిండీర కర్పూరఖండ సుధాసమాన నిజయశోమండలుండును, అంగీకృత నిజగృహాంగణ రంగస్థల నృత్యత్పద్మాంగనామణీ శృంగార సంగీత సుధాతరంగిణీ తరంగ సాంగత్య సారంగీకృత సంతోషిత నిజాంత రంగుండును, సురసుందరీసమాన వర చంద్రాననా నయనేందీవరద్వంద్వ నవీనకందర్పసమ తనూసౌందర్య భాసురుండును, సంతత సకల హరి దంతరాగ దవసంత వనప్రియు విపంచికా పంచమస్వరసమంచిత వచనా మృత సుకవినిచయరచిత హృద్యగద్య పద్య ప్రబంధ బంధుర రసప్ర వాహ బధిరీకృత నిజసభాభవనుండును, సంతత సముపాసిత మాధవ పదారవిందయుగళ నిష్యంది మరంద తుందిల హృదయేందిందిరుండును; ఇంద్రోపల వినిర్మిత ముఖద్వార మంటప ప్రాకార గోపుర హేమపద్మ రాగఖచిత గర్భాలయ ప్రతిష్ఠాపిత రామలింగేశ్వర మహాదేవసందర్శన దీక్షా విచక్షణుండును, భూసురాశీర్వాద పురస్సరద త్తఫలాక్షతకుసుమ గర్భ కలశాంభోధి పరిపూర్ణ కుముద బాంధవుండును, గుజ్జువర్మ గోత్రోద్భవుండును, రక్షితాశ్రిత విద్వజ్జన పరివేష్టితుండు నై నిండుకొలు వుండి యొక్కనాడు.

సీ. కోరి నట్లుడుముళ్ళ • గుత్తి వేమారెడ్డి
ధీవరుం డొకచోటఁ • జేరియుండ
ధైర్యశాలియుఁ జిన్న • తమ్ముండు సంజీవి
రెడ్డి వేరొకచోటఁ • బ్రీతినుండ
గుణశాలియగు నన్న • కొడుకు శ్రీశివరామ
విభుఁ డాజ్ఞకై తటి • వేచియుండ
నార వివేక వి • చారుండు బంగారు
గాడు మంత్రాంగ సం • గతులు దీర్ప

గీ. శుద్ధహృదయుండు పూజ్యుండు • సుబ్బరామ
శాస్త్రి హరికథా కథనంబు • జరుపుచుండ

వరకుమారికయా విరూ • పాక్షదేవి
ముద్దు సుద్దులచేఁ బొద్దు • పుచ్చుచుండ.

సీ. నను శ్రీభరద్వాజ • మునినాథవరగోత్రు
చంచుబ్రహ్మేశ్వర • శాస్త్రిపౌత్త్రుఁ
గవిధీర వీరరా • ఘవ సుధీమణిపుత్త్రు
ననుములాన్వయ కోమ • లాంబామిత్త్రు
రామరాయాస్థాన • రమణీయవనజైత్రు
మైసూరురెడ్డి స • న్మానపాత్త్రు
ధరణీశపూజిత • దత్తమాన్యక్షేత్త్రుఁ
గుకవీశగర్వాంధ • కుముదమిత్త్రు

గీ. సరస సద్గ్రంథచింతనా • సారమధుర
ధోరణీ పూరణీయ బం • ధురకవిత్వ
నయవిధేయు సుబ్రహ్మణ్య • నామధేయుఁ
గనుచు హర్షంబుతోడ ని • ట్లనుచుఁ బలికె.

శా. బ్రాహ్మీసత్కరుణా కటాక్షచయ సౌ • భాగ్యంబుమై సర్వదా జ-
జిహ్వాభూతరసంబులం గవిత నా • సింగాంచుచుఁ జెప్ప సు-
బ్రహ్మణ్యాఖ్యుఁడ! నీదుసా మ్మనుచు నే • భావింతు నిన్ గాంచుటన్
బ్రహ్మానందము గల్గె నాకు హృదయాబ్జం • బందు నిక్కంబుగన్.

క. మాకున్ హితుఁడవు సకలవి
ధాకుశలుఁడ వదియుఁగాక • తత్జ్ఞుఁడ వౌటన్
నీకుం దెల్పెద మొక్క మ
హాకార్యము దలఁచినాఁడ • నది యేమగునో?

చ. గుడి శిథిలంబగున్; ధనము • గొందఱుచోరులు; నూయి పూడు; పెం
జడిఁ దెగుఁ జెర్వు; ప్రాపు చెడి • నన్ వనముం జెడు; విప్రరక్షణం
బడఁగును లేమి పైఁబడిన; • నన్నిటికన్నఁ జిరాయువైన దీ
పుడమిని గావ్యమొకండనుచుఁ • బూజ్యులు పల్కఁగ విందు మెచ్చుటన్.

సీ. అర్పించితివి తొల్లి • నతిభక్తి శతకంబు
రచియించి జలశాయి • రంగపతికి
సంతరించితివి మేల్ • స్వాదూక్తులమర సం
యుక్తా వివాహ ప్రసక్తియందు
హరికథాసరణిగా • విరచించితివి సాధ్వ
తిమ్మాంబికా దేవి • దివ్యమహిమ
దేశకాలస్థితుల్ • తెలియవ్రాసితి మొన్న
శ్రీమించు మాపూర్వ • రెడ్లచరిత
గీ. చిన్నగ్రంథంబు లెన్నెన్నొ • చేసినాఁడ
వింకఁ జేయంగఁ దలఁచితి • శాంకరీకృ
పారసం బెల్లవేళ నీ • పైనిఁ బారు
మహిని నీపుణ్య మెన్న సామాన్యమగునె?
సీ. శంకర భారతీ • స్వామిని నతులచే
మెప్పించి సెల్వాలు • గప్పినావు
కవితచే నలరించి • గద్వాలవిభుఁ డిచ్చు
కట్నములఁ బలుతీవిఁ • గట్టినావు
మహిసూరు రెడ్డి స • న్మానపు సౌవర్ణ
వలయంబు లిరుగేల • నిలిపినావు
తిరుమలరాయ వి • తీర్ణరత్నాంగుళీ
యకశోభపాణివై • యలరినావు
గీ. రసికశేఖరుఁడౌ రామ • రాయఁడొసఁగు
పంచసరిగంచు లుత్తరీ • యములవల్లె
వాటుసింగార మొదగూర్ప • నీటుగులుకు
చుండు నీ కేటికొరత లే • కుండు నెపుడు.
సీ. రాజేశ్వరపదాబ్జ • పూజనాద్భుతభక్తి
భరితున కతిసీతి • భరతునకును

రామాంబికాగర్భ • రత్నాకరామృత
కరుడను మోహనా • కారుడను
చటుల దుర్గుణబద్ధ • శాత్రవదోర్గర్వ
మథనున కంగనా • మన్మథునడు
కవిజనావనబద్ధ • కంకణ వరకరాం
భోజున కాశ్రిత • భోజునడను
గీ॥ రాజకులభూషణునడు • మా రామరాయ
ప్రభున కెద మెచ్చు నాస్థాన • పండితుండవు
కలదు మా యాంధ్ర రెడ్డి వం•శంబటన్న
నీకు నభిమాన మింపేర్మ • నిక్కువముగ.
శా. మా తాతల్ మును పుణ్యకార్యములఁ బ్రే•మం జేసి లోకంబునన్
ఖ్యాతిన్ బొందిరి నాఁడు నీ డనక నా • కల్పాంతముల్ సజ్జనుల్
ప్రీతిం బొందఁగఁ జేయ నేర్తుమె? యశ•శ్శ్రీమించు సత్కార్యముల్
చేతోమోదముగల్గ నేఁడును జయ•శ్రీయోఽభిరామంబుగన్.
ఉ. కావున నొక్క దివ్యకథఁ • గమ్మని తేనెల సోనలూర హా
రావృత భారతీకుచయు•గాంతర కుంకుమ పంకగంధ సం
భావితగంధవాహ మృదు•మందగతిన్ ప్రసరింబురీతి మో
దావహాతన్ రచింపవలె • నంకితముల్ గృప నాకు నీవలెన్.
చ. కలవు పురాణముల్ కథలు • కల్పనలున్ ఘనకావ్యముల్ మహో
జ్జ్వలరసపారవశ్యముగ • జాలు రసజ్ఞత కవ్వి చూచినన్
సలలిత రీతి పద్ధతుల • సంగ్రహరీతి చరిత్ర నొక్కటిం
జెలఁగ రచించి తత్కృతికిఁ • జేయుము భర్తగ నన్ను మిత్రమా!
గీ. సకల దేవతావితతిలో • శంకరుండు
ఘనుఁడు తత్స్వామిపై నాకుఁ • గలదు భక్తి
గానఁ జేయు భక్తిరస ప్ర•ధానముగను
శివుని మాహాత్మ్యమును జెప్పు • చిన్నికథను.

వ. అని పలికి వినయవిధేయపూర్వకంబగు కర్పూరతాంబూల చీని చీనాంబర జాంబూనదాభరణంబుల బహుమానంబుగా నర్పించి మ్రొక్కిన నేనును దత్సుగుణవిశేషంబుల కానందంబు నొంది తత్కృతిపతి నుద్దేశించి యిట్లంటిని.

సీ. దృఢమైన భక్తిం బ్రతిష్ఠించితివి రామ
లింగేశ్వరునిం దద♦గ్రాంగసతిని
గురియించితివి నిన్ను ♦ గోరివర్ణించిన
కవిచాతకములపైఁ ♦ గనకవృష్టి
బెట్టించితివి రమా ♦ వేంకటేశ్వర దివ్య
కల్యాణవేళఁ బం♦క్త్యాన్నములను
జేయించితివి వసా♦వ్యాయన ధనమిచ్చి
బ్రాహ్మణవటులకుఁ ♦ బరిణయములు

గీ. కోరితివినేఁడు కవితాకు♦మారి తీయ
నైన కెమ్మోవి కమ్మని ♦ పానకంబు
ధన్యతముఁడ వన్నిట నీవు ♦ దలఁచినట్ల
యగును గావుత రామకృ♦ష్ణావనీంద్ర!

చ. వరకనకంపుఁ గల్పనకు ♦ వజ్రము తా లభియించినట్లు వి
స్తరత రసాలపాళికి వ♦సంతము దోఁచినయట్లు యౌవన
స్ఫురితనితంబినీమణికి ♦ సుందరపూరుషుఁ డబ్బినట్లు మ
ద్వరకృతి కీవు భర్త వగు ♦ భాగ్యముకన్న మరేమి కావలెన్?

వ. అని పలికి.

సీ. రాజేశ్వర వరాంఘ్రి ♦ రాజీవబంభర
శ్రీరామరాయ క్ష్మా♦పారసంబు
బుక్కపుర్యన్వయ ♦ బుచ్చి వేంకటగురు
వర్యపావన పాద♦పద్మసేవ
వేంకటేశ్వర పాద♦పంకజార్చిత మల్లి
కా ఘుమంఘుమిత సౌ♦గంధ్యలహరి

కాత్యాయనీ దివ్య • కబరికా మందార
మాలికామంజుల • మధురసంబు
గీ. కారణంబులు పోత్సాహ•కములు గాఁగఁ
గలిగినట్టి కావ్యరచనా • కౌశలమున
క్రియఁబూనితి వజ్రినా•భ చరితంబు
రామకృష్ణాభిధునిఁ గృతి•ప్రభునిఁ జేసి.
ఉ. పండితులెల్లరున్ విని సెబాసనకున్నఁ గవిత్వధోరణీ
మండితుఁ డారకున్నె? యొక•మాదిరి కబ్బము లల్లకుండఁ బు
త్త్రిందు జనించ మంచియగు • రూపసికాఁడని యెంచి రూపహీ
నుండు నిజాంగనల్ వదలునో? నుతుఁగాంచి తరింపకుండునో?
చ. కలిగినసౌఖ్యములో సొగసు • కల్పనఁజేసి కవిత్వకన్య మీ
నెలవున కంపినాము తగు•నేర్పులుదిద్ది సుఖంపుటాప్తిఁ గే
వలదృఢతర్కశాబ్దిక వి•వాదబలాత్కృతిఁజూపి తత్కుచం
బులఁగల శిల్పలేశముల • ముందుగ నెంచకుఁడయ్య! పండితుల్.
చ. అరువదినాల్గు విద్యలను • నావల కీవల ద్రిప్పిచూచియే
విరచన చేయఁగావలెఁ గ•విత్వ మటన్నను నాతరంబె? యే
నెరసులులేక చెప్ప నల • నీరజగర్భునకైనగాని త
ద్వరసతికైనఁగాని కడు•భారమటంచను మీరెఱుంగరే?
గీ. అన్నిరీతులఁ బండితా•హ్లాదకరము
గాకయున్నను గొన్నింటఁ • గవుల ధర్మ
మనుసరించియే బుధులను • దనుపఁగలద
టంచుఁ జెప్పెద నెటులైన • మంచిదనుచు.

—•కృతిపతివంశవర్ణనము•—

గీ. బ్రహ్మచే మున్ను సృజియింపఁ•బడిన నాల్గు
వర్ణములయందు నుత్తమ • వర్ణమున

నలరుచుండు నాంధ్రప్రతిష్ఠయాన్వయంబు
ఘనత నీనాఁడు పాఁకనాఁ డనఁగఁబ్రబలు.

సీ. గౌతమీ కావేరికా జలక్రీడాది
పరిపాటి గలనాఁడు • పాఁకనాఁడు
శ్రీశైల సిద్ధేశ • శివముఖ్యనిర్మాణ
పరిపాటిగలనాఁడు • పాఁకనాఁడు
రాయవేశ్యా భుజంగాయ గోవాళాంగ
పరిపాటిగలనాఁడు • పాఁకనాఁడు
తుంగభద్రాతీర • దుర్గప్రతిష్ఠాది
పరిపాటిగలనాఁడు • పాఁకనాఁడు

గీ. అట్టి పాఁకనాఁటి కులమం • దధికపుణ్య
గణ్యమై శత్రుహరణ ప్రావీణ్యమైన
గుజ్జు భూపాలచంద్రుని • గోత్రమొందు
దనరు నీనాఁడు గుజ్జురాడ్ గోత్రమనఁగ.

కం. ఆవంశభవులలోపల
ధీవినుతుఁడు పెద్దరెడ్డి • ధీరుఁడు రిపుసం
భావిత వర పదయుగళుం
డావిర్భవమొంది ప్రబలె • నత్యధికుండై.

సీ. స్థాపించు నొకనాఁడు • దైవంబు దిన్నె దు
ర్గాగ్రశృంగముల బంగారు పడగ
మేపించు నొకనాఁడు • మేటికంభాణిలఁ
దురకరాజు గులాబితోఁటలందు
[illegible]పించు నొకనాఁడు • కొసరి సామంతుల
కప్పముల్ రామి సంకాలములనకు
వేపించు నొకనాఁడు • వేరంబునను ముట్టి
వచ్చిన తురక ఘంటాళ్ళుకోరల

గీ. వేడ్కఁజూపించు నొకనాఁడు ♦ వేఁడినంత
నగ్రజాతికి దివ్యాగ్ర♦హారములను
అతఁడు సామాన్యుఁడే? యనే॰ కావనీంద్ర
ప్రణుతగుణుఁడు పెద్దారెడ్డి ♦ ప్రభువరుండు.

క౦. ఆరెడ్డిప్రభుఁడు మల్లమ
నారీమణియందుఁ గనియె ♦ నాగయరెడ్డిన్
సూరిజనంబుల లేముల
బారఁగఁ ద్రోలంగ మేల్మి♦బంగరు కడ్డిన్

క౦. అంబాత్రయ సమ మహిమా
డంబర సాధ్వి శిరోవి♦డంబిత సుయశో
బింబం గనియెను వరతి
మ్మాంబన్ సుగుణావలంబ॰నయక కదంబన్.

సీ. నిజనాగమునుబట్టి ♦ సిలుపుఁడీయని వజ్ర
తప్పయ్యెనని లోనఁ ♦ దల్లడిల్లు
కై సేఁతు సీనాగ ♦ కంకణంబని శంభుఁ
డంతఁలో బొరపాటు ♦ కొంతనూర్పు
బుష్పించె నుపవన ♦ పున్నాగమని నల
కూబరుం డరనాల్క ♦ కొంకుకొనును
యోగంబుచే వేల్పు♦నాగవాసం బబ్బ
నని యముండంతలో ♦ నదరిపడును

గీ. నాగ శబ్దంబు నుడువంగ ♦ నాకలోక
వాసులగు వారికే యిట్టి ♦ భయము గలుగ
శత్రులకు నాగ శబ్ద సం♦స్మరణవలన
నడలు గలుగుట యనఁగ న♦య్యదియు వింతె?

సీ. నిజయోగ వహ్ని దీ♦క్షి చయంబు వెలిఁగించి
తనదు దాక్షాయణీ॰గ్యాంబు నొలపుఁ

గూర్ర శాత్రవశిరః • కుంతనం బొనరించి
తన చండికా మహా • త్త్వంబుఁ దెలుపు
భుజ బలార్జిత దుర్గ • భూములఁ జరియించి
తన పార్వతీ ధర్మ • మును వహించు
స్వకులంబునకు శుభ • ప్రకరంబుల నొసంగి
తన సర్వమంగళా • త్వంబుఁ దెలుపు
గీ. వర పతివ్రతియయ్యు దే • వత్వ మొంది
పిలిచినను బల్కు నిపుడైనఁ • దలఁచువారి
కిచ్చు నఖిలార్థ సిద్ధి యా • సచ్చరిత్ర
తిమ్మమాంబిక భూషిత • దివ్యలోక.
కం. ఆ నాగిరెడ్డి పాపమ
మానిని నిజధర్మ సతిగ • మహినేలి యశో
మానితుఁడై సుతు లిర్వుర
భూనుతులం గనియెఁ బూర్వ • పుణ్యవశమునన్.
గీ. రామిరెడ్డి లక్ష్మారెడ్డి • నామయుగము
నిజతనూ సుందరతకు వ • న్నియను బెట్ట
సద్గుణంబులు దివ్య భూ • షణలు గాఁగ
రామ లక్ష్మణులటు దిన • క్రమతఁ బెరిగి.
సీ. యజ్ఞపూరుష సంభ • వాపవాదులు దాళ
రఘులంచుఁ బ్రజలాడు • రట్టుపోవఁ
బైఁ జేరిమగాని సా • పత్న్యయు లొండొరుల్
నిజభక్తి లేదన్న • నింద బోవ
అగర్భసంపద • లందియు నారామ
వాసులేగద యన్న • వాదుబోవ
నాసికా కర్ణహీ • నగఁ జేసి రబలను
దుడుకు మానిసు లన్న • దూఱుపోవ

గీ. రామలక్ష్మణు లీనాఁడు • రామ లక్ష్మ
ణాఖ్యులై నేఁటి యాంధ్ర రా•జాన్వయమునఁ
బాప మాంబికా తనయులై • ప్రబలి రిపుడు
పేర్మి వర్ణింపఁ గలఁడె ? వా•ల్మీకి యైన.

కం. ఘనుఁడైన లక్ష్మరెడ్డికి
జనియించెను బుత్త్రయుగము•సద్గుణయుత మా
చినవేంకట పెదవేంకట
యను పేరుల తోడఁ బ్రబలి • రవిరళ గరిమన్.

గీ. పాపహరణ విచారణ • పటిమ గలిగి
అచల వాసత్వ సంసిద్ధి•నధిగమించి
శ్రీ యశో దయా వృద్ధుల • చెలువు మిగిలి
తమదు వేంకటనామ సా•ర్థకతఁ గనిరి.

కం. ఆ చినవేంకటరెడ్డికి
యాచక సంతాన భూరు•హాకృతికి సుతుల్
తోఁచిరి నలువురు హరుకృప
శ్రీ చిరకీర్తిని వహించి • చెలఁగఁగ వారల్.

సీ. నందనందన పాద • వంధనాద్భుత చిదా
నందానుభవుఁడు గో•వింద రెడ్డి
రమణీ మణీ మనో•రమణీయ సూద్యాన
తల నూత్న చైత్రుండు • తమ్మిరెడ్డి
మత్త శాత్రవ గర్వ•మాన నిర్మూలనా
మ్లాన ధైర్యగుణుండు • మాదిరెడ్డి
సత్యధర్మదయా వి•చార సారమహత్త్వ
భీమాగ్రజాతుండు • భీమిరెడ్డి

గీ. వీరలొక రొక్కరిని మించు•వీరులగుచు
నలరుచుండిరి దుర్జయ • పాండవ [illegible]

రక్షణాధ్యక్షులైన మురారి కరుణ
తుష్టియయ్యును బొల్చి నిత్యసంతోషులగుచు.

గీ. నీతి యుతులగువారి కనిష్ఠుఁడైన
భీమిరెడ్డి బీదల పాలి వేల్పుగడ్డి
బంధుగౌరవంబుల కెన్నఁ బసిఁడికడ్డి
ప్రబలులై నెదలేని విప్రుల వంటబ్రోడ్డి.

సీ. ఒక భీముఁ డఖిలలోకోన్నత మోహాన
మహారిష్టమై స్థాణువై మూలనుండె
ఒక భీముఁడతి భాగ్య నికరుఁడై యిరుసారి
పుత్రీ స్వయంవరంబును రచించె
ఒకభీముఁ డత్యంత ప్రకట శూరుండయ్యు
మత్స్యావనిందు ప్రచ్ఛే మనుపఁ బడియె
ఒకభీముఁ డవని మృత్యుంజయాకృతియైన
దారిద్ర్యాటవీ ముఖ్య ధాముఁడయ్యె

గీ. ఘనతరైశ్వర్య భాగ్య సంగ్రామకళల
దీటు రారైరి భీమాభిధేయగరిమ
నమరియును రెడ్డి చినవెంకటయ్య కొడుకు
భీమిరెడ్డికి సంగ్రామ విజయరథికి.

గీ. అట్టి శ్రీభీమిరెడ్డి వెంకాంబతనకు
ధర్మపత్నియై సేవావిధంబు జరుప
సౌఖ్యలాలసుఁడై జితేన్ద్రియులు రూప
విభవులగు పల్వురుసుతుల వెలయఁగనియె.

శా. లక్ష్మీనాథ కటాక్షపాత్రుఁడగు పుల్లారెడ్డి గోరంట నా
మక్ష్మామండల భూషణోత్తరుఁడు రామారెడ్డి దుష్టారి లో
కక్ష్మాభృచ్ఛయ వజ్రసారుఁడగు లింగారెడ్డి యా నల్వురున్
లక్ష్మీసూను సమానరూపవర వైశిష్ట్యాభిరంపారఁగన్.

శా. సాక్షాన్నిగమపూరుషుల్ వలె సరో•జాతాసనాస్యాశ్రితిన్
రక్షోనాథ విదారణోత్థిత సమా•ప్రాణేశహస్తాంబుజా
తాక్షేపంబు లనం జెలంగిరి యశో•వ్యాపార సంభూత రా
మాక్షోభాకరణక్షపాకరశరీ• రోద్వేల లేఖాలురై

సీ. సిరినిగాంచినవాని•సిరినిఁ బెంచిన వాని
సిరివరించినవాని • జెలువుఁగాంచు
గిరినిఁజుట్టినవాని•గిరినిఁ బట్టినవాని
గిరినిఁగొట్టినవాని•కీర్తిఁగాంచు
హరినిఁ గూడినవాని • హరిని వేఁడినవాని
హరిని దోడను వాని • నధిగమించు
శరధిఁ బుట్టినవాని •శరధిఁగట్టినవాని
శరధిఁ దిట్టినవాని • సమతఁగాంచు

గీ. చటులగంభీర భాగ్యర•క్షణవచస్సు
కీర్తి భోగ సంగ్రామభ•క్తి బలకాంతి
విజయనియమంబులను సాటి • పృథివిఁగలరె?
శ్రీకరుండగు పుల్లయ•రెడ్డిపతికి.

సీ. రాముండు యాదవ • రాముండు కల్పకా
రాముండు బలశౌర్య • కామదముల
మారుండు గంగా కు•మారుండు భవ్య కు
మారుండు రూపధీ•సారగరిమ
భరతుండు శ్రీరాజ•భరతుండు జగమ్మృగ
భరతుండు భక్తి సం•భరణకాంతి
భద్రుండు ప్రౌఢసా•భద్రుండు శ్రీరామ
భద్రుండు శృంగార • పటిమనియతి

గీ. చంద్రుఁడా హరిశ్చంద్రుండు • సరసకళల
సత్యవాగ్వృత్తి నని జనుల్ • సన్నుతింప

రెడ్డికులభూషణుండయి ♦ శ్రీవహించి
ప్రబలె నారలింగారెడ్డి♦ప్రభువరుండు.

శా. రామారెడ్డి వెలింగెఁ దన్నుఁ గని యా•రాకేందు బింబాననల్
రాముండంచును సోముఁడంచును దమిన్ ♦ రంభామనోహారియా
శ్రీమంతుండను చంద్రహాసుఁడనఁ దన్ ♦ జిత్రింబు లుద్యానపుర్
సీమం జేర్చు వసంతుఁడంచు మదిం•జెన్నారఁగా గాంచుచున్.

సీ॥ తలఁచెనా! యొకమాటు • దయచేసి మాధవ
స్వామి కన్నెదుటఁ బ♦చారుసేయుఁ
బిలిచెనా! యొకతూరి ♦ భీతిల్లి వైరులు
తలలపైఁ జేమోడ్పు • దాల్పవలయు
గొలిచెనా! యొకతేపఁ ♦ గొంగులవరహాల
గవులు కుబేరుపైఁ ♦ గవియవలయు
వలచెనా! యొకసారి • నలకూబరుసిరంభ
కుదవిచ్చి తీర్పఁజా•లదు ఋణంబు

గీ॥ పొలిచిన మరొక్కమారు వి♦భూషణములు
చీనిచీనాంబరముదాల్చి • చిన్నప్రాయ
మునను నుదయించు భానుని ♦ మురువుజూపి
మురిపెములఁబెంచు గోరంట్ల♦భూవిభుండు.

సీ॥ కమనీయభంగ మం♦గళరావ తుంగభ
ద్రానదీ జలముల ♦ స్నానమాడి
సౌవర్ణకటిసూత్ర • సమితి కాంతులు గ్రమ్మ
వలిపెమడుంగు చ♦ల్వలుధరించి
పరిపూర్ణశశిరీతి ♦ భాసిల్లు ముఖముపై
కమనీయభూతి రే♦ఖలనుదీర్చి
పరిశుద్ధకాంచన • పాత్రల జలములు
గంధపుష్ప ఫలాది•కములు చేర్చి

గీ॥ భక్తిఁ బద్మాసనస్థుఁడై • పద్మనాభు
దానవాంతకు హరిని మాధవునిఁ బూజ
సేయువేళలఁ బ్రత్యక్ష • శివుఁ డనంగఁ
దోఁచు గోరంట్లవిభుఁడు నిర్ధూతభవుఁడు.

శా॥ గోరంట్లాధిపు పూజలన్ మరగి వై•కుంఠుండు క్షీరాంబుధిన్
గౌరీశుండు తుషారశైల వసతిం • గాంక్షించుటల్ మాని ల
క్ష్మీరాజీవముఖిన్ భవానినిఁ దమిం•జేరంగ రాఁబిల్చి తా
ర్స్వారంబైన నివేదనోదనము నా • స్వాదింతు రెల్లప్పుడున్.

శా॥ పుల్లారెడ్డియు వెంకమాంబికను స•త్పూర్ణ ప్రభాజాలకన్
హ్రల్లోలంబుగఁ బెండ్లియాడి కనియెన్ • హీరాహిరాట్చంద్రికా
ఫుల్లాంబ్జాత శశాంక శారద మహాం•భోవాహ దివ్యాపగా
కల్లోలాయితకీర్తి భాస్వరుని సం•గ్రామైకపారీణునిన్.

కం॥ దనుజారియెడను భక్తిని
వనధిని లంఘించునట్టి • బలసంపత్తిన్
హనుమంతుఁ బోలఁ బిలిచిరి
హనుమంతయరెడ్డి యనుచు • నార్యులు ప్రీతిన్,

సీ॥ వెలయ నెచ్చట శిలావిగ్రహంబులుగన్న
నచ్చట దేవాల•యములు దీర్చు
నెచ్చటఁ బ్రజ నీటి•నెడగాఁగఁ గన్గొన్న
నచట బావులుఁద్రవ్వ • నర్థమిచ్చు
నెచ్చట శివలింగ • మీక్షించు నది వార
ణాసి యుం చభిషేక•మలరఁజేయు
నెచట బీదజనంబు • లెదురైన నచ్చట
నన్నసత్రంబు లె•న్నైనఁబెట్టు
గీ॥ నెచటఁ బరకాంతలంగను • నచటఁ దనదు
మాతృదేవతలని ప్రక్క•మార్గమొదుగు

కలరొకో నృపుల్ మూఁడు లోకముల వెదుక
శ్రీకరుఁడగు హనుమంత రెడ్డిసములు.

గీ॥ శ్రీమహీసతుల హరి వరించినటుల
చుట్టములు మెచ్చ వరియించె శుద్ధమతుల
నిర్వుర ననంత దేవి సుమిద్ధచరితఁ
బాపమాంబను సంతోష భరితుఁడగుచు.

కం॥ ఆయిర్వురు తరుణులయం
దాయుశ్శ్రీయుతుని సుగుణు నాత్మజు నొకనిన్
శ్రీరామోపాసమ రూప
ధ్యేయులఁ బుత్రికలఁగనియె నేపుర నెలమిన్.

ఉ॥ బాలుఁడు బాలికామణులు బంధులు మిత్రులు సోదరుల్ యశ
శ్శీల విచారులౌ సతులు చేయుచుఁ గన్నులపండు వెప్పుడున్
బాలును బాయసంబు దన పంక్తినిఁ జేరి భుజించుచుండ నా
పాలనముద్రిఁడట్లు కను పట్టును రెడ్డియుఁ దత్కుటుంబమున్.

గీ॥ నాసహోదరి లక్ష్మి యనంతమాంబ
యందు జన్మించె శ్రీలక్ష్మమాంబ యనఁగ
విదుతు నేయంచు శివరాము విభుని పేరఁ
బాపమాంబకు జన్మించెఁ బద్మవైరి.

క॥ శివరామవిభుఁడు పెరిగెను
శివరామపదారవింద సేవాపరుఁడై
శివతనయు విక్రమంబును
శివవైరి సురూపగరిమ చెలఁగఁగఁ దనకున్.

గీ॥ మున్ను గోవిందునకు వర పుత్రిలక్ష్మి
నర్పణము సేయు క్షీరాబ్ధి ననుకరించె
వేడ్క హనుమంత రెడ్డి గోవింద రెడ్డి
కాత్మజాతయౌ శ్రీలక్ష్మమాంబ నిడఁగ.

క॥ కులమూల లక్ష్మిరెడ్డికిఁ
గులపావన యగుచు నొక్క • కూఁతురు గలుగన్
లలితుఁడు శివరామయ యా
లలనామణిఁ బెండ్లి యయ్యె • లక్ష్మాంబికనున్.

మ॥ కరుణాపోషిత విద్వదాశ్రితుఁడు లిం•గారెడ్డి కందర్ప సుం
దరుఁ డాత్మీయ సుహృ[illegible] కలిత • న్యాయైక చిత్తన్ రమా
చిరకారుణ్య కటాక్ష పూర్ణ విభవ • శ్రీ కేశవాంబన్ గుణో
త్తరఁ బాణిన్ గ్రహియించి సౌఖ్యనియతిన్ • దామించె గేహస్థతన్.

గీ॥ అట్టి కేశవాంబిక యందు • నతఁడు గనియె
సుతుల నిర్వార సౌందర్య • సూనశరుల
సుగుణ ఖనిని శేషారెడ్డి • నగసమాన
ధీరు సంజీవరెడ్డినిఁ • దేజమెసఁగ.

గీ॥ సోమసూర్యుల యట్లు ల•స్తోకకాంతి
భూషితాన్వయ ముఖ్యులై • శేషిరెడ్డి
శ్రీకరుండగు సంజీవి•రెడ్డి యన్న
దమ్ము లలరిరి వినయ సం•ధానములుగ.

క॥ పుల్లారెడ్డి కుమారిక
సల్లాపిత శైలజాత • సౌభాగ్య యశో
వల్లీ వేల్లిత జగతీ
హల్లోహలమైన లక్ష్మ•మాంబిక చెలఁగెన్

గీ॥ తండ్రి యాజ్ఞ శేషారెడ్డి • ధర్మపత్ని
యై పతివ్రతా రత్నమై • యవని సురలఁ
బెంచు కల్పకలతికయై • వెలయఁ జేసె
నుత్తమయశంబు లక్ష్మాంబ • యుభయకులము.

శా॥ అన్నంబిచ్చు క్షుధార్తసంతతికి ద్ర•వ్యంబిచ్చు నర్థార్థికిన్
వన్నెల్ గుల్కెడు సేల్వలిచ్చు కవికిన్ • వైవాహికాపేక్ష చేఁ

దన్నున్ వేఁడినఁ దీసియిచ్చు నగలుం • దద్బాంధవుల్ సోదరుల్
కన్నుల్ సన్నమెలంగఁ గీర్తిగొనె వీఁ•కన్ బెద్దలక్ష్మాంబయున్.

క॥ గోరంట్ల విభుఁడు మెచ్చిన
కోరికతో ధర్మ సతిగ • గోవిందాంబన్
ధారుణిసురవరధర్మా
చార విధిం బరిణయంబు • సలిపెం బ్రీతిన్.

గీ॥ అంతగోవిందమాంబిక • యఖిలవేళ
లందు గోరంట్లరెడ్డికి • నధికభక్తిఁ
బూజసేసెడు సాధ్వియై•పుట్టినిల్లు
మెట్టినిల్లును యశముచే • మెచ్చఁ జేసె.

సీ॥ పతి తురంగము డిగ్గి • పఱతెంచు నెడఁ దక్క
తలవాకి లెఱుఁగ దా • ధన్యచరిత
శ్రీదేవిపైఁ దుల•సీదళం బిడునప్డు
దక్కఁ జూపదు వ్రేలు • ధర్మశీల
అతిథుల కన్నంబు • నతిప్రేమ నిడువేళఁ
గాక చూపదు చేయి • కన్నతల్లి
ఉత్తమామల శరీ•రారోగ్య ప్రశ్నకై
కాక మాటాడ ద•స్తోకపుణ్య

గీ. కవులు తననాథుపైఁ జెప్పు • కబ్బములను
వినుటకేకాక చెవియొగ్గ • దనఘచరిత
విందుమా ? కందుమా ? యుర్వి•యందు ముందు
సాధ్వి గోవిందమాంబకు • సాటిసతులు.

కం. మున్నూటఱువది నోములు
వెన్నుని మదిఁగూర్చి చేసి • వినుతయశస్సం
పన్నినిఁగని రోకనుతు జన
సన్నుతు గోరంట్లనృపతి • సదయుం బ్రీతిన్.

గీ. సతిపతుల్ పూర్వజన్మంపు ♦ శతమునందుఁ
బరగఁజేసిన సుకృతంపు ♦ ఫలమనంగ
దినదినంబున కొకరీతిఁ ♦ దేజరిల్లు
చుండి ముద్దులుగురియించు ♦ చుండె నతఁడు.

గీ. సాంద్రతనుకాంతి శ్రీరామ♦చంద్రురీతి
చిన్నివెన్నెల నగవుల ♦ చిన్నికృష్ణు
తీరు తమకన్ను లలరింపఁ ♦ జేరు నిడిరి
ప్రీతి నార్యులు శ్రీరామ♦కృష్ణ యనుచు.

సీ. భిన్నస్వరూపులై ♦ పృథివిఁ దోఁచినతప్పు
కారాగృహస్థలిఁ ♦ గనినమాట
మేనమామనుబట్టి ♦ మృతునిఁజేసినరట్టు
చాఁకిని దాఁకిన ♦ లోకనింద
గోపకాంతలతోడఁ ♦ గూడి యాడినవాదు
నాలమందలఁగాచు ♦ నపయశంబు
నిలిచి కాళిందిఁ జ♦ద్దులు మ్రింగుదోషంబు
గొల్లవారలు బెంచు♦కొనిన మచ్చ

గీ. నపుడు బాపంగఁ దగు నుపా♦యంబులేక
నేకమూర్తిని మనరామ♦కృష్ణు లుదయ
మొంది రవని గోరంట్లయ్య♦యందు ననఁగ
రామకృష్ణయ్య వెలయు ధ♦రాతలమున.

సీ. పష్టివస్త్రముఁ గటి♦స్థలుల బిగించిరి
సరిగదోవతులు పిం♦జలు ఘటించి
తామ్రపాత్రలుమార్చి ♦ తాపింపనేర్చిరి
రమ్యసౌవర్ణ పా♦త్రలను మణులు
నీవారపిష్టముల్ ♦ నిలిపి వడ్డింపంగ
నేర్చిరి భక్ష్యాన్న ♦ నిచయములను

తులసిపేరులుదీసి ♦ తలదూర్చ నేర్చిరి
నవరత్నహార సంతతులనందుఁ
గీ॥ బ్రిబల తుంగభద్రాతీర ♦ వాసులైన
మధ్వ వైష్ణవాచార్యుల ♦ మందిరముల
దినదినంబున దైవము ♦ దిన్నెయందు
మెచ్చి రామకృష్ణయు దాన ♦ మిచ్చునాఁడు.

సీ॥ కవివచ్చె ననిచెప్ప ♦ కడువేగఁ దోడితె
మ్మనుఁగాని వచ్చుఁ బో♦మ్మనుట లేదు
అవధాను లెవ్వరైన ♦ నరుదేర సంభావ
నల నిచ్చుటేగాని ♦ నాస్తియనఁడు
వేదాంతు లెవ్వరైన ♦ వేంచేయ సేవింప
నెదురేగుఁగాని నా ♦ కేమియనఁడు
శాస్త్రజ్ఞుఁడన్న వి♦శ్వాసంబుతోఁ బిల్చు
కొనుఁగాని గర్వంబు ♦ గొనుట లేదు
గీ॥ అతిథు లెందఱువచ్చిన ♦ నందఱికిని
భక్ష్యసాహిత్య మిప్పించి ♦ పంపుఁగాని
కొసరి విదిలించి మిగిలించు♦కొనుట లేదు
సాటియెవరు? మారామ కృ♦ష్ణయకు మహిని.

శా॥ చేయించెన్ ధన మిచ్చి సత్కవులకుం ♦ జెన్నారఁ బెండ్లిండ్లనున్
వేయించెన్ వరవేంకటేశ్వరునకున్ ♦ వెయ్యార్ల హారంబునున్
మాయించెన్ బహుఘోర శాత్రవ మదో♦న్మాదంబులన్ దిక్కులన్
మ్రోయించెన్ నిజకీర్తి దుందుభుల నా♦పుణ్యుండు సామాన్యుఁడే?

మ॥ వనముల్ సత్రములున్ శివాలయము దత్రి♦వ్యస్థాన ముర్వీసురా
వనముం గూప తటాక కావ్యసుకళా♦వాసాది నిర్మాణముల్
మనుజాధీశులు మెచ్చగా సలిపె రాం♦మారాయ సౌహార్ద సం
జనితానల్పవివేక సంపదలు మిం ♦ చన్ రామకృష్ణుండొగిన్.

సీ॥ భాసిల్లు కొంగన ♦ పాటి రామామాత్య
ఘనబుద్ధి యేతెన్ని ♦ కన్నతండ్రి
అఖిల సద్గుణవతి ♦ యనఁదగ్గ లక్ష్మమాం
బిక [illegible] ♦ [illegible] జనని
వినయవిధేయ [illegible] ♦ [illegible]
[illegible] ♦ [illegible]
సుకృత పాతివ్రత్య ♦ [illegible] మానసమున
సందారి యేయు [illegible] ♦ [illegible] సద్భక్తి

గీ॥ అఖిల గురుదేవపూజ స ♦ త్యాభిరతిని
ధర్మశీలంబు లేతెల్లి ♦ నర్మసఖులు
అట్టి కృష్ణమాంబిక పెన్ని ♦ [illegible] లంగఁ
గీర్తి గాంచుచుండు శ్రీరామ ♦ కృష్ణవిభుఁడు.

సీ॥ ఏకోదరత్వ ధ ♦ ర్మైకదీక్షను గాంత
లిరువురు శుశ్రూష ♦ లెలమిఁ జేయఁ
దమ్ములిద్దరు భక్తి ♦ గ్రమ్మ నిత్యంబాజ్ఞ
గైకొని కార్యసం ♦ ఘటనసలుప
నన్న యెన్నఁడు తన ♦ కన్నతండ్రిగ నెంచి
పెత్తనంబు వహించి ♦ ప్రేమ నెఱప
రసికుఁడే శ్రీ సుబ్బ ♦ రామ శాస్త్రియు గురు
భావంబునను శాస్త్ర ♦ శక్తిఁ దెలుప

గీ. తోడునీడయై తనమేలు ♦ జాడఁజూచు
చుండ మైత్రిని రామరా ♦ యుండు సతము
రామకృష్ణాభిధుండు శ్రీ ♦ రాయుఁడట్లు
ప్రబలెఁ బ్రబలుచు నున్నాఁడు ♦ ప్రబలఁగలఁడు.

సన్తంతములు.

కం. ఏవంవిధ గుణపాళికి
భూవందిత కీర్తివిభవ ♦ పుణ్యావళికిన్

శ్రీవినయ నీతిశాలికి
భావిత గౌరీశరచరణ • పంకజతలికిన్.

కం. సుందరమందిర వాసికిఁ
గందర్ప సమాన తను వి•కాసికి ముఖని
ష్యందవచో మధురాశికి
బందీకృత రిపుముఖాబ్జ • పార్వణశశికిన్.

కం. కుందసుధాబిందు రమా
మందిర శరదిందు హీర • మందాకిని శ్రీ
చందన చంద్ర శరద్ఘన
సందోహ సమానకీర్తి • సంపత్కునకున్.

కం. సాధుసమూహ సదావన
మాధవ పాదారవింద • మకరంద రసా
రాధన హేలికి గురుసం
బోధిత సకలార్థవినుత • పూజ్యావళికిన్.

కం. నందిత భూసురునకు గో
విందాంబా గర్భవార్ధి • విధుసారునకున్
స్పందిత పాపునకు మహా
నందాంబా చిత్త నూత్న • నళినాస్త్రునకున్.

కం. జిష్ణుసమాన విభవ వ
ర్ధిష్ణునకున్ దళితపాప • తృష్ణాంగునకున్
గృష్ణమ దేవీమానస
కృష్ణోపమునకును రామ• కృష్ణున కెపుడున్.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన వజ్ర
నాభచరిత్రం బను మహాప్రబంధమునకు కథాక్రమం బెట్టిదనిన.

# కథాప్రారంభము

క. శ్రీతరుణీ కరుణాసం
జాతమహాభాగ్య విభవ ♦ సారసనేత్రా!
నూతన చేతోభవ! సం
గీతరసావేశ! రామ♦కృష్ణ మహీశా!

గీ. అవధరింపుము మున్ను సం♦యమిగణంబు
నైమిశారణ్యమునఁ గొన్ని ♦ నాళ్లు వరకు
సత్రయాగ దీక్షావిధుల్ ♦ జరుపుచుండి
సూతుఁగని భక్తిమ్రొక్కి సం♦స్తుతులఁబలికి.

గీ. బ్రహ్మఋషిచంద్ర! సర్వ పు♦రాణవితతిఁ
దమకుఁ దెలియనికథ యొండు ♦ ధరణిలేదు
గాన శివపురాణాంతర ♦ కథయొకండు
తెలుపుమన. రోమహర్షణి ♦ పలికె నిట్టుల.

శా. గంగా దివ్యతటంబునన్ రుచిర దు♦ర్గశ్రేణి శృంగస్థలీ
సాంగత్యభ్రమదంబువాహపటలీ ♦ సంసేవ్యమై సర్వదా
శృంగారోన్నత సౌధరత్నవిలస♦త్సీమాంతమై భూసతీ
మాంగల్యంబననొప్పు నొక్కపురి తా♦మాణిక్యనామంబునన్.

సీ. రమణీయభవనాంత ♦ రమణీయభవకాంత
రమణీయ మునికాంత ♦ రాజితంబు
కమలాకర నవీన ♦ కమలాకరాళీన
కమలాకరవినోద ♦ కామదంబు
రథవరాధిప మనో♦రథపూరణీయాతి
రథవీరతురగ వి♦ద్రావిదంబు
పావనపాంథ కృ♦పావనతరువన
పావనసంచార ♦ భాసురంబు

గీ. సుభట సందోహసంచార ♦ సులభకలభ
ఘంటికారావ ఘూర్ణితా♦ఖండవైరి
సేవ్యమానశృంగాటక ♦ శ్రేణికావి
లోక్య బహుజానపదము మా♦ణిక్యపురము.

మ. శశిబింబంబులువోలె నూతన సుధా ♦ సారావలేపంబులై
పశుపత్యద్రియుఁబోలె నుజ్జ్వలమణి ♦ ప్రాలంబ శృంగంబులై
దశకంఠారిశరాళివోలె వసుధా ♦ త్రాణైక దక్షంబులై
దిశలం గాంతుల నించు తన్నగరి పీఁ్ధిఁ రమ్యసౌధావళుల్.

గీ. ఒక్కచక్రంబు ధరియించి ♦ యుర్వియందు
నుత్తమయశంబుగానఁ బురు♦షోత్తముఁ డను
చక్రియుగ్మంబుదాల్చి భూ♦చక్రమంత
తిరిగుబలమును గాంచెఁ ద♦త్పురి రథములు.

మ. క్రోలిఁ దాఁ బేలు ఫణీశుఁ డాదికిటియుం ♦ దోడ్తోన లోఁ తుంగనక్ర
దొలికల్పంబునఁబోయి రారనుచుఁ గుం♦దుం జెంది తద్వంశజుల్
కలశాబ్ధిఁ శిపుకంఠమందుఁ దగి పైఁ♦గానెత్తి భూమిం గృతా
ధ్రులుగాకున్న నగడ్త నెన్నఁదరమా? ♦ రూపింపఁగా నయ్యెడన్.

చ. సురపతిపైనిఁ గిన్క బెర ♦ చోటను స్వర్గము జేయుచున్న వి
స్ఫురమతి గాధిరాజు వర♦సూనుని ధాటిభజింప నర్ధమై
విరచనసేసి నిల్పిన త్రి♦విష్టపవాహినిఁబోలె నొప్పుఁ ద
త్పురవరసౌధపుం బవన♦ధూత సుకేతు దుకూలవల్లి తాన్.

ఉ. శైవలముల్ జటావళిప♦సం గన నూత్న మృణాళవల్లికల్
శీవిని సర్పహారచయ ♦ లీలఁ జెలంగ సరోజపాళి సు
త్రివిధుమాలికల్ బలెను ♦ జెల్వొసఁగంగ సరోవరంబు లా
దేవవితానవంద్య శివ♦దేవునిరీతిగ నొప్పు నప్పురిన్.

సీ. హరిదశ్వ సప్తాశ్వ ♦ ఖురభిన్న బహునాళి
కేరాగ్రఫల గళ♦ద్వారితతులు

చంద్రబింబోన్నత • సౌధాగ్రచంద్రాశ్మ
నిర్యాతశీతల • నిర్ఝరములు
బంధవైకృత గంధ•సింధురసుకపోల
విగళిత దానాంబు ♦ విస్రవములు
ప్రత్యూషవాతాంకు♦రప్రాప్తసౌగంధ్య
గంగాధునీ వారి♦కణగణములు
గీ. ప్రాంగణస్థ లతాద్రుమ♦పాళి కుసుమ
జాల సురభి పరాగ వి♦స్తార గమన
సుఖము లతినూత్న చిత్ర సం•శోభితములు
వీధు లింపొందుచుండు న•వ్వీటియందు.
గీ. గారుడోపల వేదికా • కల్పవృక్ష
సుమ సమవతీర్ణ దేవతా ♦ సుందరీదు
కూల చేలాంచ లాగల • లాలితార్భ
కంబులై యొప్పు నచటి ప్రాం♦గణము లెపుడు.
ఉ. చుట్టు నగడ్త తోయనిధి ♦ సొంపు రహింపఁగ శృంగ కోణముల్
మెట్టియు ధాళధళ్యరుచి • మించు సురాపగ భోగిశయ్యగా
నట్టడులం జెలంగు వర ♦ హాటక దీప్తులు పచ్చవల్వగా
దిట్టగ వెల్గుఁ దన్నగరి ♦ తీర్చిన కోట రమేశు చాడ్పునన్.
శా. మాణిక్యంబుల నమ్ము వర్తకు లొగిన్ ♦ మధ్యాహ్నకాలంబునన్
రాణం బొప్పఁగఁ జిన్నికన్నెలను బే♦రంబాడఁ బంపింప వి
న్నాణం బొప్పఁగ బిచ్చగాండ్రకును జొ♦న్నల్ దీరుపెట్టింతు రా
మాణిక్యాఖ్యపురంబు వీధులను సా♦మాన్యంబె లెక్కింపఁగన్.
గీ॥ మించియట నున్న శిల లెల్ల • మంచిమణులు
అచటి బావుల జలమెల్ల • నమృత రసము
మీటి యటఁ బుట్టుతరులు మం♦దారతరులె
ఆపురంబెన్న శ్రీసతి ♦ కాపురంబు.

సీ. దక్షిణాశా పర•త్వము లేని ధర్ములు
సర్వ భక్షత లేని ♦ జాతవేదు
లేవేళ గమనంబు ♦ లెఱుఁగని పావనుల్
అప్పు దెచ్చియుమీ్రంగ♦నట్టి ఘనులు
వరుణాశకనురాని ♦ వరధీ ప్రచేతనుల్
మూలఁ జేరని యట్టి • భూతహితులు
కిన్నరేశులుగాని ♦ కేవల ధనపతుల్
తామ్ర చూడులు గాని ♦ దైవతాఢ్యు
గీ. లనుచు జగమెల్ల నుతియింప ♦ నాగమాంత
మహిమ ధాతకుఁ దలకొట్ల♦మారితనము
బాపు సారస్వతాధీశ • ప్రతిభమించి
వెలయుచుందురు తత్పురి ♦ విప్రవరులు.
సీ. వేయి కన్నుల లోక•వితత నేలెనుగాని
గురునింటి తప్పుఁ గ•న్గొనఁగ లేఁడు
ఇఱువది యొకమారు ♦ ధరగలంచెనుగాని
దశరథాత్మజు వ్రేటు • దప్పు కొనఁడు
దానవత్ప్రభుత తాఁ ♦ దాల్చి మించెనుగాని
చెవుల పోగులమాట • చెప్పికొనఁడు
విజయ శీలుఁడ నంచు ♦ విర్ర వీఁగెనుగాని
పేఁడిగా నుండిన ♦ వెలితిఁ గనఁడు
గీ. అనుచు నిందించి రాముని ♦ వినతనూజు
నర్జునుని మెచ్చుగొనక నిం•ద్య ప్రభుత్వ
మచ్చుపడ నెదు రేమిట • ననక బలిసి
ప్రబలుచుందురు రాజు లా • పట్టణమున.
సీ. చెలిమికాఁడగు రాజ♦శేఖరు భిక్షాట
నము సిరులిచ్చి మా•న్పంగ లేఁడు

నిలుపు నీరైతన ♦ నెలువున వసియించు
ఘనుల కప్పా నొసంగి ♦ మనుపలేఁడు
చక్కని కొడుకు సంచ్చర మిన్న గొంపోవఁ
జూచి పెండిలిమాట ♦ చూడఁ డాసు
సకలంబుఁ బోయి క్షాత్రిశికవృత్తి తనరాజు
నొవ్వఁగా నిధి యొండు ♦ నివ్వలేఁడు
గీ. ఏటి ధనదుండు వీని కిం ♦ కేల రాజ
రాజ బిరుదంబు సరిపోయెఁ ♦ బ్రాఁత నిధులు
నవనిధుల నమ్మి యప్పీయ ♦ న్యాయమగునె?
యనుచు వైశ్యులు బల్కుదు ♦ రప్పురమున.
సీ. ఆజన్మముగను కృతార్థత గనుమను
చును దమ జన్మ భూమిని నొసంగి
సంకర్షణోపాయ ♦ సాధనవ్యాప్తికి
డంబమైయొప్పు శూలంబు నొసంగి
బహుభార భరణ దూర్వాశక్తి వహియింపఁ
గమనీయ వృషభరాజము నొసంగి
వరజగద్బీజ జీవన కార్యనియతికై
పోడమైనట్టి సైంధోఁడు నొసఁగి
గీ. ఓషధీనాథు తలపైని ♦ నొప్పఁ బెట్టి
పంపినను లేమిబాయని ♦ పార్వతీశు
భైక్షవృత్తిని మాన్పడు ♦ భాగ్యవంతు
లంఘ్రిజన్ములు వెలయుదు ♦ రాపురమున.
సీ. పసిమొగ్గ లివియేల? ♦ పణఁతి! విచ్చునె?–నేఁడు
కొనుము రేయికి విచ్చు ♦ కొనుము సామి!
పూలచెండ్లింతిరో! ♦ ముందు చూపింతువే?—
కొందువే చూపింతు ♦ గుడ్డదీసి

కై దండ విలచెప్పు ♦ కాంత! యింతియెచాలు-
ముందొక్కనికి మాట ♦ పోయె సామి!
ననలేమి? యివిచాన! ♦ నయముగాఁ గట్టితి-
ముట్టబోకుము వాఁడి ♦ పోవునుమ్మి
గీ. అనుచుఁ గొననచ్చు కోడెగాం♦డ్రను మిటారి
చూపులను రూపులను మారు♦తూపులటుల
సొలయఁ జేయుచు వీథులఁ ♦ బిలిచి విరుల
విలుచుచుందురు పుష్పలా♦వికలు బురిని.

చ. ఉరగతతుల్ గ్రసించెనని ♦ యొయ్యన గాంగతరంగ దివ్యశీ
కరముల మున్ని తీరములఁ ♦ గమ్మని పుష్పపరాగభూతినిన్
దిరముగఁదాల్చి వాసనల ♦ నింపుచుఁ గేళినిఁ జొక్కుచున్న సుం
దరులకు హాయినేయ సత♦తంబట వేకువ వాతపోతముల్.

చ. దిన మొకలక్ష యోజనగ♦తిన్ దిరుగంగ ననూరు వ్రేటునుం
దినునట యేఁడుగుఱ్ఱములు ♦ దెచ్చెఁ గులంబున కెల్ల లోటు ద
ద్దినకరుతీరు తిప్పమె తు♦దిన్ మనతోఁకకుఁ గట్టనంచుఁ బ
ల్కిన గతిఁ దోఁకలెత్తి సకి♦లించును దత్పురి యశ్వరాజముల్.

ఉ. కోఁతులఁ గొండముచ్చులను ♦ గోయని పిల్చి మహాబ్ధిగట్టియున్
సీతను దెచ్చెపో! దనుజ♦బృందము రాముఁడు తా వధించె మున్
జాతుమె? నాఁడు మమ్ము దరి♦జొన్పినఁ దొక్కమె? వార్ధిదిబ్బగాఁ
గోతుల బెట్టమే? దనుజ♦కోటిని నందురు తత్పురిన్ భటుల్.

సీ. పూఁవచన్నుల నాఁడె ♦ ముందునాది 'సవాల'
టంచుఁ బంపిన నగ♦లెంచుకొనక
పాట పాడుటకె యీ♦పదివేలు కొమ్మని
మెచ్చిపంపు వరాలు ♦ మెచ్చుకొనక
అభినయ పాండితీ ♦ విభుతకే ధరియింపు
మని పంపు బిరుదంబు ♦ లందుకొనక

మొదటి కన్నెతీకంబు • విధికె కోటిధనంబు
నిచ్చెదనను మన్వ • కిచ్చగొనక
గీ. సాహుకారుల దొరల నిం•చ్చకములందు
మనను బోనీక భారతీ • ఘనకుచంబు
లుండు రసికాగ్రణిమె మాకు • నిండఁ డనుచు
మెలఁగుచుందురు వేశ్యకాం•తినులు బురిని.
ఉ. గాయకజాల మాపురినిఁ • గమ్మని తేనెల సోనలూఱ వ
హ్వాయని యప్సరోగణము • లబ్బురపాటునఁ గౌఁగిలింప నా
రాయని నారదుండు కల•హాశనతన్ విరమింపఁ బాడుచున్
బోయుదు రచ్చ వాగమృత•పూరములన్ జనకర్ణ పాత్రలన్.
మ. సుకవుల్ తత్పురిలో మెలంగుదురు వాణీభావతీసంతత
ప్రకటానల్ప కటాక్షవీక్షణల స•త్పాండిత్య శౌండీర్యులై
సకలోర్వీధవమౌళిపూజిత సమం•చత్పాద పంకేజ ది
వ్యకృపాలోకన మాత్ర ధన్యకృత వి•ద్వచ్ఛిష్య సంసేవ్యులై.
సీ. నునుపైన పెందొడ • లెనయుకంబములుగా
గొనబు టొడ్డాణముల్ • గొలుసుగాఁగ
పొక్కిళుల్ పైఁగప్పు • భూరిగర్తములుగా
వళిచయంబిఱుకైన • బాటగాఁగ
గ్రొమ్మించు మైచాయ • రుచిరమౌ సరసిగా
నును మోవు లందుగ•వనలుగాఁగ
గబ్బిగుబ్బలు పైగ • గఱువుకుంభములుగా
లేఁజూపు ప్రక్కబ•ల్లెములుగాఁగ
గీ॥ చారుకచపాళి చీఁకటుల్ •సవదరించి
స్పర్శసుఖమును వాంఛించు • సరసయువక
గజకిశోరంబులకు మాటు • గాచుచుంద్రు
యువతు లెనలేని సౌందర్య • మొప్పి యచట.

ఉ. నీలతమాలకుంజముల • నిత్యము వేడుక నాడువేళఁ ద
త్కేళితమాలదీధితిత•తిన్ విరుచిన్ రవి సంచరింప మా
మేలొనఁగూర్ప రాత్రి యిదె • మెల్లనవచ్చె నటంచుఁ గేళులం
దేలఁగఁ బూలసెజ్జలకు • నెట్టనఁబోవు నవోఢ లుం దర్రటన్.

కం. చవిగొని యుప్పరి జలజా
సవముం గొని యుళులుసేయు • ఝంకారంబుల్
సవరించి చెలఁకు మదనుఁడు
యువతుల వెనువెంటఁ జేయు • హుంకారంబుల్.

ఉ. జారహృదీప్సితంబులను • జారిణికిం దదధీనవృత్తముల్
జారునికిన్ రహస్యముగఁ•జాటుచుఁ గోరిక లంతకంతకున్
వారికి హెచ్చఁజేయుచు న•వారిబహూకృతు లందుచున్ మహో
దారత నానుకొ్రలటు • తత్పురిలోఁ జరియింతురి దూతికల్.

గీ. ఆపురంబును వర్ణింప • నలవియగునె
వేయితలలుండు నాభోగి•విభున కైన
అమరు లమరావతీసుఖం • బపహసించి
యచట నివసింప నేవేళ • నభిలషింతురి.

ఉ. ఆనగరిన్ వసించును ధ•రామరుఁ డొక్కఁడు పుణ్యశాలి వి
ద్యానిధి సర్వవేద వివి•ధాగమవేది మహాధ్వరక్రియా
నూన విధానదీక్షితుఁడు • నూత్నకళావిభవాభ్యతాంశుఁడ
మ్లానవచః ఫణీంద్రుఁ డతి•మానుష సుందరగాత్రుఁ డున్నతిన్.

ఉ. శాంతుఁడు సత్యవాగ్రతుఁడు • సాధుచరిత్రుఁడు సద్విచారుఁ డ
శ్రాంతకృపాసమన్వితుఁడు • సజ్జనసంస్తవనీయమూర్తి యా
శాంతయశోవిశాలుఁ డురు•శాస్త్రవిలోకన లబ్ధదివ్యధీ
సంతత గీష్పతీకృత సు•శాసితశిష్యుఁడు వజ్రనాభుఁడన్.

మ. జపముల్ హోమము తర్పణంబు నిరత•స్వాధ్యాయసంపత్తియుం
దపముల్ దానము శిష్యపోషణము శ్రౌ•తస్మార్త సిద్ధాంతముల్

కృపయుం గల్గుట జూచి పాత్రుఁ డని ధాత్రీనాథు లేమిచ్చినన్
చపలత్వంబునుబొంది కైకొనఁడ యాశామగ్నుఁడై యెన్నఁడున్.

చ. వయసున సోమయాజి రసవత్కవితాధికతన్ గ్రహించు దు
ర్జయుఁడు కుతార్కికోక్తులకు జంకఁడు చక్కనివాఁడు శాంకరీ
దయకును బాత్రుఁ డింక ధన ధాన్యములా మఱిలెక్క లేదు యెం
తయు మహనీయుఁ డుత్తముఁడు ధన్యతముం డిఁక నేమికావలెన్?

మ. మునుబెద్దల్ గడియించినట్టి ధనమే మూల్గున్ సతం బింటిలో
దినముల్ మాన్యపుభూమి గుత్తలను వృద్ధిం బేర్చి పంపింతురో
య్యనరైతుల్ తనమామ మున్నిడిన ద్రవ్యం బెంతయో లెక్క లే
దనఁగా స్వీయధనంబు జెప్పఁదరమా నా! తద్ద్విజస్వామికిన్.

గీ. సుగుణపుంజంబు వజ్రాలశోభతోడ
నతని ప్రాక్కాలి వీడక నాశ్రయించు
కతన వజ్రనాభుం డను గౌరవంపు
పేరితోఁ బిల్తురెన్నఁ డా పృథ్వీసురుని.

సీ. యాత్రికు లెవరైన నరుదెంచిరని విన్న
నెంతదూరంబైన నెదురుఁబోవుఁ
బోయి తత్పాదముల్ మ్రొక్కి యింటికిఁ బిల్చుఁ
బిల్చియాతిథ్యంబుఁ బ్రీతినిచ్చు
యిచ్చి దివ్యాన్నంబు హెచ్చుభక్తినిఁ బెట్టుఁ
బెట్టి కూర్చున్న మేల్ విడెమొసంగు
ఒసఁగి మేనికిహాయి నొసఁగు వీవన వీచు
వీచి యిష్టాగోష్ఠి వెలయఁ జేయుఁ

గీ. జేసి పర్వత వన సరిత్క్షేత్రతీర్థ
ముల విశేషంబు లెంతయుఁ దెలియఁగోరుఁ
బ్రతిదినంబునుదీర్ఘయాత్రను రచింపఁ
దలఁచుచుండును నావిప్రకులబలారి.

సీ. ఒకమారు సుఖముగా ♦ సుకవిత్వము రచించి
వినిపించి శిష్యులఁ ♦ దనియఁజేయు
ఒకనాఁడు హాయిగా ♦ నోలయు వీణియువిూఁటి
యానందరస వృష్టి ♦ యందు మునుచు
ఒకనాఁడు చతురంగ ♦ మొగినాడి పందెంపు
ధనమంత గొనును భూ ♦ ధవ్రులనుండి
ఒకనాఁడు మహిత ధ ♦ ర్మోపదేశవిశేష
మెఱిఁగించు బుధులు మే ♦ లెంచుచుండ
గీ. చక్కనగు గ్రంథములు వ్రాయు ♦ నొక్కనాఁడు
నుపనిషద్గోష్ఠి సలుపుఁ దా ♦ నొక్కనాఁడు
నుత్తముల మైత్రితోనుండు ♦ నొక్కనాఁడు
ఉవిద యుపచారములఁ జొక్కు ♦ నొక్కనాఁడు.
గీ. హితులు చుట్టాలు నిజపురో ♦ హితులు కవులు
నతిథు లభ్యాగతుల్ శ్రితు ♦ లనుదినంబు
పజ్క్తినిండుగఁ గుడువ నా ♦ బ్రాహ్మణుండు
వేడ్క భుజియించు నిస్తంద్ర ♦ విభవుఁ డగుచు.
ఉ. కందయు చేమగడ్డలును ♦ గాకరకాయలు నిమ్మపండ్లు తి
య్యందన మొప్ప పెండలము ♦ నచ్చపుగుమ్మడిపండ్లు కొబ్బెరల్
కందును లేని సన్నరటి ♦ కాయలు నాకులు చేతికావడుల్
వందలు వేలు నాతని ని ♦ వాసమునం బడియుండు నిత్యముౕ.
గీ. అతనియింటికి నొక్కనాఁ ♦ డతిథి యగుచు
వేడ్క భుజియింపవచ్చిన ♦ పేద వేఁడ
సురవిభుం డిచ్చు నమృతంపు ♦ జూఱలైనఁ
గొనఁడు రుచిగాఁగ నుడియుఁ దాఁ ♦ గొంచెమైన.
సీ. గంగాతరంగిణీ ♦ భంగలోల రథాంగ
సంగీతముల మేను ♦ బొంగుచుండఁ

బ్రతుకవమారు తాఁర్భకము గుమ్మలువేళ
మృత్యుంజయస్తుతిఁ మేలుకాంచి
శిష్యసమేతుఁడై ♦ చెలఁగి భాగీరథీ
విమలోదకముల స్నానము నొనర్చి
సంధ్యాదికము దీర్చి ♦ జపములు సవరించి
యాదిత్యునకును సాష్టాంగ మెఱఁగి
గీ. తులసి బిల్వంబు సుమములు ♦ తోయపాత్ర
తడి తమాలంపు దళముల♦మడుపుగొనుచు
శిష్యబృందంబు వెనువెంటఁ ♦ జేరినడువ
దినము నింటికి వచ్చుఁ బృథ్వీసురుండు.
ఉ. ఆతని ముద్దరాలు వినయంబున విద్యను రూపసంపదన్
నీతిని సద్గుణంబులను ♦ నిర్మలతం దనప్రాణనాథుఁ వి
ఖ్యాతికి వన్నెఁబెట్టుఁ గుల♦కాంతలలోఁ దలమానికంబు వి
ద్యోతిత సర్వభాగ్య విభ♦వోచిత పుణ్యచరిత్ర యెంతయున్.
క॥ ఏమానవతులు వత్తురు
హేమావతితోడి సాటి ♦ యేర్పడ జగతిన్
హేమమువజ్రముతోడిం
బ్రేమమునం గూర్చినట్టి♦విధి నేర్పరిగా.
సీ. అతిథులే తేర నడురేయి♦ యందుఁగాని
కులము గోత్రంబు నడుగక ♦ కొసరి కొసరి
మంచి భక్ష్యముల్ వండివ♦డ్డించుచుండు
వజ్రనాభుని దేవి దుర్వారభక్తి.
ఉ. కాముని గేరు సుందరులు ♦ కమ్రవచో విభవాభిరాములుం
గోమలగాత్రులు క్షమసఖుల్ మహితాన్వయరత్నదీపముల్
శ్రీమహనీయ తేజులు కు♦శేశయనేత్రులు సత్యవంతులై
సోముఁడు భాస్కరుం డనెడు ♦ సూనులు వారికి నుండి రున్నతిన్.

గీ. సోమ భాస్కరు లాత్మీయు ♦ సుతులుగాఁగఁ
జెలఁగు శక్యపాదితులట్లు ♦ చెలువు మిగిలి
వజ్రినాభుండు నా హేమ ♦ వతియు బహుళ
సుఖముఁ గీర్తియు నార్జించి ♦ రఖిల గతుల.

వ. ఈరీతి నావిప్రకుటుంబంబు సుఖంబుగాఁ గాలంబు గడపుచున్నంత.

సీ. పొడుగు కెంజడగుంపు ♦ పెడగాఁగఁ దలచుట్టి
ఘనభోగి మకుటంబు ♦ గాఁగ జుట్టి
శివలింగ నోషధుల్ ♦ చేర్చికట్టిన సంచి
హంసదండిని వ్రేలు ♦ నట్టుబట్టి
పారాయణ గ్రంథ ♦ పటలి కృష్ణాజినం
బిరుప్రక్క భుజమందు ♦ మెరయఁ దాల్చి
పాండురచ్ఛవితోడ ♦ భాసిల్లెడు కృశాంగ
మున భూతిపుండ్రంబు ♦ లెనయఁ దాల్చి

గీ. భూరితటంబునఁ గాశ్మీర ♦ మును ధరించి
యురమునందున స్ఫటికాక్ష ♦ సరులు దోఁప
వల్కలంబులు కొయ్యపా ♦ వలు ధరించి
ధరణి సురునింటి కేతెంచెఁ ♦ దవసి యొకఁడు.

కం. వచ్చిన తాపసవర్యున
కచ్చపడఁ మ్రొక్కి లేచి ♦ యర్ఘ్యముపాద్యం
బిచ్చియు మృష్టాన్నము నం
దిచ్చియుఁ దాంబూలమొసఁగి ♦ హెచ్చగు ప్రీతిన్.

గీ. ఎచటినుండియు నెచటికి ♦ నేఁగఁదలఁచి
వచ్చినారలు జటివర్య! ♦ యిచ్చటికిని
గృహము పావనమయ్యె మ ♦ ద్గృహిణి నేను
తనయులాదిగ ధన్యత్వ ♦ మును గనితిమి.

గీ. పూర్వ సుచరితవ్రాతంబు • పూచి పండ
కుండినను భవాదృశ మహా • యోగిపురుష
భవ్యదర్శన మబ్బెడు • భాగ్య మేల
కలుగు మముబోటి సంసార • కాముకులకు?

ఉ. నిత్యము మిమ్ముబోటి మహ • నీయుల నెవ్వఁడు పిల్చి మ్రొక్కి సం
స్తుత్యపదాంబుజాతయుగ • తోయము నెత్తి నిఁదాల్చి భక్తిసం
ప్రీత్యయి మెప్పు దాస్యమున • వర్తిలఁ గోరునో? వానిజన్మమే
స్తుత్యము వాఁడుపో సుకృతి • శోభనముల్ గనునాతఁడొక్కఁడే.

చ. అనుటయు వజ్రనాభు విన • యంపువచోరచనావిశేషముల్
విని జటిశేఖరుండు మది • విస్మయముం గడు సంతసంబునుం
బెనఁగొనఁబల్కె మేలు పృథి • వీసుర! నీయుపచారపద్ధతుల్
నను ఘనమోదవారిధి చలద్బహుభంగ నిమగ్నుఁ జేసెఁగా.

గీ. భక్తిగృహపతు లెందరో • ప్రతిదినంబు
నొసఁగుచుందుర యాతిథ్య • మొగిని నాకుఁ
గాని యీరీతి నుపచార • కలన యెఱుఁగ
హృదయ మానందమయ మయ్యె • నేమి చెపుదు?

మ. అతిథిశ్రేణికిఁ గామధేనువు మహా • యాగక్రియాపాళి కం
చితమా సాధన మర్థధర్మములకున్ • సీమంబు నానాశ్రుతి
స్మృతి శాస్త్రోదిత కర్మపాళి నెలవున్ • శ్రీకామితామూల మా
యతవర్ణాశ్రమరక్షకున్ గృహము గా • ర్హస్థ్యంబు వర్ణింపఁగన్.

శా. నానాస్వర్గసుఖార్జనక్రియకు జ • న్మస్థానముం బుణ్యసం
తానప్రాప్తికి నాలవాల మల పి • త్రారాధనోపాధికిన్
స్థానం బైహికసౌఖ్యసంతతికి హృ • ద్యంబైన హార్మ్యంబు వి
జ్ఞానోపాసనకాది హేతువగు గా • ర్హస్థ్యంబు వర్ణింపఁగన్.

గీ. అట్టి గేహస్థధర్మంబు • ననుదినంబు
జాగరూకులై రక్షించు • జనములందు

నగ్రణివి నీవు లోప మింతైనఁగలదె?
ధన్యుఁడవు భూమిసుర! నీవు ధరణియందు.

కం. మీబోటి వరగృహస్థుల
ప్రాబల్యముగాదె? మాకు బహుయాత్రాసం
సేవలు జపములు తపములు
గావింపఁగ సాధనంబు ఘనతరకీర్తి!

ఉ. కావున నట్టి గేస్తులకుఁ గష్టములెన్నఁడు గల్గకుండెడుం
గావుతమంచు శంభుపదకంజము వేడుచు దేశదేశముల్
పోవుచు వచ్చుచుండెదను బుద్ధి నెఱింగిననాఁడుగోలె నే
నీవిధిఁ గాలముంగడిపి యింకను బుచ్చెదఁ గొంతకాలమున్.

వ. అని యాజడదారి పలికిన పలుకు లా కులపతి విని వినయ విధేయ విజ్ఞానంబు లనూనంబులై తనయందసామాన్య మానవోత్తమ త్వంబు వెలయింప నత్తాపసపుంగవుం గనుంగొని;

గీ. జటికులేశ్వర! దుఃఖ సంసారగహన
పరిచరన్మూఢ మాదృశ పశుగణంబు
శుద్ధవిజ్ఞానమయులుగా నుద్ధరింపఁ
గలదె? మీపాదయుగసేవఁగాక వేఱు?

గీ. సంయమీశ్వర! యొక్క విజ్ఞాపనంబుఁ
జేతు నొప్పైనఁ దమమదిఁ జేర్పవలయు
నొప్పుగాదేని క్షమియింపుఁ డోర్చి దాస
జనుల తప్పులు దండంబు సరియటండ్రు.

శా. ఏపుణ్యస్థలులం జరించితిరి మీ రేతీర్థముల్ గ్రుంగినా
రేపట్నంబులు చూచివచ్చితిరి యేయేశైలముల్ గాంచినా
రేపల్లీతట కాననవ్రజములన్ స్వేచ్ఛాగతిన్ మెట్టినా
రాపూర్వంపు కథావిధానము మహాత్మా! నా కెఱింగింపవే!

కం. అని పల్కిన మునినాథుఁడు
వినుమా సంసారి! నీకు విస్తర ఫణితిన్
జననం బాదిగ జరిగిన
ఘనయాత్రా ప్రకరణంపు • కథ నెఱిఁగింతున్.

సీ. తామ్రపర్ణీతీర • ధర్మపురీవాసి
యైన మహాదేవుఁ • డనెడు భూమి
సురవాళికిని యాత్మ•సుతుఁడ గృహస్థుండ
వామదేవుండను • వాఁడ దండ్రి
ముసలియై గృహభార•మును మాకు నర్పించి
తపసియై కానన•స్థలికనేగ
సుకుమారి గృహిణి నా • సుఖ మెల్లవేళలఁ
గాంక్షించుచును జేయఁ • గాపురంబు

గీ. కొన్నినాళ్లకు సుతులు లే•కున్న విసిగి
వరతనూజులు లేని యీ•భాగ్యమేల
టంచు నేఁజెప్ప వినక తా • నరిగె వనికి
యోగినీవృత్తి వహియించి • యువతి యంత.

గీ. అఖిల సుఖముల నొసఁగు న•ర్ధాంగి యిటుల
తాపసీవృత్తిఁ దాల్చి తా • ధన్య గాఁగ
నేటి కారామ బహుభాగ్య • గృహములనుచుఁ
బంచి యిచ్చితి సిరియెల్ల • బ్రాహ్మణులకు.

క. భోగము చెడి భాగ్యము విడి
యోగము ధరియించి పుణ్య • యోగము కొఱకై
లాగునఁ దిరిగెద నెట మా
యోగిని గన నేమిచెపుదు • నుర్వీదేవా!

గీ॥ కాన స్వామికార్యము సొంత•కార్యమనెడు
రీతి నెంచి యాత్మ తలోద•రినిఁ గనంగ

దీర్ఘయాత్రావిధానముల్ ♦ తీర్చుచుందు
సాధ్విఁగనకున్న పుణ్యమే ♦ చాలు ననుచు.

సీ. శ్రీకాశివిశ్వేశు ♦ సేవించితిని భక్తి
వేడితిఁ గేదార♦విభుని పదము
త్ర్యంబకాచలనాథు ♦ దర్శించుకొంటి దా్రి
క్షారామ భీమ లిం♦గంబు గంటి
ఘనుని శ్రీగిరిమల్లి♦కార్జును పొడగంటిఁ
ద్రిపురాంతకుని సన్ను♦తించియుంటి
రామలింగేశ్వర♦స్వామి భజించితి
నేకాంబరుని కర్చ♦లిడితి నిచ్చ
గీ. శ్రీవిరూపాక్షుపాదరా♦జీవములను
మస్తకంబుంచితిని గాళ♦హస్తి శివుని
కంజలి ఘటించితిని శ్రీ చి♦దంబరానకు
నుతులచేనొసంగితి నమ♦స్కృతిశతంబు.

సీ. బదరికాశ్రమవాసుఁ ♦ బద్మామనఃకాంతు
నారాయణునకు దం♦డము ఘటించి
మహిమతోడఁ బ్రయాగ ♦ మాధవు పాదార
విందయుగ్మంబు సే♦వించుకొనియు
శ్రీరంగపురిని వేం♦చేసియుండెడు రంగ
నాథుఁ బూజించి ధ♦న్యత్వమొంది
సద్భక్తిని ననంత♦శాయినిఁ బద్మనా
భస్వామి దర్శించి ♦ ప్రస్తుతించి
గీ. వరదరాజుల వేంకటేశ్వ♦రుని నార
సింహు సింహాచలాధీశు ♦ శ్రీరమేశు
సాధుజనవందితుని జగ♦న్నాథదేవుఁ
గొలిచి కీర్తించి మ్రొక్కి మో♦డ్పులు ఘటించి.

సీ. వారణాసీభాగ్య • వైభవోపేతయా
మణికర్ణియందు ముమ్మా • రుగ మునిఁగి
శ్రీరామకృష్ణ సం • క్రీడా పవిత్రయా
కాళిందిజలమందు • నోలలాడి
గౌతమఋషితపః • కల్యాణమూర్తియా
లలిత గోదావరి • జలకమాడి
రంగేశు పదపద్మ • శృంగారగాత్రియా
సహ్యజానదియందు • స్నానమాడి
గీ. సగరుమనుమనికీర్తి యా • చంద్రతార
కంబుగా నిల్పె మూఁడు లో • కముల నెద్ది
అట్టి భాగీరథీ నది • యందుఁ గ్రుంకి
పాపములఁ బాసి శాంతినిఁ • బడసి కాంత.
సీ. ఆఁకలైనపుడెల్ల • నందించు మాయన్న
పూర్ణమ్మ రుచియైన • భోజనంబు
నడువలే కాయాస • పడుచున్న బలమిచ్చి
రక్షించు మధుర మీ • నాక్షి దేవి
ఒంటిగా భయమంది • యున్న భ్రాంతటిఁ గుంకు
మపురమ్ముఁ బెట్టుఁ గా • మాక్షి తల్లి
కష్టముల్ తలఁచి దుః • ఖమ్ము చెంద నిద్రకై
జోకొట్టు మాయమ్మ • జోగుళాంబ
గీ. ఎండవానలు గాలికి • బెండువడిన
జల్లనగుచూడ్కి నమృతంబు • చల్లుచుండుఁ
ద్రిపురసుందరి వెనువెంటఁ • దిరుగుచుండు
లీల నే యాత్రలను జేయు • వేళలందు.
చ. అది యిదియంచుఁ జెప్పగల • నా? ధరణీసురవర్య! లోకమం
దెదయు మహాస్థలం బనుచు • నెంతురొ పెద్దలు ముందు నట్టి దె,

ల్లఁ దిరిగితిఁ సమస్త విపులావలయంబునఁగల్గు వింతలుం
దుదమొదలే నెఱింగితిని ♦ దూర్ణవిలంఘితయోజనుండనై.

కం. హిమశైలం బుదయాద్రియు
నమరాలయమైన మేరు ♦ వస్తాచలముఁ
భ్రమమాణ చక్రవాళము
కమనీయము మలయశిఖరి ♦ కైలాసంబుఁ.

వ. అదియునుంగాక క్రమక్రమ ప్రవర్ధిత ప్రభాతబాలారుణ ప్రభాపటల పద్మరాగ మణిభ్రాంతివిభ్రమ ద్భ్రమరీముఖ ముఖరీకృత కబరీభరమందార సుమసందోహ సౌగంధ్యసంచార గంధవహార్భక బృంద కించిత్ప్రచారవిగత సురతాయాస కిన్నర యువతీతతినిలయీభూత సుందరరత్నకందర యగు నుదయమహీధరంబునం జెన్నొందు నద్భుతంబులు వర్ణింప సహస్రలోచనునకైనఁ దరంబగునే?

అనవరత కుసుమితచంపకలతాంగనాలింగిత వివిధ మణి ఖచిత దివ్య వలయీకృత కులఫణీశ్వర వితాన చందనతరుబృంద నిలయంబగు మలయంబునఁ వెలయు వినోదంబులు వచియింప వాక్పతికైనను శక్యంబే?

వితతవియోగానల ధూమాయితాధిత్యకా నీల తమాలపల్లవ నిచయప్రతీచీకుమారీస్వయంవరలబ్ధ దివాకరవరోత్తమ వేదికారోహణ రంగవల్ల్యలంకృత కల్యాణమండపాయిత శృంగాటక కోటిమణిప్రభా విభాసితంబైన యస్తగిరి మహోత్తుంగశృంగంబుల శృంగారంబుఁ దలంచుకొనిన హృదయాంతరంగంబున నిప్పుడైన నానందరసంబు పొంగి పొరలుచుండు.

సతతసలలిత జలక్రీడాపరాయణ నిలింప లలనాకుచయుగళమిళిత కాశ్మీర పంక సంకలిత ద్విగుణీకృత పరిమళవృత సువర్ణసరోరుహాప రాగశోభిత మందాకినీతటారూఢ పారిజాత విభ్రమ కదంబచ్ఛాయా రమణీయప్రదేశభాసురం బగు మేరుమహీధరంబు పొడగట్టుట యనేక జన్మాంతర పుణ్యపరిపాకంబునంగాక లభింప సాధ్యం బగునే?

అనుపమాన శైశవ క్రీడా వినోద నర్తన కళాభ్యాస మందస్మిత వదనారవింద గిరికుమారీ చరణసరోరుహాయుగళీ విభాసిత పద్మశంఖ హాలకులిశమత్స్య కూర్మధ్వజ. చక్రాదిరేఖాసనాథ సమగ్రమహిమా సమన్వితవిశ్రుత భగీరథ తపఃఫలాయిత త్రిపథగావతరణ శృంగారరంగ స్థలాయిత రత్నస్థలీ స్వస్వప్రవర్ధిత గిరినిర్ఝరీతరంగ శీకరసంసిక్త నిరంతర పుష్పితగిరిమల్లికా నికుంజపుంజరంజిత హిమాచల శృంగాగ్రసీమల గౌరీమనోహారక్రీడామణికుట్టిమంబులఁ గనుఁగొన్న యనేకజన్మసంతాపిత సంసారబంధంబులు దూరంబులై చనకున్నె ? నే నిట్టి నయనోత్సవంబులు కొలఁదికాలంబుననే కాంచి సేవించితి నని జటి వచించి యూరకున్న వజ్రనాభుం డపరిమిత మహానందసాగర వీచీపరంపరల నోలలాడి సిద్ధపుంగవుని దనపురాకృత సుకృతఫలంబునం జేసి తన్ననుగ్రహింపనే తెంచిన సాక్షాత్పరమేశ్వరుని యపరావతారంబుగ మనంబున ధ్యానించుచు ముహూర్తకాలంబు నిమీలితనేత్రుండై యూరకుండి హర్ష బాష్పబిందుసందోహంబులు ప్రవాహంబులై ప్రహించుచుండ నవయవంబులం గదలింపనేరక యానందముద్రా నిర్ణిద్ర తేజోమూర్తియై కొంతవడికిఁ దెలివొంది మహనీయులగు సాధుపుంగవుల పరమాద్భుతచరిత్రంబు లిట్టివిగదా యనుచుఁ దలయూఁచికొని కరకమలంబులు మోడ్చి శిరంబునం జేర్చి గద్గదకంఠుఁడగుచు భక్తి వినయవిధేయ విశ్వాస ప్రేమరసంబులు దనయం దుట్టిపడుచుండ మెల్లన నిట్లనియె.

శా. స్వామీ! మీమహనీయ దివ్యచరితల్ ♦ సాధ్యంబె మాబోంట్లకున్
ధీమర్యాద నెఱింగి చెప్ప నెటు లీ♦తీర్థప్రదేశంబులన్
హేమాద్ర్యాది మహాస్థలంబులఁ బథా♦యాసంబు లేకుండగన్
వేమారుం జరియించితెయ్యె బలుతీ♦విన్ స్వల్పకాలంబునన్.

శా. ప్రక్కం జూడక వాయువేగమునఁబో♦వంగూడ వెయ్యేడులో
రెక్కల్ తాల్చి నభంబునం జనిన దా♦రింబోవు వేలేండ్లు నే

చక్కం జూచితి వింత నేల? హరివో! ♦ శంభుండవో! ధాతవో!
నిక్కంబుం బచియింప, లేనియెడ క్షోణీదేవమాత్రుండవే?

కం.. మీపలుకులె వేదంబులు
మీపద మిడుచోటు కాశి ♦ మీచరణాబ్జ
శ్రీపావన తీర్థాంబువు
లాపత్సంతాపహారము ♦ లఘునాశకముల్.

గీ. దివ్యమంత్ర మాహాత్మ్యమో? ♦ దేవకృపయొ?
సిద్ధఘుటికా ప్రభావమో? ♦ బుద్ధిబలమొ?
శీఘ్రగతి యాత్ర నెట్టులఁ ♦ జేసితయ్య
చెప్పతగునేని వచియింపు ♦ సిద్ధనాథ!

వ. అనుచు నాపుడమివేల్పుతేఁడు వేఁడుకొనిన నాజడదారి యిట్లనియె.

కం. సిరి యాయువు గృహకృత్యము
ధర మంత్రము మందు సురతి ♦ దానంబిడుటల్
వరగౌరవ మవమానము
పరగోప్యం బనుచు మున్నుఁ ♦ బలికిరి పెద్దల్.

ఆ. వె. చెప్పరానిదైనఁ ♦ జెప్పెద భూసుర!
వినుము నీదుబుద్ధి ♦ వినయగరిమఁ
జెప్పుమనుచు నన్నుఁ ♦ జెలఁగి ప్రేరేపించు
మైత్రిగలుగుచోట ♦ మర్మ మేల?

వ. మున్ను కాంతావియోగంబునం జేసి కలిగిన వగచే దిగులు వడి పాదచారినై కొన్నినెలలకు నైమిశారణ్యంబునకుం జని నిరంతర ప్రయాణ కార్శ్యంబున నంగంబులు పడలి కదలనేరక నిరశనుండనై విసిగి జీవనోపాధియందు నిరాశఁ జెంది సర్వేశ్వరుండు నన్ననుగ్రహిం చుఁగాత మని ధ్యానంబు సేయుచుండ.

కం. పరశివుఁడు పార్వతీపతి
వరజటివేషంబుతోడ • వచ్చియు నన్నుఁ
గరుణామయు సుభవీక్షలు
మెరయంం బొడగాంచి పల్కె • మిక్కిలి ప్రేమన్.

ఉ. దేనినిగూర్చి యాతపము • దీర్చెదు భూమిసురేంద్ర! చెప్పుమా
సూనశరారి పంపె నినుఁ • జూచి వరంబుల నిచ్చి రమ్మటం
చానగజామనోహరుని • కర్మవిభక్తుఁడ నీకు సౌఖ్యసం
ధానము సేయవచ్చితి న•నన్ ముద మొందియు బల్కితిం దగన్.

గీ. సకలయాత్రలు సేవించి • సాంబమూర్తి
పాదయుగళంబు గాంచెదు • భాగ్యమిమ్మ
టన్న భూమినిఁ జరియించి • చన్నపిదప
శివునిఁ గాంచెదు పుణ్యసం•సిద్ధిఁ జేసి.

కం. అని యిడి సిద్ధాంగుళ్యం
బును స్వర్ణవికారలింగ•మూర్తిని నొసఁగెన్
వినిపించి తన్మహిమములు
చనె నాజటివరుఁడు దివ్య•సరణి దనంతన్.

అమ్మహిమంబులు వివరంబుగ వినిపింతు, నాకర్ణింపుము.

ఆ సిద్ధాంగుళీయకంబు ధరియించినవాఁడు క్షుత్పిపాసాదులం జెందక నిరాయాసంబున నెంతదూరంబైనఁ ద్రుటిమాత్రంబునఁ జనునని యు స్వర్ణమయలింగంబు దినంబు సద్భక్తి నెవండుపూజించు నట్టినరుండు కైలాసవాసియగుఁ బార్వతీశ్వరుని పాదయుగళంబు సేవించుభాగ్యంబు సంపాదించుననియు నీదివ్యవస్తుద్వయం బెచ్చోటవిరాజిల్లు నచ్చోట ననావృష్టిదోషంబులులేక దినంబు సహస్రబ్రాహ్మణభోజనంబులు జరుగుచుండు; నిత్యశుభకార్య సమాచరణంబులు చేకూరుచుండు ననియుం జెప్పె.

ఇట్టిదివ్యవస్తుప్రభావంబునం జేసి యత్యల్పకాలంబున సకలవన గిరిక్షేత్ర తీర్థరాజంబులు సేవింపఁగలిగితి; నిప్పుడు చాతుర్మాస్యదీక్ష నిర్వ

ర్తించుటకై గంగోత్తరకుం బయనంబు సేయుచు మదీయ పుణ్యవిశేషంబున నేఁడు నీయింటి కతిథినైతి; నెల్లి కన్యాకుబ్జంబునకుం జనువాఁడనని చెప్పిన విని వజ్రనాభుం డతని కిట్లనియె.

ఉ. ఇట్టి మహానుభావు లిల ♦ నెంతటి మా సుకృతంబుచేతనో
మెట్టితి రయ్య! యీగృహముం♦ మేలొనగూడెను మాకు, నేఁడు మీ
యట్టి మహాతిథుల్ విడిచి♦నట్టి గృహంబున నుండనేర్చునే
యెట్టి నికృష్టుఁడైన గృహి? ♦ యెందుల కీక్షణికప్రయాణముల్?

మ. గృహముల్ భూములు నాలుబిడ్డలును సు♦శ్రీమించు భూషావళుల్
మహిమాసాంద్రములైన గోధనము ప్రే♦మం గూర్చు ధాన్యావళుల్
సుహృదాళుల్ మఱి దాసవర్గము భవ♦చ్ఛుద్ధాంఘ్రిసంసేవకై
మహితాత్మా! కొని యిందుఁ బుచ్చుము చతు♦ర్మాసవ్రతం బిచ్చమై.

మ. శివపూజావిధిఁ దీర్చుచున్ దినము మా♦సేవావిధానంపు టు
త్సవముల్ గాంచుచు మద్గృహంబునను వి♦శ్రాంతింపుమా లేనిచో
భవదంఘ్రిద్వయసేవకై వనికి నా♦భార్యన్ ననుం బుత్రులన్
శివసంప్రీతిగ వెంటఁ గైకొనుఁడు తం♦డ్రీ! మాటలిం కేటికిన్.

వ. అని సాష్టాంగనమస్కారపూర్వకంబుగాఁ బ్రార్థించు నా గృహమేధిభక్తిరజ్జువుచే బంధింపఁబడి యచ్చో నివసించువాఁడై సిద్ధుం డిట్లనియె.

మ. కరమొప్పన్ దిన మేకభుక్తి నిరత ♦ గ్రామైకవాసంబు సం
సరణంబున్ విడనాడు సిద్ధులకు స్వే♦చ్ఛావృత్తి ధర్మంబు నీ
సరణిన్ మాని గృహస్థులిండ్లకడ వి♦శ్వాసంబుతో నుంట దు
ర్భరమై వచ్చు విపత్పరంపర యధ♦ర్మప్రాప్తిమూలంబునై.

శా. కానిమ్మైనను గారణం బొకటి లే♦కన్ గార్య ముండంగఁ బో
దే నీ సద్మమునందు నిల్తు నని తా ♦ నెంతేఁ గృపం జెప్ప నా
మానిశ్రేష్ఠుఁడు వజ్రనాభుఁ డది స♦మ్మాన్యంబుగా నెంచి వి
ద్యానైపుణ్యము జూపి రాత్రిగడపెం ♦దత్తత్క్రియావేదియై.

మ. జరిగెం గొన్నిదినంబు లీవిధిని ని♦ష్ఠాగోష్ఠి సంభాషణ
స్ఫురణన్ దీక్షితుఁడయ్యె మౌని గృహసం♦పూర్ణప్రభావంపు టుం
గర మిమ్మంచు జటీంద్రు వేడ విడియెం♦ గారుణ్యమేపారఁ ద
ద్ధరణీదేవుఁడు యాత్రచేయఁదలచెం ♦ దానాల్గుమాసంబులున్.

కం. బంగారు రసపుటుంగర
మంగుళి ధరియించి చనియె ♦ నవనీసురుఁడున్
బొంగెడు మంగళగంగా
శృంగారతరంగరంగ♦సీమల మునుగన్.

—♦ ఆశ్వాసాంతము ♦—

సీ. నిత్యసత్యవ్రత ♦ నియమధురంధర
ధరణీసువర్ణ గో♦దాన నిరత!
నిరత సత్కవిరాజ ♦ నివహావర్ణిత దేహ!
దేహాళీపరిసర ♦ దివ్యచిత్ర!
చిత్రమాల్యాంగద ♦ శ్రీశోభితాకార!
కారణకార్య వి♦చార ధీర!
ధీరమ్యవదన సం♦చార వాణీభార!
భారతాదిగ్రంథ ♦ భరనిశాంత!
గీ. శాంత కరుణావినిర్మల ♦ స్వాంత సహిత!
హిత సుహృద్బంధు సంరక్ష♦ణేష్టకామ్య!
కామ్యధర్మార్థ ముఖర♦విఖ్యాతజన్మ!
జన్మదారభ్య మాధవా ♦ శ్రియహృదబ్జ!

చ. వితత కవీంద్రపోషణ ప♦విత్రచరిత్రక రామరాణ్మణి
స్తుతి నతిసుస్మితానన! సు♦తోషిత వేంకటశైలనాథ! వి
శ్రితకరుణాకటాక్షచయ ♦ శోభితవైభవ దివ్యమందిరా!
శ్రితజన పాలనావ్యసన! ♦ చిత్తజమోహన! వంశపావనా!

మాలినీవృత్తము.

వితరణ గుణశాలీ! ♦ వీక్షిత గ్రంథపాళీ!
కృతనతి శశిమాళీ! ♦ కీర్తి భాస్వన్మరాళీ!
హతరిపుజనధూళీ! ♦ యాలయ ప్రాంత్య కాళీ!
శ్రితకృత మనుజాళీ! ♦ కృష్ణపాదాబ్జహేళీ!

గద్యము.

ఇది శ్రీమ దనుములాన్వయసింధు జైవాతృక భారద్వాజసగోత్రపవిత్ర
వీరరాఘవ సుధీమణి పుత్ర నిఖిలకవిమిత్ర శ్రీరంగమాంబా
గర్భశుక్తి ముక్తాఫలాయమాన విబుధవిధేయ సుబ్రహ్మణ్య
నామధేయ కవిప్రణీతంబైన వజ్రనాభ చరిత్రం బను
మహాగ్రంథంబునందుఁ బ్రథమాశ్వాసము
సంపూర్ణము.



# వజ్రనాభ చరిత్రము.

## ద్వితీయాశ్వాసము.



శ్రీ మాన్య! ధన్య! సుయశో
వ్యామోహిత దిక్కరీశ! భాగ్యధనేశా!
శ్రీమత్కృష్ణమదేవీ
ప్రేమరసావేశ! రామ♦కృష్ణమహీశా!

గీ. అవధరింపుమి యవ్వలి♦వైనకథను
సావధానుండవై యిల్లు ♦ జటివ్రతంబు
సలుఁపుచుండెను దీక్షతో ♦ శైవభక్తి
పారవశ్యంబు గని జనుల్ ♦ ప్రణుతులొసఁగ.

### —*వర్షర్తువర్ణనము*—

కం. వచ్చెను వర్షాకాలము
విచ్చలవిడి కర్షకాళి ♦ వేడుకనొందం
బచ్చికతావులఁ బురులన్
విచ్చియుఁ గలకంఠవితతి ♦ వెలయఁగ నాడన్.

మ. జలదంబుల్ కబరీభరంబుగల స♦త్సౌదామినీమాలికల్
లలితాంగంబులుగా నభస్స్థలము వా♦లాయంపుమధ్యంబుగా
సలిలశ్రేణి కృపారసంబుగ ధను♦ర్జాలంబు భ్రూపంక్తిగా
జలజాత్రాలయఁబోలి యొప్పెడును వ♦ర్షాకాల మానందమై.

గీ. మదనుఁ డేవేళ పోషించి తా◆మానసములు
గెలిచి శ్రమనొందెనని కాల◆గృహవిభుండు
పరమ విశ్వాసమునఁ దెచ్చి ◆ పఱచు పచ్చ
పట్టుమడతలై పచ్చిక ◆ బయళు లొప్ప.

సీ. నదులెల్లఁ బాద్య మా◆నందంబుతో నీయ
జలదంబు కరకవ◆జ్రముల నొసఁగ
రంజిల్లుతరులు పు◆ష్పాంజలి నర్పింప
నీలంపుజవనిక ◆ నింగిపట్ట
నవవాణి కేకులు ◆ నర్తనంబులు సల్పఁ
గాదంబినులు దీప◆కళిక లెత్త
వెలయు గంధవహుండు ◆ వీవనల్ పచరింప
సమయపూరుషుఁడు సం◆స్తవమొనర్పఁ

గీ. గోరి పుడమిచేడియ నవాం◆కురసమృద్ధి
పంచి మెత్తని యడుగుల ◆ మడుపులొత్తఁ
జిగురువిలుకాఁడు యువతుల◆చిత్తధనము
వేగ హరియించు వర్షర్తు◆వేళలందు.

శా. వానల్ పిడుఁగరాదు కేళిగృహముల్ ◆ వ్యాపించు ధారాధర
శ్రేణుల్ రాత్రియొ సంధ్యయో దివమొ! గు◆ర్తింపంగ రాకుండెడున్
తానే తా ననురీతిగాఁ జలియె పొం◆తం జేర్చు నింతిం బ్రియున్
జానొప్పంగను దాదియై చెలఁగె వ◆ర్షాకాల మెవ్వారికిన్.

గీ. సారసాకరమయ్యెఁ గా◆సారవితతి
సారసాసారమయ్యెఁ బు◆ష్కరము ధరయు
లోకమంతయు జీవనా◆లోకమయ్యె
వెలయు ఘనమైన వర్షర్తు ◆ వేళయందు.

శా. ఆవర్షర్తువునందుఁ దద్గృహిణి దీ◆వ్యద్భక్తి శోభిల్లఁగన్
భావంబందునఁ బ్రాణనాథు మహితా◆జ్ఞాదత్తకృత్యంబులన్

తీవించేయుచుఁ దచ్ఛుభాగమనమే • డెందంబునం గోరుచున్
దేవిన్ మ్రొక్కుచు వేడుచుం జరుపుఁ దా•నిత్యంబు నింటంబనుల్.

సీ. పతిచిత్రపటముఁ దాఁ • బయ్యెద సరిదిద్ది
పొద్దుటఁ గన్నుల • కద్దికొనును
నా ప్రాణనాథుఁ డె•న్నఁడువచ్చునని పురో
హితులఁ బంచాంగ సం•గతుల నడుగుఁ
బ్రతిదినంబును బల్లి•పలుకులఁ జెవియొగ్గి
మించి వారంబుల • నెంచుకొనును
పతిసమాగమన త•త్పరత గాళిరుతంబు
విని వ్రేళ్ళ లెక్కించు • దినములన్ని
గీ. గళమునందున్న మంగళ • కనకసూత్ర
మందుఁ బసపుఁగుంకుమ ముంచు • నప్పుడపుడుఁ
బాపటను బొట్టు బెట్టును • బాలవాక్కు
బ్రహ్మవాక్కని పిల్లలఁ•బ్రశ్నలడుగు.

మ. పతియాజ్ఞన్ శిరమందుఁదాల్చి జటినిం • బ్రార్థించి పూజించుచున్
శ్రితులం బంధుజనంబులం జెలుల దా•సీదాస వర్గంబులన్
అతిథి శ్రేణిని గోత్రవృద్ధులను శి• ష్యానీకముం దైర్ఘికా
గతులం బ్రోచును వజ్రనాథుసతి శ్రీ•కాశీవిశాలాక్షిగాన్.

వ. ఈప్రకారంబున నాపతివ్రతాశిరోమణి యగు హేమావతి దివ్యోపచారంబుల యోగానందునివ్రతంబు సఫలంబు సేయుచుండ శ్రావణ శుక్లపూర్ణిమా సోమవారంబు సన్నిహితం బగుటయు నా వాసరంబు కైలాసవాసునకు ముఖ్యంబుగాన హాటకేశ్వరునకు నాదినంబున విశేషోత్సవంబు సేయం దలంచి నానావస్తు నివహంబుల వేదవిదులైన విప్రులఁ బిలిపించి యెల్లరకుఁ దత్తత్క్రియోచితంబుల నర్పించి తాను సుమఃకాలంబున మేలుకాంచి,

సీ. ప్రొద్దుపుట్టకమున్నె ♦ పోయి గంగానదీ
సలిలంబులను శుచి♦స్నానమాడి
మడుగుపుట్టముగట్టి ♦ మాణిక్యమయ కల
శంబున నించి తీ♦ర్థంబు దెచ్చి
అతివేగ వేదిక ♦ నలికి ముగ్గులుపెట్టి
సహకారపల్లవ ♦ చయము గట్టి
పుష్పఫలాదులౌ♦పూజనాద్రవ్యంబు
లాయాస్థలంబుల ♦ యందునుంచి
గీ. సాంగకృష్ణాజినము కుశా♦సనము బఱచి
కావిమడుగులు జపమాల♦కక్షపాల
గాంగతీర్థంబుజలకుండి♦కయును బెట్టి
మునినిఁ బ్రార్థించెఁ బూజకై ♦ పుణ్యసాధ్వి.

వ. అనంతరం బా హేమావతీ కుమారరత్నంబులగు సోమభాస్కరు లిరువురు జనని యనుమతిఁ బడసి.

శా. ప్రాతఃకాలములందుఁ గాల్యములు నిర్వర్తించి శుద్ధాత్ములై
చేతఃప్రీతిగ వేదపాఠములనున్ ♦ శిష్యాళికిం జెప్పి రా!
తాతయ్యా! శివపూజ కంచుఁ జరణ♦ద్వంద్వంబునం బాదుకల్
ప్రీతిం దెచ్చి తగిల్చి లెమ్మనుచుఁ బ్రా♦ర్థింపంగ నామౌనియున్.

మ. తన కైదోయిని సోమభాస్కరుల హ ♦ స్తద్వంద్వమందుంచి మా
లినిఁ గాషాయపటంబు గప్పుకొని ప్రా♦లేయాద్రికన్యాపతీ!
ఘనభోగీంద్రవిభూషణా! పురహరా!♦కైలాసవాసా! శివా!
యనుచున్ భక్తి స్మరించుచున్ హరుని పూ♦జార్థంబు వచ్చెన్ దగన్.

గీ. తొడరి మునిరాగ నపుడు పాదుకలశబ్ద
మాలకించియు భూతభే♦తాళ గణము
తల్లడిల్లియుఁ బరువెత్తి ♦ తరుల డాఁగ
దర్శనార్థుల కాత్మ సంతసము నిండ.

గీ. చెలఁగు రుద్రాక్షపోఁగులు ♦ చెవులవ్రేల
మస్తకంబున స్ఫటికాక్ష ♦ మాల దనర
శ్రీమహాదేవ! తే నమ ♦ శ్శివ యటంచు
స్మరణఁజేయుచుఁ గూర్చుండె ♦ స్వర్ణపీఠి.

వ. ఇట్లా యోగానందుండు యోగపీఠంబు నలంకరించి వార్చి శుచిర్భూతుండై యేకాంతవాసంబున యోగదండంబును జపమాలయుఁ గైకొని ప్రాణాయామా ద్యష్టాంగ యోగంబుల మౌనముద్ర వహించి ముఖవస్త్రంబు వైచుకొని కొన్నిముహూర్తంబులు పంచాక్షరి జపియించి యోగంబు డించి తనకక్షపాల నున్న దారుసంపుటంబునఁ బ్రకాశించుచున్న వజ్రమయ హాటకేశ్వర మహాలింగంబును భక్తిపూర్వకంబుగా నమస్కరించి కరపుటంబునఁ జేర్చి యర్చింపం దొడఁగె.

సీ. ఆవాహనము నీకు ♦ నఖిలాధ్వరాహూత
రత్నాసనం బద్రి ♦ రాణివాస!
అర్ఘ్యంబు నీకు న ♦ నర్ఘ్యదయామూర్తి!
పాద్యంబు లోకపా ♦ వనపదాబ్జ!
ఆచమనం బిదే ♦ వాచంయమిస్తుత్య!
స్నానంబు జాహ్నవీ ♦ స్నపితదేహ!
వస్త్రయుగ్మం బిదే ♦ వ్యాఘ్రాజినాంబర!
యజ్ఞసూత్రంబు గ ♦ జాజినాంస!

గీ. భూషణంబుల నర్పింతు ♦ భోగిభూష!
గంధరజ మందుకొను భస్మ ♦ కలితగాత్ర!
సరసపుష్పముల్ ధరియింపు ♦ చంద్రమౌళి!
ధూపదీపముల్ త్రైలోక్య ♦ దీపరూప!

వ. అని యీరీతి యోగానందుఁ డాభోగిభూషణునకు నావాహనాద్యుపచారంబు లపచారంబులేక యర్చించి దర్పకవైరిని నవమల్లికా కుసుమంబులను లలితబిల్వదళంబులను అఖర్వదూర్వాంకురంబులను

దోత్రిణపుష్పంబుల ననేక సహస్రాష్టోత్తరనామంబుల వేమారు పూజించి ధూపదీపంబులు వేనవేలు నివాళించి.

సీ. రాజాన్నమును శర్క♦రా క్షీర ఘృత మధు
పూతభక్ష్య లడ్వ కా♦పూపములును
నవసుధా శ్రీఖండ ♦ నవనీత పరమాన్న
పాకంబు లమృతంపు♦బానకములు
చోష్యంబు లేహ్యముల్ ♦ జున్ను పొంగలి తిరు
సాదంబు మేటి ద♦ధ్యోదనంబు
శాకంబు లాఢ్య ప♦రశస్తోపహారముల్
తీయనిచక్కిలాల్ ♦ తేనె తెరలు

గీ. జాతిచంపక సురభిళ♦సారజలము
రత్నమయపాత్రిలను నించి ♦ రాజశేఖ
రుని సమీపంబునం దుంచ ♦ మునివిభుండు
ఆరగింపులు చేసెఁ బు♦రారి కపుడు.

ఉ. కమ్మని సన్నపూగములు ♦ కప్రపుముక్కలు దెల్లయాకు మొ
త్తమ్ములు ముత్తెపుర్రజము ♦ దండిలవంగము లేలకుల్ మొదల్
సమ్మతిఁ బైడివళ్ళెమున ♦ సాధ్వివతంసము దెచ్చియుంచ నా
తమ్ముల మది్రజాపతికిఁ దాను ♦ సమర్పణచేసె భక్తితోన్.

గీ. రాజమౌళికి దివ్య నీ♦రాజనములు
వేనవేలు నివాళించి ♦ వితతభక్తి
మంత్రపుష్పంబు లర్పించి ♦ మాటిమాటి
కిడియె సాష్టాంగముగ నమ♦స్కృతి శతంబు.

సీ. శ్రీధవార్చితపాద! ♦ శ్రితపాలనామోద!
సామగానవినోద! ♦ శరణుశరణు
నిర్జితరిపుకామ! ♦ నిత్యసన్నుతనామ!
శాత్రవచయభీమ! ♦ శరణుశరణు

కమనీయ శుభగాత్ర! ♦ కంజాప్త శశినేత్ర!
చారణ స్తుతిపాత్ర! ♦ శరణుశరణు
కైలాసగిరికూట! ♦ గంగానదీజూట!
శమనగర్వోద్ఘాట! ♦ శరణు శరణు
గీ. సాధుమునిబృంద వందిత ♦ శరణుశరణు
సకలనిగమాంత సంవేద్య ♦ శరణుశరణు
సతత కరుణామయోత్సాహ! శరణు శరణు
శైలజాచిత్తమోహన! ♦ శరణుశరణు.
సీ. రుద్రాయ వరయోగ♦ముద్రాయ త్రైలోక్య
భద్రాయ దేవ తు♦భ్యం నమోఽస్తు
భీమాయ త్రిపురేశ ♦ భీమాయ వామార్ధ
భామాయ దేవ తు♦భ్యం నమోఽస్తు
ఈశాయ దుష్టారి♦నాశాయ దళితాఘ
పాశాయ దేవ తు♦భ్యం నమోఽస్తు
ధీరాయ యాశ్రితో♦ద్ధారాయ సురనదీ
ధారాయ దేవ తు♦భ్యం నమోఽస్తు
గీ. భారతీశనుతాయ తు♦భ్యం నమోఽస్తు
భాను శశిలోచనాయ తు♦భ్యం నమోఽస్తు
పార్వతీవల్లభాయ తు♦భ్యం నమోఽస్తు
హాటకేశాయ దేవ తు♦భ్యం నమోఽస్తు
సీ. శంభవే త్రైలోక్య♦సాక్షిణే కూట స్వ
రూపిణే భస్మ వి♦లేపనాయ
వేధసే సంయమి♦శ్రేయసే ఘనకృత్తి
వాససే వృషభరా♦డ్వాహనాయ
ధర్మిణే నిజతప♦శ్శర్మణే జితమార
కర్మణే సృష్ట్యాది♦కారణాయ

శీలినే సులలాట • కీలినే సౌభాగ్య
శాలినే శ్రితపరి • పాలనాయ

గీ. దానవోద్రేకహారిణే • భానుతాద్రి
రాజనిత్యవిహారిణే • రాజరాజ
మకుట మాణిక్య దీప సం • మ్యాన్యనితాంఘ్రి
దివ్యహాటకేశ! శివాయ • తే నమోఽస్తు.

వ. అని పార్వతీ ప్రాణవల్లభునకు యోగానందముని పునఃపునః ప్రణామంబు లాచరించి గీతనృత్యాది వివిధరాజోపచారంబులు రచియించి ఢక్కా డమరుక కాహళా మురజాది నానావిధవాద్యవిశేషంబుల నవసర పూజావిధానంబులు నిర్వర్తించిన,

కం. హేమావతి తగు ప్రీతిని
సోముని భాస్కరునిగూడి • సురుచిరభక్తిన్
హేమాకృతి శివమూర్తిని
వేమారు నమస్కరించి • వినుతి యొనర్చెన్.

సీ. జయజయ నిగమాంత • సంచారపదపద్మ!
జయ రమ్యకైలాస • శైలసద్మ!
జయజయ పార్వతీ • సమ్మోహితాపాంగ!
జయ దారుకాంగనా • శయన భృంగ
జయజయ జాహ్నవీ • సక్తజటాజూట!
జయ ఘోటకాఖ్య • రజఃకరోట!
జయజయ శమన సం • శమనకోపాటోప!
జయ కులేశ్వరభోగి • సత్కలాప!

గీ. జయవటోత్తమమూల శ • శ్వత్ప్రకాశ!
జయమనోహర సుస్మిత • శాంతవదన!
జయలసత్కోటికందర్ప • చారుతేజ!
జయ మహాదేవ! హాటకే • శ్వరపురారి!

కందాష్టకము

కం. శ్రీరజతశైల శిఖరవి
హార! విషాహార! భుజగ • హార! లసన్నీ
హార ధరసుతాసుమనో
హారి హరా? నీకు వినుతు • లర్పింతు శివా!

కం. హరిదశ్వ శీతకిరణ
స్ఫురదనలేక్షణ! సురేశ • పూజితచరణా!
కరుణాభరణా! దివిజో
ద్ధరణాంచితగాణ నీకు • దండంబు శివా!

కం. శరణాగత భయహరణా!
మరణామయతరణ! నిత్య • మంజులచరణా!
వరణాసీతట మండిత
శరణాలంకరణ! నీకు • సన్నుతులు శివా!

కం పురదానవహర! ఆశ్రిత
దురితావళిదూర! వృషభ • తురగవిహారా!
ద్విరదాసుర చర్మాంబర!
పరమేష్ఠి నుతాంఘ్రి నీకు • బ్రణుతింతు శివా!

కం. హిమభూమిధరకుమారీ
కమనీయ కుచాగ్రచిత్ర • కాశ్మీరలసత్
ఘుమఘుమితమృదులకోమల
సుమనశ్శుభ్రాంగ! నీకు • జోహారు శివా!

కం. సురకరశరశారద కం
ధర రజత ధరాహిరాట్సు • ధాసాగర ని
ర్జరతరు శశధర సితతా
మరసాయతగాత్ర! నిన్ను • మదినెంతు శివా!

కం. శిక్షిత దక్షాధ్వర! సుక
టాక్షామృతరస విహితమృ♦డానీకేళీ!
దీక్షారక్షితలేఖా
ధ్యక్షా! త్ర్యక్షా! స్మరింతుఁ ♦ దగ నిన్ను శివా!

కం. అంభోజ గర్భముఖ్యసు
సంభావిత దివ్యతేజ! ♦ సాధుసమాజా!
కుంభోద్భూత మునిస్తుతి
గంభీరరవాప్తమోద! ♦ కరుణింపుశివా!

వ. అనియిట్లు హేమావతి కుమారయుక్తయై మనోహరస్వరంబున ధరాధరకుమారికాపతిని ధ్యానంబుసేసి వందనశతంబు లర్పించి కరపుటంబులు మోడ్చి యొక్కచో నిలువంబడియున్నంత.

చ. మునిపతి తత్సమీపమున♦మూఁగినభక్తులఁ బ్రేమమీఱ ర
మ్మనిసి యభిషేకతీర్థమును♦మంబులు బిల్వదళంబులెంత క
మ్మని తెలిఖండశర్కరలు ♦ మంచిఫలంబులు తత్ప్రసాద మం
చును దగ వారివారికి వి♦నోదముగా నిడి మ్రొక్కు లందుచున్.

గీ. మంత్రిభూతియునుం గు♦ంకు♦మంబు వారి
పాణిపుటముల వైచి దీ♦వనల నిచ్చి
సెల వొసంగిన వారు భు♦జించి యంతఁ
జనిరి జయశంకరాయని ♦ మునికి మ్రొక్కి.

వ. అప్పుడు.

గీ. దైత్యు లమరులు వనధినిఁ♦ద్రచ్చునాఁడు
సురల కమృతంబొసంగెడు ♦ హరినిఁబోలి
కానుపించెను యోగి భ♦క్తాళిఁ బిలచి
తీర్థజలమిచ్చుచోఁ గృపో♦త్సిక్తమతిని.

సీ. వనధులాపోశనం ♦ బొనరించు కుంభసం
భవుచేతి బడబాగ్ని♦ప్రభ యనంగ

యజ్ఞాగ్ని సంభూతుఁ • డైన శ్రీకాంతుచేఁ
జెలువొందు నమృతంపుఁ • గలశ మనఁగ
సామిత్రి ప్రాణరక్షణదీక్షితుండైన
హనుమంతుచేతి ద్రోణాద్రి యనఁగ
అమరాధినాథు హ • స్తాగ్రమందుఁ జెలంగు
మహనీయ చింతాఖ్య • మణి యనఁగ

గీ. కాశ్యపుండయి తా మున్ను • కన్నతండ్రి
కరమునందున వెలుగొందు • కర్మసాక్షి
యనఁగ నుజ్జ్వల కాంతుల నలరుచుండు
జటికరంబందు హాటకే • శ్వరవిభుండు.

వ. తదనంతరంబు హేమావతి మహనీయుండైన మునియాజ్ఞఁ గైకొని తనయులుఁ దానును సహస్రబ్రాహ్మణ భోజనాదికంబులు నిర్వర్తించి వారికి యథోచిత సువర్ణ దక్షిణా తాంబూలంబు లర్పించి యనంతరంబ తానును కుమారులు భుజించి యంధ పంగు బధిర మూకాదులకును భైక్షుకకోటికి నన్నంబు పెట్టించి గృహసమ్మార్జనంబు గావించి శుచియై విశేషించి భోగిభూషణునకుఁ బ్రదోషపూజావిధానంబు లర్పింప మునినిఁ బ్రార్థించిన నతండు.

కం. శంకరునకు భక్తాళి వ
శంకరునకు వ్యాఘ్రదనుజ • శౌర్యరమా నా
శంకరునకు ముని తా సా
యంకాలపు నర్చలిడియె • నమరులు మెచ్చన్.

గీ. లాలిజోకొట్టు పవళింపు • డోల కేళి
హెచ్చరిక పాటలను బ్రొద్దు • బుచ్చి కొంత
పేర్మి మంచుకొండ యొయ్యారి • పెండ్లికొడుకుఁ
బ్రణవపంచాక్షరీ మండ • పమునఁ జేర్చి.

గీ. వజ్రినాభుని దేవి క♦న్యాని సుతుల
కాజ్ఞ నిడి వారు శయనింప ♦ నపుడు దాను
కుశసమన్విత శార్దూల ♦ విశదచర్మ
మవని పై వైచి శయనించె ♦ నంత మౌని.

వ. ఇట్లా యోగానందుండు స్వర్ణలింగంబునకుఁ బూర్ణిమా వ్రతంబు సంపూర్ణంబు గావించి దినదినంబును విశేషోత్సవంబులఁ జాతుర్మాస్య దీక్షాపరిసమాప్తి నొందించి యవభృథస్నానంబు గావించి కృతకృత్యుండై యాత్రికై చని పెక్కుదినంబులనుండి రాకుండిన వజ్రినాభుని యాగమనంబు గోరుచు విశ్రాంతికై తద్గృహంబునఁ గొన్ని దినంబులు నివసించియున్నఁ దన్నగరంబునఁగల పౌరులెల్లరు యోగీంద్రు మహామహిమంబుల కచ్చెరువందుచు నిత్యంబు తద్దర్శనార్థం బరుదెంచి.

సీ. సంతతిలేదు మా♦జవరాలి కుపదేశ
మిమ్మంచుఁ బాదముల్ ♦ నమ్మువారు
కన్నులులేవు మా♦కన్నతల్లికిని సి
ద్ధాంజనంబిమ్మంచు ♦ నడుగువారు
ఆలికి మగనికి ♦ సానుకూల్యము లేద
టంచు రక్షలను యా♦చించువారు
మాకోడలికి భూత ♦ మాంద్యంబు పైసోఁకెఁ
దీర్థ మిమ్మంచుఁ బ్రా♦ర్థించువారు
గీ. మాగృహంబున ద్రవ్యంబు ♦ మాయమయ్యె
రాత్రి యెవఁడు హరించెనో ♦ ప్రశ్న చెప్పఁ
డనుచు బ్రజలెల్ల గుంపులై ♦ యాజటీంద్రు
పాదముల మ్రొక్కి యర్థించి ♦ బాధపెట్ట.

కం. విడలేక వచ్చు పౌరుల
నడికోర్వఁగలేక వారి ♦ సంసారంపుం

గడగండ్లు వినఁగ లేమిని
జిడిముడిపడి మాని మదినిఁ ♦ జింత మునింగెన్.

శా. హౌరా! చెల్లదు యోగిజాతికి మరే ♦ మైనం జిరావాసముల్
వీరెవ్వారలు? నేనెవండ? సుతులన్ ♦ వేడ్కం బ్రసాదింప నే
నేరన్ మోసమువచ్చె నేమిగతి నే ♦ స్నేహానుబంధంబునం
దూరంబుం జనుమంచుఁ జెప్ప వెరతున్ ♦ దోసంబువచ్చెన్ గదున్.

మ. తొలిజన్మంబునఁ జేసినట్టి సుకృతో ♦ ద్యోగంబునం జేసి పు
త్రులు భాగ్యంబు సుఖంబులెల్ల సమకూ ♦ రుంగాక వేసారి మ
ర్త్యుల వైరాగుల వెంబడింప సకలం ♦ బున్ సృష్టిసేయంగ బ్ర
హ్మల మే? మానవకోటిఁ దారెఱుఁగ రీ ♦ యర్థంబు మూఢాత్ములై.

గీ. చింతచేఁగాదె భరతుండు ♦ చెడియె మున్ను;
దాసి సంసేవచేఁగాదె ♦ దాసుఁడయ్యె
విప్రనారాయణాఖ్యుఁడే ♦ వేళగాని
యోగులకుఁ బొరసంబంధ ♦ ముండఁదగదు.

గీ. ఉంగరంబును గొనిపోయె ♦ నుర్విసురుఁడు
నింక రాఁడయ్యె మాసంబు ♦ లేగె రెండు;
నాదు యాత్రావిచారంబు ♦ నకు మహాంత
రాయమానేమొ తెలియంగ ♦ రాదు మదికి.

కం. ఆయుంగరమును గొని గృహ
నాయకుఁడరుదేరకున్న ♦ నాగతి యెట్లో!
శ్రేయాంసి బహువిఘ్నా
నీ యను సామెతకు సాక్షి ♦ నేనే యగుదున్.

శా. కాని మ్మేమితలంచెనో శివుఁడటుల్ ♦ కాకుండునే? యెన్నఁడుం
గానున్నట్టిది కాకపోదు, మరియుం ♦ గాదెప్డు గానట్టిదం
చేనాఁడైన వచింతు రార్యులు తదీ ♦ యోక్తప్రకారంబునం
బోనున్నట్టి మహాత్ముఁడాపదలచేఁ ♦ బోకుండు నెవ్వేళలన్.

వ. అని మనంబున గొంతసేపు వితర్కించి నిట్టూర్పు విడిచి నిమీలితనేత్రుండై.

శా. దీనుండన్ భవదీయభక్తుఁడ భవత్పాదాబ్జయుగ్మంబునన్
ధ్యానింపుంగద నాహృదబ్జమున నీదాస్యంబుఁ గాంక్షించి నీ
యానందామృత దృష్టి నాపయిని దేవా! వేగఁజూపించి స్వ
స్థానంబుం దగఁజేర్పు నాదు దురవస్థంబాపి గౌరీపతీ!

శా. కానన్ లేక భవన్మహామహిమ చీకాకై వితర్కించి యు
జ్ఞానుల్ కొందరు లాతిదేవతలు నిక్కంబంచుఁ బూజించి యే
హైనంగానరు నీకటాక్షమును దేవా! నాపయింబంపి స్వ
స్థానంబుం దగఁజేర్పు నాదు దురవస్థం బాఁపి గౌరీపతీ!

వ. అని మహానుభావుండైన యోగానందుండు మహాదేవుని ముహూర్తకాలంబు ధ్యానించి నమస్కరించి సుమనస్కుండగుచు యశస్కుండయిన యజమానుని యాగమనంబు గోరుచుఁ దద్గృహంబున నాగృహవాసులు చేయు శిశ్రూషలం గైకొనుచుఁ గాలంబు గడపుచున్నంత.

కం. మునివర సిద్ధునికథలన్
వినుపించుచు వజ్రనాభు వృత్తాంతంబున్
మనమందు మఱచినారలె
వినిపింపఁగ సూత! సుగుణ వినయోపేతా!

గీ. ఎచటికేగెను బ్రాహ్మణుం డేమిచేసె
నేమహాతీర్థములఁ గ్రుంకె నెందునిలిచె
ఏమిపనిచేసి మనలె దానెంతదాఁక
జెప్పుమా! రౌమహర్షణీ! చిత్రముగను.

వ. అని పురవైరికథాసుధాలాలస హృదయారవిందులై యడిగిన శుకశౌనకాదులకు మహానుభావుండైన సూతమునీంద్రుం డిట్లనియె.

చ. వినుఁడు మునీంద్రులార! పృథివీసురుఁ డట్టుల నుంగరంబు భ
క్తిని ధరియించి నిల్వఁడని ♦ తిన్నఁగఁ దా బతిమాలు కాంత చే
తను దన చేయిఁ జేర్చి వని♦తామణి వేగమె వత్తునంచు వె
న్కను జనుదెంచు శిష్యుల వినమ్రులఁ బుత్రుల వీడుకొల్పుచున్.

గీ. అప్రమత్తులరై జటి ♦ నరయువలయు
సేవల నటంచుఁ జెప్పి తా♦శిష్యగణము
నింటికినిఁ బంపి నాటిరే♦యిని సమీప
మార్గమునఁ బల్లెటూరిలో ♦ మజిలి సేసి.

గీ. ప్రేమపూర్వకముగఁ దన ♦ వెలఁది కట్టి
పంప శిష్యుఁడు గొని తెచ్చు ♦ పంచవన్నె
ప్రేపపుట్టిక మడుగును ♦ విప్పి కొన్ని
కమ్మ గరగరలాడు భ♦క్ష్యములు మెసవి.

గీ. అచట నారేయి విశ్వేశు♦ నంఘ్రియుగము
స్మరణ సేయుచు సుఖనిద్ర ♦ సలిపి యతఁడు
వేకువను నిద్ర మేల్కాంచి ♦ వేగఁ గాల్య
ములను దీర్చి స్నానము జపం♦బులు ఘటించి.

కం. ఉంగరము వ్రేల నిడుకొని
పొంగుచు నుత్తరదిశాభి♦ముఖుఁడై మహి సా
ష్టాంగం బెరగుచు జయజయ
గంగాధర! యనుచు నెగసె ♦ గగనస్థలికిన్.

వ॥ ఇట్లా వజ్రనాభుండు సిద్ధాంగుళీయప్రభావంబునఁ జేసి విహంగంబుచందంబునఁ ద్రుటికాలంబున హిమాలయంబు దరియం జొచ్చి తత్సమీపంబున నొక్క రమ్యకాంతారమార్గంబున భూమికిఁ దిగి యత్యంతకుతూహలంబున నాపర్వతంబున కభిముఖంబుగాఁ జను చున్నంత,

సీ. అలకాధునీ సము♦జ్జ్వల చారువీచికా
తతసేవలను జల్లఁ♦దనము నొంది
గిరిసుతా శశిమౌళి ♦ కేళీనికుంజసం
చారంబులను బుణ్య♦సరణిఁ గాంచి
మాధవీసుమ దివ్య♦మంజుల పరిమళ
లహరీ సమూహంబు♦లను గ్రహించి
మాకంద మధుపాన ♦ మత్తమధువ్రత
మల్లస్వనంబుల ♦ మహిమఁ గాంచి
గీ. తటచరత్కిన్నరీకుచ♦ద్వంద్వమిళిత
లలిత కస్తూరి కాగంధ♦ములను బొరలి
మెల్ల మెల్లన వీచె స♦మీరగణము
లవనిసురమౌళి చనుమార్గ♦మందు ముందు
కం. ఆవాతపోతచయ సం
భావితుఁడై పోయి కొంత ♦ మార్గశ్రమము
బోవం బోవఁగ నొక్క స
రోవరముం గాంచె నెదుట రుచి♦రాంబుజముల్.
వ. కాంచి తదీయపుణ్యజలాశయంబు తీరంబున నొక్క సుమేరు విటపిపటల సమాశ్రయంబైన రమ్యాశ్రమంబు పొడఁగాంచి యచట గొన్నిదినంబులు నివసించుట యుత్తమంబనితలఁచి యున్నంత ;
సీ. ధళధళత్కాంతులఁ ♦ దాండవించెను జంద్రుఁ
డిందీవరంబు లా♦నందమొందె
వితతజలంబులై ♦ విల్లపిగ నదంబు
లంభోదములు మూల♦లందుఁ జేరె
గగనంబు చుక్కల♦కంచుకంబు ధరించెఁ
గాశప్రసూనముల్ ♦ కాంతిమించెఁ
బరిపాకశోభ చే ♦ భాసిల్లె సస్యాళి
యాగస్త్య దిశ్మార్గ ♦ మరిగెఁ దరణి

గీ. రమ్యసైకత వేదుల ♦ రాత్రులందుఁ
దరుణు లంగజ మంత్ర వి♦ద్యారహస్య
ములను బతులచేఁ దెలసి స♦మ్మోదమంద
లీల నేతెంచె, దగ శర♦త్కాల మపుడు.

సీ. నవరాత్రి దీక్షలు ♦ నవరించి దేవిని
మించి సద్భక్తి సే♦వించువారు
పరరాజులను గెల్వఁ ♦ బయనమై చతురంగ
ములఁగూర్చి కత్తికి ♦ మ్రొక్కువారు
నావికావ్యాపార ♦ నైపుణ్యమునఁ గొత్త
దేశంబునకుఁ బయ ♦ ల్దేరువారు
ఉల్లాసగీతంబు ♦ లొప్పఁ గుప్పలనుఱ్చి
ధాన్యముల్ పాత్రల ♦ దాచువారు

గీ. యోగ్యకాలంబటంచు ను♦ద్యోగులయ్యు
బ్రహ్మకులజులు పార్థివుల్ ♦ వైశ్యగణము
పాదభవులెన్న సంతోష♦భరితులగుదు
రాశరత్కాలమందు ధ♦నేశులగుచు

మ. పులిన శ్రేణుల నించు కించుక మలాం♦భోయుక్త లౌ నిర్ఝరా
వళి దర్శింపఁగఁ జేయు పాంథులకు శే♦వల్ నూత్న సంభోగమం
దు లతాంగుల్ జఘనప్రదేశముల నూ♦నూ సిగ్గుచే నాత్మ భ
ర్తల కల్లల్లన చూపునట్లు చెలువొం♦దన్ శారదాహంబులన్.

క॥ పల్లవపాణులు తమతమ
వల్లభులం గలసి రమ్య ♦ వల్లీసుకుటీ
హల్లక సుమతల్పంబులఁ
గొల్లగఁ గ్రీడింతు్రు మరుఁడు ♦ గో యని యార్వన్.

వ. అట్టి సకల సౌభాగ్య సేవ్యంబైన శరత్కాలంబునందు నా పుణ్యవనంబున నివసించి వజ్రనాభుం డొక్కనాఁ డా సరోవరంబున

నవగాహనంబు సేయందలంచియుత్తమాలికయు మునిదత్తంబైన స్వర్ణాంగుళీయకంబును దత్సరోవర సమీప చంద్రశిలాఫలకంబునఁ గృష్ణాజినంబు ననుసంధించి దాచి యుంచి తానును గాసారంబునం దిగి దేశకాలపాత్రంబు లుచ్చరించి జలాధిదేవత నావహించి కృతావగాహుండై న.

సీ. సారంగచయ సమాశ్రయమై మహా హంస
నిలయమై సౌవర్ణ ♦ జలజమగుచు
నవసుధా జీవనానందమై కమలాప్త
కరదత్త సౌభాగ్య ♦ కలితమగుచు
శంఖ కచ్ఛపకులేశాది సంసేవ్యమై
మహనీయరత్న స♦మాన్యమగుచు
ఘనసార సౌగంధ్య ♦ కలిత సన్మార్గమై
మానసైకస్థాన ♦ మహిమఁగనుచు

గీ. భోగినీ నిత్య సేవ్యమై • పొలుపుగనుచు
శైవలసదపాంగాలోక • సాధ్యమగుచు
స్వర్గలక్ష్మినా నెదుట సాక్షాత్కరించె
ధారుణీసురు నెదుటఁ గా♦సారలక్ష్మి.

గీ. అట్టి కాసారమందు నా • యవనిసురుఁడు
మునిఁగి లేచియుఁ దన మున్ను ♦ ముడిచికట్టి
దాఁచు నంగుళ్యమును మదిఁ ♦ దలచకుండ
నేగె నొకసిద్ధు మహిమచే • నెఱుకమరచి.

కం. తనమొదటినెలవు గానక
చనిచని వనమెల్లఁ దిరిగి ♦ చలిమలయందుం
గనఁదగిన వింతలెల్లను
మును గని తన కెఱుఁగఁ జెప్పు ♦ పురుషుఁడు లేమిన్.

కం॥ దిక్కులు వెదకుచుఁ బొదలం
జిక్కని మార్గంబు గనక • సారెకు మును దా

నెక్కిన త్రోవల నెక్కుచుఁ
గ్రక్కునఁ జనుచున్న నతని ♦ కన్నుల యెదుటన్.

ఉ. ఫాలమునందుఁ గుంకుమము ♦ భాసిల భూరిశటమునందుఁ జందురుం
బోలిన భూతి పాశుపత♦ముల్ వెలుఁగంగ విలోచనద్వయిన్
నీలరసాంజనంబు జిగి ♦ నింపఁగ రక్తపటంబు లొప్పఁగా
బాలకయోగి యొక్కఁడు కృ♦పామతియై కనుపట్టెఁ బెల్లునన్.

గీ. కులుచ గడ్డంబు జుంజురు ♦ కురుల జడలు
పలుచనగు మొగంబును గల ♦ బాలతపసిఁ
గాంచి యాతని వలన మా♦ర్గంబు దెలియఁ
గల దటంచును నెదురేగి ♦ నిల్చి మ్రొక్కె.

గీ. ఓ మహాభాగ! మీ రెవ్వ♦రో మ రెందు
నుందురో? విప్రకులజుండ ♦ నొంటివాఁడ
తీర్థ సంసేవకై వచ్చి ♦ తెరువు గాన
నెతి నొకదిక్కు జూపి పు♦ణ్యమునఁ బొమ్ము.

మ. అనినన్ బాలకయోగియక్కటకటా ♦ యనాఁయయొ ట్లొంటిగాన్
జనుదేరం దగునయ్యఁ శీతనగమ♦న్నన్ మాటలే? యెవ్వఁడో
నిను బంపెంగద వెఱ్ఱి యిచ్చటికిఁ గా♦నీ యెద్దియో చెట్టు త్రొ
క్కినజాడల్ కనుపించుఁ ద్వాద్వచనఫ♦క్కిం జూడ నుర్వీసురా!

సీ. మునిఁగినంతనె బుద్ధిఁ ♦ బోఁగొట్టు కోనేళ్లు
తప్పి త్రొక్కిన దిమ్మ ♦ త్రిప్పు చెట్లు
తనయూరు మఱపించి ♦ దరిఁ ద్రిప్పు తిప్పలు
పిచ్చిదయ్యాలైన ♦ పెద్దశిలలు
ఉన్మత్తులం జేసి ♦ యోడించు మృగములు
గాయంబు నూఁగించు ♦ వాయుగణము
మాంద్యమిచ్చెడు మచ్చు♦మందులతీవలు
కాలి సంకెలవేయు ♦ కందరములు

గీ. పిలిచి బతిమాలి కాళికి ♦ బలి యొసంగు
వామమార్గావలంబి ని♦వాసములును
గలవు ప్రాలేయ శైల దు♦ష్కానన ములఁ
దిరుగఁగూడదు తెలియకే ♦ తెఱవులందు.

గీ. అఖిల సౌభాగ్యకారి హి♦మాంశుశిఖరి
యనుట నిజమైనఁ గష్టంబు ♦ లమరుగొన్ని
మంచి నిడుచోటఁ జెడుగుల ♦ నుంచు నజుఁడు
చందనాద్రిని భోగుల ♦ నుంచఁడొకో.

ఉ. కావున నాకుఁ జెప్పకయ ♦ కానలలోఁబడి పోకుమయ్య! నీ
తోడ వడి నేఁగుదెంచి మహి♦తోజ్జ్వలదివ్యతుషారశైల సం
భావిత పుణ్యభూములఁ గ్ర♦మంబునఁ జూపెద వెంటరమ్ము నీ
భావమునందు సంశయము♦ బాయుము మీకును బుణ్యమయ్యెడున్.

గీ. తీర్థసంసేవ కరుదెంచి ♦ తెరువుదప్పు
మిమ్ముబోటి గృహస్థుల ♦ మేలుకొఱకుఁ
గాదె మమునుంచె నిచట శం♦కరుఁడు దేవి
రమ్మటన్నను ద్విజుఁడు మో♦దమ్ము సెంది.

ఉ. పెన్నిధిఁ గన్న పేదవలెఁ ♦ బెద్దయుఁబొద్దు దలంచి దైవమే
నన్నుఁ గృతార్థుఁ జేయ నిట ♦ నమ్మికభక్తునిఁ బంపె నట్లు కా
కున్న మరేల నీతఁడు మ♦హోన్నత సత్కృపతోడ వచ్చు నా
కెన్ననఁబోదు గాక కడ♦తేరితి నంచు వచించి యాతడున్.

గీ. మంచినను దేల్చినను నీవె ♦ పురుషవర్య!
నిన్ను మునుకొని వత్తుసం♦దియము విడిచి
సరవిని చోటఁగల విశే♦షములు దెలిపి
నన్నుఁ గడతేర్చి మేటి పు♦ణ్యమునఁబొమ్ము.

వ. అని విపన్నుండై వెనువెంట నరుగుదెంచు వజ్రినాభుని ధరణీసురవరా! సత్వరంబున నావెంట నరుగుదెమ్ము. అరుణకిరణుండు

చరమగిరిశిఖరంబు దరియకమున్నె నిర్భయంబుగా మన నెలవులకుఁ బోవుదమనుచుఁ బలికి యాయిరువురు గొంతదూరంబు వడివడ నడకలఁ జని చనిరి. తనపిలుందన వచ్చు పుడమి వేల్పుఁగాంచి వేళ్లు నిరూపించి యా వైదేశికుం డిట్లనియె.

సీ॥ ఇది యగణ్యంబైన ♦ బదరికావనభూమి
అది నరనారాయ♦ణాశ్రమంబు
ఇదియె మందాకినీ ♦ ప్రథమ శైశవరంగ
మది యిలుం డంగన♦యైనచోటు
ఇది సప్తఋషిసమా♦హిత రత్నకూటంబు
అది మనోరమ కేళి ♦ హార్మ్యతలము
ఇది హిమాచలరాజ ♦ హేమసింహాసనం
బది విశాలాక్షి క♦ల్యాణవేది

గీ॥ ఇదియె మదనుండు శైవాన♦లేక్షణమున
గర్వ ముడివోవఁ దృటిలోన ♦ గఱఁగుచోటు
ఇదియె పరమేశ్వరునిఁ గోరి ♦ హృదయమందు
నలసి పార్వతి తపమూని ♦ నట్టిచోటు.

గీ. అనుచు నొక కొంత దూరంబు♦నరిగి యరిగి
పలికె జడదారి ద్విజునితో ♦ బ్రహ్మవర్య!
గౌరి నిర్మల హృత్పరీ♦క్షణ రచింప
నభవుఁ డవతరించిన స్థలం ♦ బదియె కనుమి.

వ. అని పలికిన నామునివేషధారి యతనితో మరికొంత దూరంబు చని చని యొక్క మహాస్థలంబు నిరూపించి యిట్లనియె.

సీ. ఇచ్చోట రచియించె నెలమితో సగరుము
మ్మనుమండు తపసియై ♦ ఘనతపంబు
నిచ్చోటఁ జరియించె ♦ నిచ్చతోఁ బ్రవహుండు
ప్రణుతమౌ పాద లే♦పంబువలన

నిచ్చోటఁ గరగించె ♦ మెచ్చి వరూధిని
కపట గంధర్వునిఁ ♦ గాముకేళి
నిచ్చోట వెలయించె ♦ హెచ్చు శైశవమును
స్వారోచిషాఖ్య ధీ♦శాలిమనువు
గీ. తొలుత నిచ్చోట హయమేధ ♦ తురగ మార్గ
ణప్రమోదిత సగరసం♦తాన పుణ్య
కారణంబైన స్వర్గ గం♦గాప్రవంతి
యవతరించెను గనుము భూ♦దివిజముఖ్య!

మ. మును పిచ్చోట మునీంద్ర పత్నులను దా ♦ మోహించి వైశ్వానరుం
డనుతాపంబునఁ బొందుటల్ తెలిసి స్వా♦హాదేవి సప్తర్షి భా
మినులం బోలు తనూవిలాసమునఁ గూ♦ర్మిన్ జాతవేదున్ రతిం
దనియం జేయ నతం డెఱింగి శపియిం♦చం బోయెఁ దాఁ గాంచుమా!

గీ. తారకాసురుబాధకు ♦ దాళలేక
సురలు శివుని బ్రార్థించి రి♦చ్చోటఁ గనుము
హరుని తేజంబు ధరియించి ♦ యభ్రగంగ
కార్తికేయుని నిచ్చోటఁ ♦ గనియె గనుము.

వ. అని యిట్లాగృహస్థునికా వానప్రస్థుండు తీర్థవిశేషంబు లెఱిఁగించి హిమశైలంబు దిగి తత్పర్వతపశ్చిమభాగంబున నున్న నొక్క దుర్గమారణ్య కంటక గండ శిలాపరివృతంబై యుద్దండ వేదండ సింహ శరభ శార్దూలాది నానామృగ గణ భయంకరారావపూరితంబై యక్షరాక్షస పిశాచోరగ మహాభేతాళాది సంచారంబైన నొక్క కోనం జూపి మహాత్మా! యిందుఁగల యోగ్యస్థలంబుల నెల్ల నాదోఁచి నంతమట్టు నెఱింగించితి; నింకమీఁద మనుష్యసంచారంబు దుర్లభంబు. గావున నీనాటికిఁ బయనంబు విరమించి విశ్రాంతికై కొందుమే యనుటయు గృహపతి యతని కిట్లనియె.

ఉ. అల్లదె! సిద్ధవర్య! కను • మా! కనుపట్టు సమీపమందు వి
ద్యుల్లత లల్లిబిల్లిగొని • యుండెను రక్తపటధ్వజంబు శో
భిల్లుచునుండె నభ్రపథ • భేదనకారి సువర్ణకుంభ సం
పల్లలితంబుగా వెలసి • వర్తిలుచున్న దదేమి తెల్పుమా!

వ. అనిన నాకుటుంబికి నతం డిట్లనియె:

సీ. తీక్ష్ణదంష్ట్రాభీమ • దీధితిచ్ఛటలతో
నేదేవి భీకరా • కృతి సెలంగు
శక్తిసమూహ మా • సక్తితోఁ గొలువంగ
నేదేవి నడురేయి • మీఁదఁ దిరుగు
నిచ్చ వామాచారు • లిచ్చెదు నరమాంస
మేరాణి తృప్తిలోనఁ • గోరిమ్రింగు
మసనంబులను భూత • విసరంబు కొండాడ
నేదేవి భూతేశు • నెనయఁ గోరు

గీ. తన్ను మదినమ్మి కొలచిన • దాసజనుల
కఖిల సంపద లిచ్చు నే • యంబ యట్టి
కాళనాథుని దేవియౌ • కాళికాంబ
యాలయం బదె కనుము బ్రా • హ్మణవరేణ్య!

మ. నవరాత్రవ్రతులయ్యుఁ గొందఱు ఖలుల్ • నానాప్రకారంబులన్
నవసంప న్నికరంబు గోరి జనులం • బశ్వాదులం దెచ్చి దు
ష్టవిధిం జంపుదు రాత్మలం గరుణ లే • శంబైన లేకుండ నో
లి వెసంబోవుట దోస • మచ్చటికిఁ గా • ల్కిన్ క్రొమ్ముక్క నిచ్చోట నే.

వ. అని సిద్ధుఁడు చెప్పిన నతం డట్లు సేయ నిరువురు నచ్చోట నొక్క రమణీయశిలాతలంబున విశ్రాంతికై కూర్చుండి యుండ నానాటికి నాపని చాలించువారై యపరాహ్ణం బగుటయు నతం డతని కిట్లనియె.

మ. తరమే? చెప్పఁగ నీతుషారగిరినిన్ ♦ దైవారుచిత్రంబులన్
విరమింపందగు నేటి కెల్లి యిటకున్ ♦ వేవచ్చి చూపించెదన్
వరచంద్రోపలవేదికానికటమం♦దార ద్రుమచ్ఛాయల
న్బరమాహ్లాదముతో వసింపు మపరా♦హ్ణంబౌట గాన్పించెదన్.

గీ. సిరియు సంపద తులఁదూఁగి ♦ పురములందు
కడుసుఖంబున వసియించు ♦ ఘనులు మీర
లెంత శ్రమనొందిరో యిందు ♦ కొంతసేపు
విశ్రమింపుండు నే నిట ♦ విశ్రమింతు.

గీ. ఎవరు బంపంగఁ దొలుత మీ ♦ రింతదవ్వ
నరుగు దెంచితిరిటు పథా♦యాస మనక
నెద్దియో సిద్ధమహిమ మీ ♦ కెనయకున్న
మంచుకొండకుఁ జనుటన్న ♦ మాట యగునె?

గీ. చెప్పఁదగునేని వచియింపఁ ♦ జెల్లు మీక
టన్న వజ్రనాభుం డనె ♦ నతనితోడఁ
జల్లకును వచ్చి ముంత దాఁచంగ నగునె?
వినుతు నాకథ నొకకొంత ♦ వినుము సిద్ధ!

సీ. గంగాస్రవంతీ త♦రంగపావనమయ్యుఁ
బొలుపొందు మాణిక్య♦పురమునందు
నిర్మల గార్హస్థ్య ♦ నియతి వర్తింపు చే
నుండ నా సుకృతంబు ♦ పండినట్లు
సిద్ధుం డొకండు వేం♦చేసి నా గృహమందు
నాతిథ్యమునుగొని ♦ హర్షమంది
సకల యాత్రాకథా♦సంగ్రహం బెఱిఁగించి
యంత నాప్రార్థనం♦ బవధరించి

గీ. మున్ను తనభక్తి మెచ్చి శం♦భుండు కరుణ
జగములన్నియు క్షణములో ♦ సంచరింపఁ

దన కొసంగిన యుంగరం♦బును మదీయ
పాణిపుటమందుఁ బెట్టుచుఁ ♦ బలికె నిటుల.

గీ. భూమిదేవ! యీయుంగరం♦బును ధరించి
యిచ్చగలచోట తిరిగి రా♦వచ్చుఁగానఁ
బోయిరమ్ము శీఘ్రింబ నీ♦పూన్కి దీఱు
నంతవఱ కేను నిలుతు నీ ♦ యాలయమున.

గీ. దీని హరియింప నెందఱో♦ తెరువుల్లలందుఁ
గాచియుందురు వామమా♦ర్గప్రచారు
లప్రమత్తుండవై వారి ♦ కంద నీక
మరలఁ గొనివచ్చి యిమ్ము యుం♦గర మటంచు.

క. ఇచ్చినఁ దన్మహిమంబున
నిచ్చటి కే నరుగుదెంచి ♦ తిదిగో కనుమా!
సచ్చరితు నుంగరం బని
మెచ్చుచుఁ దనవ్రేలు కొంత ♦ మీఁదికి నెత్తెన్.

క. అంగుళ్యహీనమగు తన
యంగుళిఁగని పెదవి విఱచి ♦ యయ్యో శివుఁడా!
యుంగరము లే దదేమో!
దొంగలు గొనియుండి రేమొ? ♦ తోఁచ దటంచున్.

గీ. జన్నిదము నంగవస్త్రము ♦ సారె సారె
కొనర విదలించికొనుచుఁ దా ♦ వెనుక ముందు
పోయె నిజముగాఁబోయె నా♦ పూర్వపుణ్య
ఫలము పోయెను నాప్రాణ♦పదముపోయె.

వ. అని గుండెదిగులున నేమియుం దోఁచక కొంతవడి నిశ్చేష్టితుండై కనులనుండి బాష్పకణంబులు జొటజొట కాఱ డగ్గుత్తికపడి 'శివశివా యెంతపని యయ్యె' ననుచు సిద్ధునిముఖంబింక నెగతి చూచు వాఁడ' నాలుబిడ్డలకు దూరంబైతిఁ దుట్టతుదకుఁ గట్టడి దైవంబు కొనలం

ద్రోసెఁగదా యని చింతించుచుఁ దనకు మున్ను దెరువుఁ జూపిన విరాగి పాదంబులం బడి, తపోధనా! మీ కేమైన నాయుంగరంబు కనంబడదు గదా! యని యెంత యపచారం బాడితి క్షమింపుఁ డని యతనిం బతిమాలుచుఁ దనలో నిట్లని విలపింపం దొడఁగె.

మ. అకటా! యేగతి వ్యర్థ మయ్యెను మదీయంబైన జన్మంబు వి
ప్రకులంబందునఁ బుట్టి గేస్తనయి సత్పాండిత్యముం గాంచి శి
ష్యకుటుంబంబులఁ బ్రోవఁజాలిన ధనం బార్జించి ధీశాలినై
సకలంబుం జెడగొట్టుకొంటిని మహా శైలాటవిం జిక్కితిన్.

మ. వరయాత్రాపరుఁడైన మౌని నటు నిర్బంధించి ప్రార్థించి యుం
గరముం గైకొని యేల వచ్చితిని? వేడ్కన్ మత్సతీరత్న మ
క్కరతో నొంటిగ యాత్ర కేగుట యయుక్తంబంచు వెన్నాడినన్
సరకుంజేయక వచ్చు టేల? తుహినచ్ఛన్నాటవీభూమికిన్.

మ. మరలన్ నాపురి కేగు మార్గమును బ్రేమం జూపువా రెవ్వ రి
త్తతినిన్ వత్తురు వెంబడించి ముని దత్తంబైన యుంగ్రంబ దె
క్కరణిన్ నాకులభించునింటికడ యోగ్యంబైన కర్మంబులుం
జిరకాలంబును నేను లేకునికిఁ బ్రక్షీణించు నానాటికిన్.

మ. వనితారత్నము కూర్మిపుత్రు లతిథివ్రాతంబు గోశ్రేణి దుః
ఖనిమగ్నాత్మకులై శరీరమును వీఁకం బాయువా రగ్నులున్
మును పే శాంతములౌను శిష్యవితతిం బోషింతు రెవ్వారు సం
జనితంబయ్యెడు పాపసంచయము పుణ్యాంబింక క్షీణించెడున్.

మ. విమలాంగుళ్యవిచారముం దెలియఁ వేవే గాశి రామేశ్వరం
బు మహానంది యహోబిలంబు మధురా భోగేశ్వర శ్రీగిరుల్
హిమకాంతార మహాహి దుష్టమృగ వాహిన్యావృతం బీనగా
గ్రముఁ గాంచంగను వచ్చు టేల మహితజ్ఞానైకశూన్యుండనై.

గీ. విద్యలన్నియు నేర్చి వివేకవంతుఁ
డైన వేదాంతయోగ విజ్ఞానియైన

స్వకృతవితతాపరాధ సం♦జనితబహుళ
శోకసంతప్తహృదయుఁడై♦శోత్రియుండు.

చ. అని పలవించు విప్రుఁ గని ♦ యాజటియాపుఁడు పల్కె నిట్లు లీ
వనటను గుందు టేల బహు♦భంగుల నీయపరాధచర్యలన్
మనమున ధైర్యముంగొను ము♦మాపతిపాదము నమ్ము మాతఁడే
నినుఁ దఁ జేర్పు భక్తజన ♦ నిత్యకృపాకరమూర్తి గావునన్.

గీ. జలములను గ్రుంకు వేళనో ♦ సారవన్య
ఫలములను గోయు వేళనో ♦ పర్ణశాల
యందు నిదురించు వేళనో ♦ యంగుళీయ
కంబు మఱచియుందువ యీవ♦నంబునందు?

గీ. మున్ను మునివరు నీగృహం♦బునకుఁ దెచ్చి
యంగుళీయక మిప్పించి ♦ నట్టికిప్రుఁడు
యడవి నొంటరివై వెతల్ ♦ గుడుచుచున్న
నిన్ను నీయింటికినిఁ జేర్చ♦కున్నె? సుమతి!

ఉ. నావుడువల్కె భూమిసుర♦నాథుఁడు భక్తి మహానుభావ! నే
నీవిధి దారిదప్పి తపి♦యించుచు నుండెడు వేళ శంకరున్
భావమునందుఁ గొల్వు మని ♦ బాగుగ నా కుపదేశ మిచ్చు నీ
వే వృషభధ్వజుండ వని ♦ యెంతయు నమ్మెద సాధుపుంగవా!

గీ. ఆపదలయందుఁ గుందల ♦ మందు నాకు
నప్పుడప్పుడు కర్జంబు ♦ చెప్పునట్టి
నీదు నాశ్రమ మెచటనో ♦ నామ మేమొ
వేడ్క వచియింపు వీనుల♦విందుగాఁగ.

చ. అనవుడు నావిరాగి వసు♦ధామర! దేవుఁడ గాను నేను నా
కును నెల వెందు లేదు కడు♦గోప్యము నాదగు నామ మేరికిన్
వినఁగ వచింపరాదు ముని♦విశ్రుతు డొక్కఁడు శాపమిచ్చెఁ దా
మును నొక కారణంబుగొని ♦ పూర్వకృతంబులు తప్ప వేటికిన్.

గీ. కాన నీమనమందు శంకరుని దలఁచి
నిష్ఠనుండుము నే నిందు ♦ నిదురగొనెదు
కాళికరుణను నాస్వప్న ♦ వేళ నేమి
చెప్పెనో? తచ్చరిత్రంబు ♦ చెప్పుదు నీకు.

వ. అని విరాగి వచించిన మహాశ్చర్యంబు నొంది భూసుతుండు కొంతదుఃఖంబు చాలించి భూతలంబున శయనించి కరాంబుజంబులు మోడ్చి మనంబున నీశ్వర సన్నిధానము కల్పించుకొని యిట్లని ధ్యానింపం దొడఁగె.

శా. నానాస్థావర జంగమ ప్రతతికిన్ ♦ నాథుండ వీవంచు నీ
శా! నాళీకభవాచ్యుతప్రముఖులున్ ♦ ధ్యానించి నీరూపమున్
గానన్ లేరఁట కాంచనేర్తునె జడుం♦డన్ మూఢుఁడన్ దేవ! స్వ
స్థానంబుం దగఁజేర్పు నాదు దురవ♦స్థం బాపి గౌరీపతీ!

శా. మౌనీంద్రుం డిడు దివ్యసాధనము ధీ♦మాంద్యంబునం జేసి యీ
కానం బోఁగొని యిల్లు సేరుటకు మా♦ర్గంబెందుఁ గానన్ మహే
శా నాకాంతను బుత్త్రిలన్ మునిని స్నే♦హంబొప్ప దర్శింప స్వ
స్థానంబుం దగఁజేర్చు నాదు దురవ♦స్థం బాపి గౌరీపతీ!

చ. అనుచుఁ దదేకనిష్ఠ వసు♦ధామరుఁ డట్లు పురారిపాదముల్
తన మనమందు నిల్పుకొని ♦ ధ్యానము సేయుచు నన్నపానముల్
గొన నవకాశముం గొనక♦ కొండలఁ దిప్పల సిద్ధు వెంట నె
క్కొని చరియించుటన్ శ్రమము♦ గూరిన నిద్రను జెందె నచ్చటన్.

చ. మృదులతృణావృతంబగు మ♦హీస్థలమందున మేరు విద్రుమా
స్పద మహనీయ శాఖల ప♦సందగు నీడలఁ జల్లగాలికిం
గదలిక లేని నిద్రఁగొనె ♦ గాఢముగా ద్విజమౌళి సొక్కునన్
మొదలక లోకమున్ మఱచి ♦ మేని నెఱుంగక పొద్దుగ్రుంకినన్.

గీ. చెట్టుపైఁ గొన్ని పిట్టలు ♦ చేరి మిగులఁ
గలకలారావములు సేయ ♦ గంటిఁ దెఱచి

చూచె వసుధామరుండు తాఁ ♦ జూచినంత
క్రమముగాఁ జిమ్మచీఁకట్లు ♦ క్రమ్ముచుండె.

శా. ఔరా! యెంత ప్రమాద మయ్యె నిట ని♦ద్రావేళముంబూని యీ
ఘోరారణ్య మహీజమూలమున సం♦కోచింప కేఁ బండితిం
గ్రూరంబైన మృగాళి క్రమ్మఱు నిటం ♦ గ్రుంకెన్ సహస్రాంశుఁడుం
దోరంబై తమ ముల్లసిల్లె మునిమా♦న్యుం డెందు నిద్రించెనో?

గీ. అనుచుఁ గన్నులు నులుముచు ♦ నల్లనల్ల
ముని పరుండిన చోటికిఁ ♦ జని మహాత్మ!
లెమ్ము తపనుఁడు గ్రుంకె న♦ లేఖ్యగతుల
కారుచీఁకట్లు నల్దెసల్ ♦ క్రమ్ముఁజొచ్చె.

కం. ఉపకారము నొనరింపఁగఁ
గృపచే నాకొఱకు వచ్చి ♦ కేవల శ్రమచేఁ
దపియింపఁ బడితివయ్యా!
తపసీ! మేల్కొనుము నిదురఁ ♦ దలఁగింపఁగదే?

గీ. దివ్యకృపతోడఁ గాళికా♦దేవి స్వప్న
వేళ సాక్షాత్కరించె నే ♦ లీల? నేమి
చెప్పె నంగుళీయకగాథ ♦ చెప్పవయ్య
కాయయో? పండో? పెక్కుసం ♦ గతు లవేల?

గీ. అనుచు నిద్ర తూఁగున జీఁక♦టందు పొమ్ము
పోయినట్టి తొందరతోడ ♦ భూమిసురుఁడు
పలుకుమాటల కొక్కజ♦వాబుమాట
వినఁగరాదయ్యె నాతని♦ వెత లడంప.

గీ. వెడల దయ్యెను నిశ్శ్వాస ♦ వితతియైన
నతఁడు లేఁడొకో యను సంశ♦యంబు మదినిఁ
గలఁప మునియున్న తచ్ఛిలా♦తలినిఁ గరము
సాఁచి విప్రుండు తన కేమి ♦ దోఁచకునికి.

ఉ॥ గుండెలు బ్రద్దలై ధనము♦గోల్పడు బీదవిధంబు నుంగిడిం
దండిగ గొన్న గోవుగతిఁ♦దప్పి పయోనిధిఁ బుట్టి మున్గ నో
నెండఁ దపించు కోమటి ర♦హిం బ్రియురా లెడబాసిపో న్మరాం
ధుండు బలెన్ మరేమి మదిఁ ♦ దోఁచక మూర్ఛమునింగెవిప్రుఁడున్.

చ ఇటు వివశాత్ముఁడై నిమిష ♦ మెద్దియొ దుష్ట మృగంబు మ్రింగెనో
జటిని, నతండె నన్ మఱచి ♦ చయ్యనఁబోయెనో కాకపోయినం
గుటిలత శక్తిపూజకులు ♦ గొంకక కాళికిఁ గావువెట్టిరో
త్రుటితము సేసి కంఠమని ♦ దుఃఖమునన్ విలపించె నాతఁడున్.

వ. ఇట్లామహీసురుం డంధకారంబున నెలుంగెత్తి యాతనిం బలుసారులు పిలిచి పిలిచి విహగరుతంబు లెవ్వియైనఁ జెవిఁబడు నపుడెల్లఁ దపసి వచ్చె ననుచు బయ లాలకింపుచుఁ మదముఁ దన దుర్విధి వశంబున నతండు రాకునికి నుస్సురని నిట్టూర్పులు నిగుడించుచుఁ దన యకాలనిద్రావస్థ నిందించుకొనుచు క్షుత్పిపాసావశంబున శరీరం బలసటనొంద నామహాంధకారసమయంబున నెచ్చటికిఁ జనుటకు మార్గంబు గానక తనయంత నికృష్టుండింక నొక్కరుం డీ పుడమియం దుండఁడుగదా యని తనజన్మంబునుం గూర్చి విసిగికొనుచు నావిరాగి మొదటఁ బండియున్న శిలాతలంబున మేను బారవైచుకొని హృదయసంతాపంబునం జేసి నిదురరాకునికి హా'హాతవిధీ! యెంత సేసితే' యని తనదుష్టవిధిం గూర్చి యిట్లని విలపింపం దొడంగె.

ఉ. ఆలును బుత్త్రిలున్ హితులు♦నాశ్రితులున్ నిజగేహముల్ సుహృ
జ్జాలము దూరమయ్యె రస♦సాధనముం బడిపోయె నూఁత చేఁ
గోలగ నున్న సిద్ధుఁడెట♦కో చనె యింక శరీర మొక్కఁడే
వ్రేలుచునుండె భారమయి ♦ వేగహరింపఁగరాదె దుర్విధీ!

శా. దూరంబయ్యె మదాశ లెల్ల వనముం♦దుర్ వానమయ్యెన్ మహా
వైరాగ్యంబు ఘటిల్లె దివ్యమునిసే♦వల్ గల్గె యాత్రాఫలం

బీరోజే లభియించెఁ బుణ్యముల పుట్టిల్లైన భాగీరథీ
తీరంబందున నన్ను వీడి యిఁక ముక్తింజెందుమా! కాయమా!

సీ. అభ్యసించితివి వేదాంతార్థతత్త్వైక
చిత్కళానందద్వైక్యసిద్ధిగనుట
ఆచరించితివి ధర్మార్థకామాది స
త్పురుషార్థముల ఫలబుద్ధిలేక
అనుభవించితివి మహాధ్వర క్రియలందు
సురల హితంబుగా సోమపాన
మార్జించితివి తీర్థయాత్రాసమగ్ర సం
చారంబులను బుణ్యసరణి యెఱిఁగి

గీ. వీఁగఁగంటివి ముని దేవ పితృఋణములు
విడువఁగల వింక పార్వతీమృడవిహార
పావనక్షేత్రముల స్థూలబంధములను
గలదొకో యింతకన్న భాగ్యంబు వేఱు?

వ. అని తలంచి.

గీ. వచ్చునే యిట్టి ఛాందసప్రాణి కధిక
దురితసంసారకామికి మరణ మెందు
జాహ్నవీశీకరార్ద్ర విస్తార పారి
జాతసుమనఃప్రమోదిత సైకతముల.

గీ. అనుచు నచ్చోటనుండుటకును మఱెందుఁ
బోవుటకు నంధకారంబు భూనభములఁ
మ్రింగియుంట చేయునది యేమియును లేక
ఆకసంబును జూచుచు నాతఁ డుండె.

కం. వెడవెడ నడుగులచప్పుడు
వడివడి తనముందు వినఁగ వచ్చిన యతఁడున్
గుడి యెడమలందు వెనుకం
దడఁబడి వెరగొంది చూచి తత్తఱపడుచున్.

కం. మును గిరినిఁ దీర్ఘములఁ జూ
పినతాపసి వచ్చె ననుచు • వేగమె తనకుం
గన నౌను వేరుమార్గం
బని దిగ్గునలేచి తాను • నటజూచితగన్.

గీ. స్వప్నమునఁ గాళి • యంగుళ్య సరణి దెల్పఁ
జనియెఁగాఁబోలు ముని దాని • గనుగొనంగ
దెచ్చియిచ్చును మఱచు నే•సచ్చరిత్రుఁ
డనుచుఁ గొండంతయాసతో•డను గనంగ.

సీ. వితతమహోతాళ•వృక్షసామ్యములై వి
డంబించు దీర్ఘకా•యంబు లొప్పఁ
దనర లోపలనున్న • తామసద్యుతితతి
పైఁదోఁచెనా నీల•పటములొప్ప
యమునికింకరులు దం•డములూనివచ్చి ర
న్నవిధాన దీర్ఘదం•డంబు లొప్పఁ
దాపసశ్రేణి బా•ధలుసేయ రాక్షసుల్
వచ్చిరో యనఁ గ్రౌర్య • ఫక్కి దెలుప

గీ. నిరత మానవహింసాతి•నీచతా మ
హాగ్రభయ దాక్షిగోళంబు • లొప్పుచుండ
నొక్కపెట్టున శాక్తేయు • లిక్క డిక్క
డనుచు నలుగు రాతనికిఁ బ్ర•త్యక్షమైరి.

చ. కరములఁ బెక్కురజ్జువులు • ఖడ్గములుం బెనుదండముల్ భయం
కరముసలాయుధంబు లతి•కర్కశతోమర భిండివాల ము
ద్గరములు దాల్చి యొక్కమొగిఁ • దారసిలంగను జూచి విప్రుఁడ
త్తఱి ముని కాదు కాదనుచు • ధారుణిఁ ద్రెళ్ళెను భీతచిత్తుఁడై॥

చ. యమభటు లట్లుచుట్టుకొని • యాతనికంఠము బిగ్గఁబట్టి హ
స్తములకుఁ గాళ్ళకుం బెనచి • త్రాళ్ళగమిం బిగ నంటగట్టి వ

త్రము ముఖకంఠభాగముల ♦ నట్టముగాఁ బొసఁగించి చుట్టి స్కం
ధముల నొకండొకండు వడిఁ ♦ దార్చిరి మ్రోయుచు వాని నయ్యెడన్.

చ. సిరులనొసంగుఁ గాళియని ♦ చెడ్డతనంబున కాశరంబులై
పురుషులు స్త్రీలటంచనెడు ♦ బుద్ధినిబొందక చిన్నబాలురన్
దరుణవయస్కులన్ ముదిమి ♦ దార్కొనువారల విప్రులైననున్
వరలఁగఁ గొంతుగోయుదురు ♦ వామపథుల్ తగఁ గాళికాంబకై.

గీ. పరమ ధర్మంబహింసయై ♦ పరగుచుండ
హింసయే ముఖ్య ధర్మమం ♦ చెఱిఁగి యెఱిఁగి
కుత్తుకలు దెంతు రిట్టి శాక్తేయ ♦ కులజు లకట
యేమి యైనఁ జేయించు ధ ♦ నేచ్ఛ నరుని.

చ. గొఱియలఁ గుక్కుటంబులను ♦ క్రూర మృగంబుల మత్స్యపంక్తులన్
దురితమటంచు నెంచక యా ♦ త్రుంచి బలిందగఁ జేసి కాళికిన్
సిరులకునై భజించెదరు ♦ చేరి మఱెద్దియు లేనినాఁడు కూఁ
తురులను గాని నిష్కరుణ ♦ ద్రుంచి బలిత్తురు శక్తిపూజకుల్.

కం. భృగువారము నమవసయుం
దగఁ బూర్ణిమ శారదీయ ♦ నవరాత్రంబుల్
మృగశీర్షయుక్తతిథి వ్రజ
మగుఁ గాళికి బలియొసంగ ♦ నర్వాదివంబుల్.

గీ. అవని యన్నాతురునకు రుచ్యంబులేదు
నిత్య విద్యాతురునకెందు ♦ నిద్రలేదు
లలినిఁ గామాతురునకెన్న ♦ లజ్జలేదు
తుదకు ద్రవ్యాతురునకు బంధుండులేఁడు.

క. మద్యము పలలము ఝషములు
హృద్యంబగు యువతిగోష్ఠి ♦ హెచ్చగు ముద్రల్
సద్యః ప్రీతికరంబని
ఆద్యంతమునందుఁ గాళి ♦ నర్చింతు రొగిన్.

వ. ఇట్లా వామాచార పరాయణులు కృత్రిమంబైన కులాల తంత్రగ్రంథంబునే శ్రుతిప్రమాణంబుగా నమ్మి స్వేచ్ఛాపరాయణులై పాపకార్యంబులం జేయుచు సాధుమానవుల బాధింపుచు మఱచి విహరించు తరుణులఁ జెఱలఁబెట్టుచుఁ బరధనంబు లపహరించుచు బూతులగు పద్యంబు లల్లిపెట్టుకొని యవియే మహామంత్రంబులుగాఁ బారాయణంబులు సేయుచు నిర్భయంబుగ నరణ్యంబుల విహరించుటంజేసి యీనాఁడు దుర్గాబలి యోగ్యంబైన దినంబగుటచే నరబలి నన్వేషించు నా శాక్తేయులకు, నిర్భాగ్యులకు నిక్షేపంబు దొరకునట్లు నా విప్రోత్తముండు గనంబడుటయు నతని నిట్టట్టు పోనీక పట్టి బంధించుకొనిపోయి కాళికాలయంబున నున్న నొక్క రహస్యస్థలంబున బంధనములతోడనే దాఁచియుంచి.

సీ. వరకవాటంబులు ♦ దెఱచి దీపంబులు
పెద్దగా వెలిగించి ♦ పేరటాండ్రఁ
బిలువంగఁ బంపించి ♦ జలకుంభములు సహ
స్రంబు దెప్పించి స్నానంబు నతనిఁ
జేయింపుఁ డని యాజ్ఞఁ ♦ జేసి తచ్ఛాక్తేయ
జనకుటుంబంబుల ♦ సత్వరముగ
రావించి మఱికొన్ని ♦ రసవస్తువులు మద్య
కుంభముల్ ఋషభములు ♦ కుక్కుటములు

గీ. మొదలుగా నన్ని దెప్పించి ♦ భూతబలులఁ
జేయఁదగు కులాచార్యులఁ ♦ జేరఁబిలిచి
తెరలుగట్టించు కడు భయం♦కరముగాఁగ
దేవికిని నలంకారంబు ♦ దీర్చియంత.

గీ. తత్పురోహితుల్ రక్త గం♦ధముల నొసలఁ
దీర్చి కుంకుమ భూ్రతటిఁ♦ జేర్చి పట్టు
నేల్వలొప్పగా ధరియించి ♦ చెలఁగి యర్థ
రాత్రిమాటను దెలిసి ప♦రాక్రమించి.

ఉ. మంత్రము లుచ్చరించుచు న•మందగతిం జరియించుచున్ మహా
యంత్రములన్ని దీర్చి గుడి ♦ నంతయుఁ జిత్రపు రంగులుంచి యా
మంత్రణ చేసి వృద్ధులను ♦ మాలికలన్ వడిఁ ద్రిప్పివైచుచున్
జంత్రములం బ్రధానమగు • శక్తుల భుక్తికిఁ బిల్చుచుండఁగన్.

గీ. కొన్ని మృగముల వధియించి ♦ చిన్న చిన్న
శక్తులకు నెల్ల బలియిచ్చి ♦ శాంతిఁ జేసి
మూలశక్తికి బలి వేయు ♦ వేళయయ్యె
ననుచుఁ దద్దేశికులు దెల్పఁ • దరుణులపుడు.

సీ. వివశుఁడై పడియున్న ♦ విప్రోత్తముని మెల్ల
మెల్లగా నిద్దుర ♦ మేలుకొలిపి
భయమేలనయ్య! మా ♦ భద్రకాళికి నేఁడు
నీపైని దయగల్గె ♦ నిఖిలశుభము
లందబోయెదు నీవు ♦ ముందు నీవల్ల మా
కఖిల భాగ్యంబులు ♦ నందవచ్చుఁ
గాళికాపూజకు • వేళయయ్యెను లెమ్ము
నవ వసంతోదక•స్నాన మిపుడు

గీ. నీకుఁ జేయింపవచ్చితి ♦ మోక్షపాత్ర
వేగ రావయ్య యని కడు • వినయమెసఁగఁ
బలుకు చందఱు నిలువంగఁ•బట్టి యతనిఁ
బాటపాడుచుఁ దలయంటి ♦ పసుపుఁ జల్లి.

గీ. నలుగుబెట్టి వసంతంబు • జలము నించి
కుంభమొక్కొక్కటిగ వేయి ♦ గ్రుమ్మరించి
తలను దడియార్చి పసుపు వ♦స్త్రములుజుట్టి
పొసఁగు సిందూరమునఁ బెద్ద • బొట్టుపెట్టి.

ఉ. కాటుకదీర్చి కన్నులకుఁ ♦ గల్వలదండ గళంబునందునన్
వాటముగా నమర్చి పయి♦వస్త్రము నంసమునందు నుంచి వా

క్పాటవమొప్ప బూతులగు ♦ పాటలపాడుచుఁ గాళిముందటం
దీటుగనున్న పీఠమునఁ ♦ దెచ్చి పరుండఁగబెట్ట నాతఁడున్.

ఉ. ఆకలిచేతడస్సియు భ ♦ యాకులుఁడై త్రుటిమీఁదఁ బ్రాణముం
బోకడ కాత్మగుంది తన ♦ బుద్ధివిహీనత కాత్మగుందుచున్
నా కిఁక నేల ప్రాణమని ♦ నాశమె గోరుచు లేచుశక్తియున్
లేక పరుండి నోటఁ దడి ♦ లేకను మూఁగవితాన నుండఁగన్.

గీ. వామమార్గాంగనలు దన్నుఁ ♦ బట్టి చేయు
కార్యములకాత్మసంకట ♦ క్రమముదోఁచి
చేయునదిలేక పడియుండె ♦ సిద్ధమెట్లు
లైన మరణంబునాకుఁ ద ♦ థ్యముగ ననుచు.

గీ. వినుత వైరాగ్యయుక్తుఁడై ♦ తనువుదొరుగ
సుస్థిరుండయి యాభూమి ♦ సురుఁడు పోలిచెఁ
గాని ఛాగమట్టుల ఖలుల్ ♦ కాళియెదుట
గొంతుగోయుట కాత్మలో ♦ గుములుచుండు.

వ. ఈప్రకారంబున శక్తిపూజా ధురంధరులైన వామాచారులతిజాగరూకులై తమయిష్టదేవతయగు కాళికి షోడశోపచారపూజనంబులు గావించి మద్యాదిపదార్థంబుల మున్నుం దవసరనైవేద్యంబులు గావించి వేనవేలు కర్పూరనీరాజనంబులు నివాళించి కర్ణకఠోరంబులగు శంఖకాహళాదివాద్యంబు లొక్కసారి దిక్కులు పిక్కటిల్లఁ బూరించి మహాబలి నివేదనంబుకై యావిప్రోత్తము వధియింపఁ గ్రూరభయంకర విషాహితుల్యంబగు నొక్కతీక్ష్ణఖడ్గంబు చేతంబూని పింగలాక్షుండైన యొక్కమధ్యవయస్కుండు తనవామకరంబున నాభూసురునిం దెమలించి ద్విజోత్తమా! లెమ్ము నేఁడు నీజన్మ సార్థకంబయ్యెఁ గృతార్థుండవైతి వెయ్యది నీకు గాంక్షితంబో యది పరజన్మంబున సిద్ధించునట్లు మహాకాళిని వేఁడుకొమ్మనిన నతండుందనచావు నిక్కంబని యెఱిఁగి నిశ్చేష్టుఁడై తనమనంబున.

సీ. బ్రహ్మచర్యవ్రత • ప్రారంభమున నిగ
మాది మంత్రముల గా•యత్రిఁదాల్చి
పాణిగ్రహణవేళఁ • బత్నిచేఁబూజింపఁ
బడి గంధమాల్య సం•పదవహించి
ముద్దాడువేళలఁ • బుత్రరత్నము లిచ్చు
మృదుకరాలింగన • శ్రీవహించి
సభలలోఁ బండితుల్ • సత్కరించెడు వేళ
వజ్రహారములు సే•ల్వాలుధరించి
గీ. దేవ గాంధారమున సామ•మావహించి
సురల నెల్లను మఖముల • సౌమ్యసిల్లఁ
జేయు కంఠమా! యీకత్తి•చేతఁ దెగియుఁ
బుడమిఁబడియెదె? పాటల•పుష్పమటుల.

కం. అని తనమనమున నెద్దియొ
ఘనముగ జపియింపఁబోయి • కంపితగళుఁడై
తనువువడంకఁగ పెఱభయ
మునఁ బలుకకయుండెఁ జిత్ర•పుం బొమ్మగతిఁ.

వ. అంత.

గీ. కఠినచిత్తుఁడౌ శాక్తేయ • ఖలుఁడు విప్ర
కంఠమందునఁ దనదృష్టి • క్రమ్మఁజేసి
కత్తి జళిపించి ముడివైచి • కన్నుబొమలు
గల్గు మీసంబు లొరదిద్ది • కాళిఁజూచి.

గీ. తల్లి! నరమాంసభక్షిణీ! • ధర్మమూర్తి!
భాగ్యదాయిని! యీనర•పశువుకంఠ
రక్తమునుబీల్చి వాంఛితా•ర్థమ్ము లొసఁగు
మనుచు ఖడ్గంబుపైకెత్తు • నంతలోన.

చ. తలుపుగుభాలునం బగులఁ, దన్ని మహోగ్రగతింగుడిమాఱుశబ్దముల్
బలుకఁగ వద్దువద్దనుచుఁ, బాపులువీరలు బ్రాహ్మణోత్తముల్
లలిత కృశాంగునిం దపసి, లబ్ధమదీయ వరప్రసాదునిన్
బలినిఁ గొనంగ మీకుఁ గడుఁ భావ్యమె? తీఱునె తృప్తిదీనితోన్.

గీ. నన్ను శంకరు నెవ్వరు, నమ్మియుండ్రు
వారి నెన్నఁడు బలికిఁ దేవలదటంచుఁ
జెప్పనే మున్ను నావంపు, సేయ రేల?
వచ్చె నపచార బాధ మీ వంశమునకు.

వ. అని యొకయోగిని నేను కాళికాంబనని వారినిం బదరుచు గుడిలోని గర్భాలయంబుం బ్రవేశించినఁ దచ్ఛాక్తేయకుల పురోహితుఁడు కాళిప్రత్యక్షమై వచ్చెననుచు భయకంపితుఁడై తనచేతి కరవాలం బచ్చటఁబారవైచి నాపాదంబులంబడి "దేవి రక్షమాం! రక్షమాం!" అనుచు సాష్టాంగ దండప్రణామంబు చేయ "నోరిమూఢ! ఛండాల! నీపాపకరంబులగు కరంబుల నాపాదంబుల ముట్టితివిగా" యని పటపట పండ్లుగొఱుకుచు బొమముడివైచి తత్కరవాలం బెత్తుకొని నీచేయుపాపమునకు ఫలంబిదెపో యని యొక్కవ్రేటున నాతనికంఠంబు బుడమింబడవైచి యార్చినిలిచిన.

ఉ. కాళికిఁ గోప మీగతినిఁ, గల్గఁగజేసెఁ బురోహితుండు దు
శ్శీలుఁడు వీఁడటంచుఁ దమ చేడియలంగొని మెల్లమెల్లగం
గాలికి బుద్ధిచెప్పకొని, కాననసీమల కేగి రందఱున్
గాళిమహాప్రసాదమునఁ, గంఠము లుండినఁ జాలునం చొగిన్.

చ. మును పొకసారి మానితల, బోనముపెట్టఁగఁబోవ నాఁడు నీ
జననియె దర్శనంబొసఁగి, సాధులనుం బలి నాకుఁబెట్ట వ
ద్దనుచుఁ దదీయ దేశికుని, నాగ్రహపూరితయయ్యు ఖడ్గ ధా
రనుగొనెఁ బ్రాణముల్ మరియు, మ్రందఁగఁజేసెను నేఁడు నొక్కనిన్.

గీ. కాళియిచ్చెడి భాగ్యమ్మె ♦ చాలుమనకుఁ
బ్రాణముండిన నుప్పమ్మి ♦ బ్రదుకలేమె ?
యనుచుఁ దమ మొల్లె మాటలు ♦ గొణఁగుచువారు
వెడలిపోయిరి కాళిక♦గుడిని విడిచి.

క. వారంద రటులఁబోయినఁ
గారుణ్యముతోడ నా పె ♦ కష్టనిర్జరునిం
జేర యనేకంబుగ నుప
చారంబుల సలిపి తేర్చి ♦ చయ్యనఁబలికెన్.

గీ. గుడినిఁ దడవుండవలవదె♦య్యెడకునైనఁ
జేరుదమురమ్ము గండంబు ♦ బారిపోయె
నింక నూరేండ్లు దీర్ఘాయు ♦ వెనయు నీక
టంచు నాయయ్యచేతి స్వ♦హస్తమూని.

వ. ఇట్లు యోగినిచేయి నాధారంబుగాఁ జేసికొని యా భూసురోత్తముండు.

గీ. అంధునివిధాన యోగిని ♦ హస్తమూని
యల్లనల్లన తొట్రిల ♦ నడుగులిడుచు
దాటి గుడివాఁకిలిని నొక్క ♦ చోటజేర
పారువేఁట గొర్రియ మందఁ♦జేరినట్లు.

క. హరుఁడో హరియో కాళియొ
తరుణియొ పురుషుండొ లేక ♦ తపసియొ తనకున్
స్థిరజన్మము దయసేసిన
కరుణాకరుఁ డెవ్వఁ డనుచుఁ ♦ గనుఁగొనలేమిన్.

వ. అట్లాతం డారేయి యా యోగిని వెంటనంటిచని యొక రహస్య ప్రదేశంబున, గిరాతుని వలలంబడి పాఱివచ్చిన విహంగంబు చందంబుననుండి వేగిన నాయోగిని మేలుకొలుప లేచి కాల్యంబులు

దీర్చి యోగినీ ప్రసాదిత మధురఫలనీరంబుల గ్రహించి భక్షించి విగతభయశ్రముండై యొక్కవటమహీజచ్ఛాయాతలంబున నాయిరువురు విశ్రమించియున్నయెడ నా భూసురుం డాయోగిని కిట్లనియె.

చ. మహితతపఃప్రభావమున ♦ మాదృశతైర్థిక ప్రాణరక్షణం
బహరహముం రచించి దురి♦తావహులై తగు వామమార్గ ధూ
ర్వహులను జంపి లోకమును ♦ బాలనఁజేయు భవాని వంచు నీ
మహిమ లెఱింగి యే నొకటి ♦ మానవబుద్ధి వచింతు నీశ్వరీ!

చ. ముని ననుఁ జీఁకటిం విడిచి♦పోవుట వార లెఱింగి రెట్లు, నం
గొనిచని కాళిముందటను ♦ గుత్తుకఁ గోసెడువార్త యెట్లు దోఁ
చెను మరి నీకు, మృత్యువును ♦ జెందఁగనీక ననుగ్రహించి యీ
వని కిటు దెచ్చు టేల? ఖల♦వామపథార్యునిఁ జంపి తేటికిన్.

మ. వరమాణిక్య పురాధివాసుఁడ జగ♦త్ప్రఖ్యాతపాండిత్య సం
భరుఁడన్ విప్రుఁడ వజ్రనాభుఁ డనునా♦మంబొప్పువాఁడం దగన్
గురుమానీంద్ర కృపా ప్రదత్త మహితాం♦గుళ్య ప్రభావంబు సు
స్థిరమై యొప్పఁగ వచ్చి తీశిఖరికిం ♦ దీర్థాళి సేవింపఁగన్.

మ. ఒకనాఁ డొక్కసరోవరంబునను బ్ర♦త్యూషంబునం గ్రుంకి నే
సకలంబుల్ మఱపొంది యుంగరము వ♦స్త్రశ్రేణిఁ గోల్పోయి హృ
ద్వికలత్వాన వనంబునం దిరుగ నా♦విశ్వేశుఁడే సిద్ధుఁడై
యకలంకస్థితి వచ్చి నన్నుఁగొని ది♦వ్యక్షేత్రముల్ చూపుచున్.

వ. సాయంబగుటయు నింక గిరి కాననంబులఁ జరించుట పాఁడిగా దని యంగుళీయక వియోగ దుఃఖితుండనైన నన్నాశ్వాసించుచు క్షుత్పిపాసావశుండనై నిద్రఁజెందియున్నతఱి నతం డంతర్ధానంబు నొందె. కొంతవడికి మేలుకని యాతని వెదకి కానక దుఃఖించుచుండ నన్నీ శాక్తేయులు బంధించి బలిపశువుగా విశసనంబుఁ జేయఁబోవు నంత నీవు ప్రత్యక్షమై నాప్రాణంబులు రక్షించితివి. నే నతని నెంతనిర్బంధించి ప్రశ్నించినను వాని నివాసంబు నామంబు నొక్కమునిశాపంబునఁ జెప్ప

గూడ దని వచించెఁ దల్లి! నీ వెఱింగియున్నచోఁ దెలుపఁదగునేని నామహామహుని దివ్యచరిత్రంబును దావకీన పుణ్యకథావిశేషం బును సవిస్తరంబుగా నా కెఱింగించి కృతార్థుం జేయు మని మ్రొక్కి వేఁడుకొనిన నాయోగిని చిఱునవ్వు నవ్వి యి ట్లనియె.

క. భూసురవర ! మునివేషము
వేసిన యీ నీచుఁ డగునె ♦ విశ్వేశుఁడుగా ?
దోస మటం చన కెందఱ
నో సాధులఁ జంపె వీఁడు ♦ నో రదిమి వెసన్.

సీ. వసుధామరేంద్ర ! యీ•వామమార్గులకు నీ
రక్కసుం డేవేళ ♦ రాయబారి
మునివేషమును వేసి♦కొని తెరువరులనెల్ల
వంచించుకొని వచ్చి ♦ వారి కిచ్చు
విధివశంబున నీవు • వీనికిఁ గన్పింప
నిఖిలతీర్థంబుల ♦ నీకుఁ జూపి
మంచిమాటల గుడి♦పంచకుఁ గొని తెచ్చి
నిద్ర నొందియు నిన్ను ♦ నిమురఁ బుచ్చి

గీ॥ ఖలుల నచ్చోటికిం దెచ్చి • కట్టి విడుఁడు
వీఁడె బలిపశు వని చెప్పి ♦ వెడలిపోయెఁ
దలకు నొకమాడచొప్పున ♦ నిలుచు నరుల
వీని శివుఁ డని నమ్మితే • వెఱ్ఱివాఁడ !

గీ. బ్రహ్మబంధుండు దుష్టుండు ♦ పాపకారి
వీఁడు మున్నొక్క మానిని • వెదకి తెచ్చి
వామమార్గుల కిచ్చిన • వార లతని
నిన్నుఁబలె గొంతుఁ గోయంగ ♦ నున్నవేళ.

క॥ కాళిక నిదె నే వచ్చితిఁ
దాళుఁడు చంపకుఁ డటంచుఁ ♦ దద్దేశికునిం

గూలిచి సిద్ధుని ప్రాణము
లీలం బ్రతికించి తిదియు ♦ లెక్కయె నాకున్.

వ. ఇవ్విధంబున నాచేత ననేకశాక్తేయులు పంచత్వమొందిరి. సాధుపుంగవులు బ్రదికింపఁబడిరి. ఇఁక నా చరిత్రంబు వినుము.

సీ. ధరణిభూషణమనఁ ♦ దామ్రపర్ణీతీర
ముననధర్మపుర మను ♦ పురమునందు
వామదేవుండను ♦ వసుమతీసురునకు
నర్ధాంగియై యొక్క ♦ యబల గలదు
సంతానహీనయై ♦ సర్వవ్రతంబుల
సలిపి నిత్యోపవా♦సవ్రతంబు
నియతిమైఁ జేసియు ♦ వయసున సుతహీన
యాట కాత్మను గుంది ♦ యాత్మనాథు

గీ. సిరిని గృహమును జుట్టాలఁ ♦ జెలుల విడిచి
ప్రణుత వైరాగ్యయుక్తయై ♦ పరమసాధ్వి
యొక్క గురువర్యుఁ బ్రార్థించి ♦ మ్రొక్కి యతని
వలన మంత్రోపదేశంబుఁ ♦ బడసి యంత.

గీ. సకలవిద్యలు నేర్చిన ♦ సాధ్వియాట
గురుని యాజ్ఞానుసారంబు ♦ హరుని నమ్మి
నిరశనంబున రేఁబవల్ ♦ నియతితోడఁ
దపము చేయుచు నుండ స♦త్కృప సెలంగ.

క. హరుఁ డొక్క తపసిరూపము
బరగంగా వచ్చి మెచ్చి ♦ భక్తివిధంబున్
వర మేమికోరి సేసెదు
తరుణీ! యిదె యిత్తు నీకుఁ ♦ దగ వేఁడు మనన్.

క॥ సామాన్య తపసియని తన
కేమాత్రం బతని వరము ♦ లిచ్చుగొలుపమిఁ

గామితఫలదుఁడు శివుఁడే
ప్రేమంబున వచ్చునపుడు • వేఁడుదు ననుచున్.

సీ. మునివర్య! మిముబోటి ♦ ఘనులసందర్శనం
బెన్నఁడు వృథ గాద♦టన్న పలుకు
విందునే మనుస్సైన ♦ విశ్వేశ్వరుఁడు మది
మెచ్చి వచ్చియు వరం • బిచ్చుదాఁక
నితరుల వేఁడ నా♦మతి యొప్ప దటుగానఁ
దపము సంపూర్ణతఁ ♦ దాల్చువఱకు
గ్రూర మృగాసుర ♦ చోర శాక్తేయాహి
రోగ భయంబులు ♦ మూఁగకుండ

గీ. మత్తపోవన సామీప్య ♦ మార్గమందుఁ
బురుషుఁ డెవ్వఁడు దిరుగునో • మఱచి తనదు
మంత్రమహిమలు జడుభంగి ♦ మసలునటుల
నిస్తుల వర మిమ్మనఁగఁ ద♦థాస్తటంచు.

క. సతి నీ వెయ్యేది మదిఁ గో
రితివో యొక శైవుఁడగు ధ♦రిత్రీసురుచేఁ
గృత కృత్యురాలవై యది
పతియుక్తము గొందు వెట్టి ♦ భయమునను లేకన్.

క. అని చెప్పి యామునీంద్రుఁడు
చనియెం దన త్రోవ సాధ్వి ♦ జటిని వృత్తిన్
గొని నిష్ఠనుండఁ దద్వన
ఘనసరసిని నీవు మునిఁగి • క్రమ్మఱు వేళన్.

చ. మఱచి రసాంగుళీయకము ♦ మార్గము గానక కాననంబునం
దిరుగుచునుంటి వీవు కడు ♦ దిమ్మరివై యటమీఁద స్నానముం
జరుపఁగ యోగినీమణి ప్రసన్న మతింజని యాకొలంకునం
దిరిగెడు వేళ నుంగరము ♦ దీర్ఘరుచిం గనుపట్టె నామెకున్.

వ. మఱియుఁ గృష్ణాజినంబును జపమాలయుఁ గనంబడినఁ గై
కొని దయార్ద్రహృదయ గావునఁ బరిచారికనగు నన్నుఁ బిలిచి 'సుశీలా! వైదేశికుండగు భూసురుం డీకొలంకున స్నానమాడి వీనినిఁ బోఁగొట్టుకొని యున్మత్తుఁడై యడవిఁ దిరుగుచుండనోవు. నేఁడు దుర్గాబలి యోగ్యంబయిన యష్టమీభృగువారం బగుట శాక్తేయు లాతనిఁ బట్టుకొందురు. కాన సత్వరమ చని యాతని వెదకి రక్షింపవలయు' నని యానతీయ నమ్మహాదేవియాజ్ఞ నౌదలధరించి యడవుల వెదకి తుద కిటకువచ్చి నిన్నుఁగనితిని. నావచ్చుట కొక్కింత యాలస్యంబయిన నెట్టికీడు కలుగునో గదా! నేను గృతకృత్యురాలనైతి. ఆమహాదేవి నామంబు సౌభాగ్యలత. నాపేరు సుశీల. నే నాదేవికిఁ బరిచర్య గావించుచు నప్రమత్తనై యుందు నని యావద్వృత్తాంతంబు నుడివి యూరకుండిన, విప్రుండు సంతోషించి శీతశైలవాసులైన మీబోంట్ల మహత్వంబులు తెలియఁ బురవాసులైన మాబోటి సాంసారికులకు సాధ్యంబగునే? తల్లి యని మ్రొక్కి ప్రార్థించి యిట్లనియె.

గీ. ఇందు నిజమేది యనృతంబు ♦ నేది యనుచు
నమ్మకొందును దైవంబు ♦ నన్ను నేమి
చేయఁదలఁచెనొ యారీతిఁ ♦ జేయుఁగాక
తెలియ కేమని మిమ్ములఁ ♦ బలుకఁగలను?

కం. ఆ దేవి యెచట నున్నది
మోదముతోఁ జూపఁగలవె? ♦ మ్రొక్కెద, నన్నా
బోఁదగదు దీక్షఁబూనె మ
హాదేవునిఁగూర్చి యాపె ♦ యగు నెలపైగా.

కం. అందాఁక నుండు మిచ్చట
సందర్భం బెఱిఁగి నీకు ♦ సందర్శనముం
బొందుగఁ గలిగించి ప్రభా
బృందంబగు నుంగరంబు ♦ నిప్పింతుఁ దగన్.

కం. ఆరాయబారి చెల్లెలు
కూర్రాత్మ కరాళ యనెడు ♦ గోతి మరల ని
న్వ్వారినొ తెచ్చియు వామా
చారుల కీమా రొసంగి ♦ చన నటకంటే?

ఉ. పల్లెలఁ బట్టణంబులను ♦ బాటలఁ దోఁటలఁ దుర్గసీమలం
బెల్లగు కాననంబుల నభీతమతిం జరియించి మాయలం
గొల్లఁగఁ బల్కి యెవ్వరినొ ♦ కుత్తుకఁ గోయఁగ దెచ్చియిచ్చు నీ
వెల్లెడఁబోక యుండు మిట ♦ కెవ్వరురారు భవానిసత్కృపన్.

గీ. మున్ను నేఁబోయి బ్రిదికించి ♦ యున్నమాని
నిచ్చటనె యుందునని చెప్పి ♦ యెందొచనియె
నాదుపలుకులు నిజమంచు ♦ నమ్మలేక
తెలియరాదయ్యె నాతని ♦ తెఱఁగొకింత.

వ. అని పలికిన సుశీల కాపరదేశి యిట్లనియె.

గీ. తల్లి! నీయాజ్ఞమీఱ నేఁ ♦ దరలి చనఁగ
వెత్తునే? భవత్సాంగత్య ♦ విభుతకన్నఁ
గలదె వేరొండు తెరువు? నిక్కంబు నీవు
పొమ్మనినఁ బోదు నీదు పాదమ్ములాన.

ఉ. మీ శలవైనదాఁ కిట న♦మేయ భవత్కథ లాలకించు టే
యాశయ! మింక నాకని త♦దాశ్రమమందు వసించె గేహి నా
కేశములెల్ల నీద్విజకు♦లీనుని సేవ నశించునంచు నా
దేశికురాలు నమ్ముకొని ♦ తెల్పుకథల్ వినుచుండె నాతఁడున్.

గీ. విమలచరిత సుశీల యా♦శ్రమమునందుఁ
గుశలియై వజ్రనాభుండు ♦ కొన్నినాళ్లు
నిలచెనని రొమహర్షణి ♦ లలిత మధుర
వచన రచనా చమత్కృతిఁ ♦ బలికినంత.

## ఆశ్వాసాంతము.

చ. వర సుకుమారగాత్ర! యన♦వద్య కృపాగుణపాత్ర! గుజ్జుభూ
వరశుభగోత్ర! వైరి జన♦బంధుర గర్వలతాలవిత్ర! సుం
దర గజగామినీహృదయ ♦ నవ్యరమా వరపుత్ర! నూత్నమం
దిరతల చిత్రిక ప్రిచయ ♦ నిత్యవిలోకన నేత్ర! సత్కృతీ!

కం. సంజీవరాయ ఘనధీ
రంజిత! హృత్కంజ సుంద♦ర స్మితవదనా
మంజుల సంస్తవ సువచః
పుంజ సుమార్చిత! వినోద ♦ మోహన కృష్ణా!

ఉ. సంతత చంద్రచూడ పద♦సారసయుగ్మ మరంద పాన వి
శ్రాంత మధువ్రతాయిత! ప్రి♦శాంత రసప్రబలీకృతామల
స్వాంత దయావిశిష్ట! సుగు♦ణాకర! పండితమాన్య! ధన్య! హా
నంత కృపాను జన్మమణి! ♦ నవ్యయశోఘృణి! మానవాగ్రణీ!

మాలినీ.

సుపరిచిత కవీంద్రా! ♦ సూనృతాధిక్యమంద్రా!
వ్యపగతభవతంద్రా! ♦ పాకనాడ్వంశచంద్రా!
జపితహాసదుపేంద్రా! ♦ సర్వసౌభాగ్యసాంద్రా!
నృపహితగుణసాంద్రా! ♦ కృష్ణమాహృద్రతీంద్రా!

గద్య.

ఇది శ్రీ మదనుములాన్వయసింధుజైవాతృక భారద్వాజగోత్ర పవిత్ర
వీరరాఘవ సుధీమణిపుత్ర నిఖిలకవిమిత్ర శ్రీరంగమాంబా
గర్భశుక్తిముక్తాఫలాయమాన విబుధవిధేయ సుబ్ర
హ్మణ్య నామధేయకవి ప్రణీతంబైన వజ్ర
నాభ చరిత్రంబునందు ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.





# వజ్రనాభ చరిత్రము.

## తృతీయాశ్వాసము.



కర గుణ మహానందాం
బాకోమల మృదులపాణి ♦ పల్లవయుగ శో
భాకర మంజుపదాంబుజ
శ్రీకరుణాసాంద్ర! రామ♦కృష్ణమహీంద్రా!

గీ. అవధరింపు మనంతరం ♦ బఖిలశాస్త్ర
కథనవిఖ్యాతుసూతునిఁ ♦ గాంచి యచటి
శౌనకాది మునీశ్వరుల్ ♦ సంతసమునఁ
బలికి రెంతయు భక్తి సం♦భరితులగుచు.

గీ. మునికులాగ్రణి వజ్రనా♦భుండు శీత
శైలమందుండ సిద్ధుఁడే ♦ లీల మెలఁగు
చుండె మాణిక్యపురమందు ♦ నిందుపేర్మి
హేమవతి తత్తనూజాతు ♦ లేమియైరి?

కం. పల్లెలఁ బట్టణములఁ దా
నిల్లిల్లు కరాళిదిరిగి ♦ యెవ్వారిఁగొని తా
నల్లరి వామాచారుల
యుల్లంబులు పల్లవింప ♦ నౌనఁగెఁ బలికెఁ.

కం. వినుచుండ నంతకంతకు
మన మానందాబ్ధియందు ♦ మగ్నంబగుచుం
దనివోకున్నది తత్కథ
వినిపింపవె యింక సూత! ♦ వినయోపేతా!

వ. అనిన సకలపురాణ కథాకథన దక్షుండైన సూతుండు వారల కిట్లనియె.

సీ. వినుఁడు సంయములార ♦ విభవసాంద్రంబైన
శీతశైలాటవీ ♦ సీమనుండి
దక్షిణాపథమందుఁ ♦ దనరారి ప్రవహించి
సకలజీవ మహాఘ♦సంచయములఁ
బాఱఁదోలుచుఁ బుణ్య♦ఫలములు గొల్లఁగా
వెదజల్లుచును శుభ♦ప్రదమునగుచు
వరభగీరథపథ♦వర్తియై లవణాబ్ధి
సంతోషములఁ బెంపఁ♦జాలు దివ్య

గీ. జాహ్నవీతటి ఘనతరు♦చ్ఛాయవిరుల
వెలయు త్రోవను మధ్యాహ్న♦వేళ నొక్క
యబల కాషాయధారిణి♦యై నిజేచ్ఛ
నరుగుచుండె సాహాయ్య మె♦వ్వరినిఁగొనక.

గీ. ఎవనిఁగూరిచి యెచ్చోటి ♦ కేమిచేయఁ
బోవుచుండెనో దనకార్య♦బుద్ధి యితరు
లెరుఁగకుండంగ నొకకొంత ♦ యేగి పిదప
జూడఁజూడ నదృశ్యయై ♦ జుణిగె నతివ.

గీ. అంత నక్కడ వజ్రనా♦భాఖ్యు నింట
మును వసించిన వామదే♦వునికి నిత్య
పూజనలు భక్తియుక్తులై ♦ భూమిసురుని
దేవి తనయులు శిష్యులు ♦ దీర్చుచుండ్రి.

క౦. హేమావతి తత్తనయులు
ప్రేమంబునఁ జేయునట్టి ♦ విధు లవి తనకుక్
క్షేమంబులై చెలంగినఁ
దా మానసమందుఁ దృప్తి ♦ దాల్పఁ డతఁ డొగిక్.

సీ. నిరతంబు హాటకేశ్వరలింగ పూజనా
దికములు నిష్ఠతోఁ ♦ దీర్చుచున్న
హెచ్చైనభక్తితో ♦ హేమావతి సతంబు
నన్నపానంబుల ♦ నరయుచున్నఁ
దగ సోమభాస్కరుల్ ♦ తలఁచినంత నెవచ్చి
యొప్పగాఁ బాదంబు ♦ లొప్పుచున్న
శిష్యులు పౌరులు ♦ చెలఁగి నయ్యో వేళ
సాష్టాంగమిడి నుతుల్ ♦ సలుపుచున్న
గీ. నవసి యడవుల నివసించి ♦ శివుని కరుణఁ
బడయు నుంగరమది తన్ను ♦ విడిచి విప్ర
నెపముచేఁ బోవుటకుఁ దన ♦ చపలబుద్ధి
కారణం బని యే వేళఁ ♦ గనలుచుండు

వ. ఇట్లు స్వకీయ తపోవిశేషంబున నార్జించిన రసాంగుళీయకంబు గొని చని వజ్రనాభుండు తీర్థయాత్రలు సేవించి యరుగుదెంచమిఁ దనయుంగరంబు బోవుట నిక్కం బని తనమనంబున నిట్లని యాసిద్ధపుంగవుడు తలంచె.

సీ: కందమూలంబులఁ ♦ గాలంబు గడపుచు
వనినుండకయ యిఁట ♦ వచ్చు టేల ?
వచ్చితిఁబో నాఁడె ♦ వచ్చినట్టుల బోక
తీర్థగాథలు వినఁ ♦ దెలుపు టేల ?
తెలిపితిఁబో విప్ర! ♦ తీర్థముల్ తిరిగిర
మ్మనుచు నుంగరము న♦ర్పించు టేల?

ఇచ్చితిఁ బో నేను ♦ వచ్చెద వని విప్రు
వెంటనంటక నింటి ♦ విడియు టేల?

గీ. విడిసి యీరీతి దుఃఖించి ♦ పడయఁగలనె
మరల నాయుంగరం బింక ♦ మాట లేల?
నేనె చెరుచుకొంటిని మహీ♦నిర్జరేంద్రుఁ
డేమిచేయును మత్పూర్వ♦కృతముగాక.

సీ. అతిజవంబునఁ దీర్థ♦యాత్రలఁ దిరుగుచు
ఘనపుణ్యమును మాను♦కొనుట యొకటి
వర తపోబలముచే ♦ హరుని మెప్పించి తె
చ్చినసొమ్ము పోఁగొట్టు♦కొనుట యొకటి
పర దేశవాసియై ♦ పతికయి దుఃఖించు
సుదతి బాష్పముఖంబు ♦ చూచు టొకటి
అతిథియై మాయయ్య ♦ నడవికిఁ బంపించె
నని తత్తనయు లేడ్వఁ ♦ గనుట యొకటి

గీ. బధిర భిక్షుక పంగ్వంధ ♦ పటలి సతము
తమ్ముఁబోషించు గృహపతి ♦ తద్దలేమి
మొగముపైఁ దిట్టి పోవంగఁ ♦ బొగులు టొకటి
కటకటా! యిన్నిదోషముల్ ♦ గలిగె నాకు.

గీ. ఎన్నివిధముల విలపింప ♦ నేమిఫలము?
వామమార్గులచేత నా♦భూమిసురుఁడు
పడియె నిజ ముంగరం బేడ ♦ నిడెనో యతఁడు
నాకు లభియింప దింక నె♦న్నాళ్ళ కదియు.

కం. గృహపతి శాక్తేయులచే
నిహతుండౌ మాట వినిన ♦ నిక్కపు సతియౌ
గృహిణి భరించునె ప్రాణము
లహహా తత్సుతులు దుఃఖ♦హతి బ్రదుకుదురే?

కం. అని మునివగచుచుఁ దన మన
ముననెద్దియుఁ దోఁచకుండఁ ♦ బోవుట కచ్చో
టను నిలుచుటకుఁ ధృతిలే
కను మరికొన్నాళ్ళు నిలిచెఁ ♦ గష్టముతోడన్.

గీ. అంతకంతకుఁ దనమనో♦హారుని కుశల
వార్త లించుక తనచెవిఁ♦బడిన కతనఁ
గార్శ్యమును బొంది లలితాంగి ♦ కఠిన పవన
చలిత మృదుమాధవీలత ♦ సాటి యయ్యె.

సీ. కడువేడ్క సౌభాగ్య ♦ మొడగూర్చు తనప్రాణ
విభుఁ డేడి ? యని సాధ్వి ♦ వెతలనొంద
నన్నివేళలఁ బ్రేమ ♦ నరయుచు శాసించు
తండ్రి లేఁడని సుతుల్ ♦ తలఁకుచుండ
సకల విద్యలు నేర్చి ♦ సంతరించెడు గురుం
డింకెవ్వ రని శిష్యు ♦ లెలుగులెత్త
నిరతంబు పక్వాన్న ♦ నిచయంబు పెట్టించు
గృహి పోయె ననుచు ♦ నాశ్రితులు కుంద

గీ. ఉత్తముండగు సుహృదుఁ డీ ♦ యూరువిడిచి
యేగె నక్కటా యని హితుల్ ♦ హృదయమందు
కుంద బాంధవుల్ వెందిగు ♦ లొంద విప్ర
కాపురము దుఃఖములకు నా♦కరము నయ్యె.

గీ. రహిని గొన్నాళ్ళు శృంగార ♦ రసము పొంగి
పొరలి యానందవీచికల్ ♦ వరగు విప్ర
నాలయంబున శోక ర♦సాదిదేవ
తా వినోదముల్ నేట నెం♦తయుఁ జెలంగు.

సీ. తోడునీడగఁ దన్ను ♦ వీడని శిష్య సం
ఘంబు తాఁ జన సుఖై♦క్యంబుఁ గోలుకు

యజమాన రక్షణ ♦ వ్యాపారమును మాని
బందెల పాలయ్యెఁ ♦ బశుగణంబు
తమకృత్యములు జూచు ♦ దాత చెంతను లేమి
జీకాకు పడియె దాసీజనంబు
అడుగువారలు లేక ♦ గడుపు దప్పె నటంచు
గుత్తరూకలు రైతు ♦ లెత్తమనిరి

గీ. ఆజ్ఞనిడువారు లేమిని ♦ నదను వేళ
బీజ సంపత్తి కలుగక ♦ బీడులయ్యె
దర్పణాకృతినున్న ♦ కేదారవితతి
నాథు నెడబాసి సాధ్వి చిం♦తను మునుంగ.

గీ. ప్రశ్నలడిగియు శకునముల్ ♦ పారఁ జూచి
విభుఁడు వచ్చెడు గడువులు ♦ వృథలుగాఁగ
విసిఁగి దిగులొంది మునివరు ♦ వేడుకొనియు
మదికి విశ్రాంతి గలుగమి ♦ మగువ కుందు.

గీ. మాటి మాటికిఁ దననాథు ♦ మాటనడుగ
సాధ్వి తనవద్ద కేతెంచు ♦ జాడగనిన
మునికులాగ్రణి తగఁ మౌన♦ముద్ర దాల్చి
యుండు ముఖవస్త్ర మమర జ♦డుండువోలె.

గీ. సాధ్వి కెదఁదోఁచె భయరూప ♦ సంభ్రమములు
వగాని కెంతయు బలమయ్యె ♦ మౌనముద్ర
నిత్యపూజన నైవేద్య ♦ కృత్యమెడలి
పవ్వళించెను హాటకే♦శ్వరవిభుండు.

గీ. నగరవాసుల మదికి నా♦నాఁటికొక్క
వింతయై తోఁచి తమలోన ♦ వీధులందు
గుజగుజలు చెప్పుకొందురు ♦ గుంపులగుచు
బలువిధంబులు నిజము నే♦ర్పఱపలేక.

గీ. జటి ప్రవేశించి యయ్యాను • సాగనంపె
నడవి కని లోకు లోకరీతి • ననుటకాని
వజ్రనాభుని కాతని•పాలి శిష్యున
కెఱుకయగుఁగాక నిక్కమిం • దెవ్వఁ డెఱుఁగు.

వ. ఇవ్విధంబునఁ బురజనులబ్బురపడి 'యమ్మా! యిదియేమి' యని హేమావతి నడుగ నాపరమసాధ్వి తన కేమియుఁ దెలియక దురంతచింతాకులస్వాంతయై త న్నొక్క గడియయైన యెడబాయని నాప్రాణవల్లభుఁ డడవి కరుగ చూచుచుంటిఁగదా, యెంత కఠినచిత్తురాల నని పెక్కువిధంబుల దుఃఖంబునొంది నిద్రాహారంబులు మాని చీమచిటుక్కుమన నెట్టి విషాదవార్త విందునో యని ప్రాణేశ్వరా నిన్నెడబాయని నీచరణసేవకురాలిని విడనాడి యడవినొంటరివై సంచరించుట గృహస్థధర్మంబునకు విరుద్ధంబుగాదే, యింత నిర్దయాస్వభావంబు నీ కెట్లు గలిగెనని పలవించుచుఁ దన్మయత్వంబున నేమియుం దోఁచక సంసారం బెల్ల విసర్జించి విరాగినినై పతిబోయిన త్రోవ బోవుట యుక్తం బని తలంచి నిశ్చయించి మరలఁ దనమనోనాథు నాజ్ఞకు విరుద్ధంబుగ వర్తించి పాపంబునకు గుఱి యగుదుఁగదా యని వెరపొంది కొన్నికొన్ని గృహకృత్యంబులు నెఱవేర్చుకొనుచు నతిథుల బోషింపుచున్నఁ గన్నతండ్రి తమకన్నులకు దూరంబయ్యెఁగదా యని దురపిల్లు కన్నకుమారుల నూరార్చుచు మునివర్యుని సేవలం దప్రమత్తయై చరింపుచు నొక్కయుపాయంబు దలంచుకొని యీకార్యంబుచేఁ దన కాంతుని చెంతఁ జేరఁగలదాన ననుచు నొక్కనాఁడు భృగువారంబున నుషఃకాలంబున లేచి గంగానదియందుఁ గృతస్నానయై సైకతస్థలంబునఁ గొంతసేపు కర్మసాక్షి నారాధించి దన్నదీతీరంబున కనతిదూరంబున విరాజిల్లు దుర్గాలయంబు బ్రవేశించి తనయభీష్టదేవత యగు భువనేశ్వరిని హరిద్రా కుంకుమంబుల సహస్రనామయుక్తంబుగ

బూజించి ప్రదక్షిణంబు లాచరించి భక్తియుక్తయై కరాంబుజంబులు మోడ్చి ఫాలంబునం గీలించి యిట్లని ప్రార్థింపం దొడంగె.

ఉ. దేవి! సురాధినాథనుత♦దివ్యపదాంబుజ! మౌనివర్య సం
భావిత! వేదచోదిత వి॰భావిలసన్నిజరూప నిత్య పు
ణ్యావహ సచ్చరిత్రి! సద॰యాత్మ! మదీయమనోరథంబులన్
శ్రీవిభవంబుతో నొసఁగి ♦ చెంతను జేర్పవె సర్వమంగళా!

ఉ. తల్లి! మదీయనాథుఁ డొక ♦ తాపసి పంపగ యాత్రకేగి తా
నిల్లును జేరఁడయ్యె నెట♦కేగెనొ నేమవువార్త లెవ్వి నా
యుల్లము పల్లవింప విన♦కుండితి నెచ్చట నున్నవాఁడొ నా
వల్లభు నన్నుఁగూర్పఁగల ♦ భారము నీయది సర్వమంగళా!

ఉ. నమ్మితినమ్మ నీకరుణ ♦ నాపయి నుంచఁగదమ్మ వేఱ మా
ర్గమ్ముకఁ గాననమ్మ కడుఁ ♦ గష్టములం దొలఁగించి మేటి నే
మమ్ములఁగూర్చుమమ్మ తొలి ♦ మంగళసూత్రము నీవు కట్టి న
ట్లిమ్మెయి నెంతునమ్మ! హృద♦యేశునిఁ జూపగదమ్మ శాంకరీ!

క. అనియిటు వనితారత్నము
వినుతించి భవాని నిపుడు ♦ వెనుకకు మరలం
దనయంత గుడికవాటము
ఘనశబ్దయుతంబుగాఁగఁ ♦ గ్రక్కున బడియెన్.

కం. తలుపులు దమయంతట నిరు
గెలఁకులఁబడి మూసికొనుట ♦ గేహిని గని ని
శ్చలతన్ భువనేశ్వరియే
మెలఁగుచు నుండంగఁబోలు ♦ మెల్లఁగ లోనన్.

కం. అని యబ్బురపడి గుడి ప్ర
క్కనగల స్తంభంబుచాటు ♦ కదుభయమున దాఁ
గిన సతి కట నొకశబ్దము
వినఁబడియెన్ దేవిపలుకు ♦ విధముగఁ దనరన్.

మ. తరుణీ! మత్కరుణాకటాక్షమునకుం ♦ దావైన నీ కెట్లు దు
స్తరమౌ యాపదగల్గె రేఁబవలు నీ♦సద్భక్తికిన్ మెచ్చి నే
పరమప్రీతిని నిన్ను నీతనయులం ♦ బ్రాణేశ్వరుం బాంధవో
త్కరముం బ్రోచితిఁ దోడునీడవలె నీ ♦ డ్కన్ నేటిపర్యంతమున్.

చ. మునివరుసేవలం దవిలి ♦ ముందటిరీతిగ నన్నుఁ గొల్వకన్
దినములు పుచ్చుటల్ గని వి•ధించితి నీకొకశిక్ష నేటికై
నను మరి నాపదంబులను ♦ నమ్మఁగవచ్చుట లెస్సయయ్యె దో
షిణుల మహాపరాధముల ♦ జిత్తముజేర్పము వేడి మ్రొక్కినన్.

ఉ. ధీజగదేక సన్నుత సు♦ధీజన సేవితయైన మాపరి
వ్రాజిక నొక్కదాని నటఁ • బంపుదు దానిమతంబు భక్తి వి
భ్రాజిత మొందఁ జేయుము శు♦భం బొడఁగూడును నీకు నన్నుఁగా
బూజనఁ జేయుమా? యతివ ♦ భూతభవిష్య దభిజ్ఞగావునన్.

ఉ. ఎల్లి ప్రభాతవేళ భవ•దీప్సితమున్ నెఱవేర్చ దీప్తిరం
జిల్లఁగఁ ద్వద్గృహోపవన♦సీమకుఁ జేరును బూజ్యురాలు నీ
వెల్ల విధంబులం బురుషు • లెవ్వరి నచ్చటఁ జేరకుండ నో
పల్లవపాణి యొక్క యిలు • పర్ణములన్ రచియింపు మచ్చటన్.

గీ. ఆవియోగిని నీవు మా•టాడువేళ
స్త్రీలు పురుషులు నెంతటి • చెలిమి గలిగి
యున్న నచ్చోటఁ దిరుగుచు ♦ నుండరాదు
దేవగోప్యంబ యిదిగానఁ • దెలుపవలసె.

గీ. నిర్మలాంగిరో మీరెంత • నిష్కళంక
గతిని వర్తించినను బ్రజల్ ♦ కాకులట్లు
దూఱుచుందురు వారికి ♦ దూరమగుచు
నుండవలె సుమ్ము యేకాంత•మండపమున.

వ. పోపొమ్ము. అప్రమత్తవై నాయాజ్ఞ ననుసరించి సర్వ ప్రయత్నంబులు సలుపుము. నీకు శుభంబగునని పలికి నిశ్శబ్దయగుడు నా హేమావతి భయ వినయ సంభ్రమంబుల మెల్లమెల్లనఁ దదాలయంబు దాఁటి నిజగృహంబునకుం జని తగు వారల రావించి యుపవనమునఁ బర్ణకుటీరంబు కల్పింపఁ జేసి స్త్రీపురుషుల నెవ్వారి నట రాకుండ కట్టుదిట్టములు సేసి తన్మార్గం బన్వేషించుచుండఁ బ్రభాతకాలం బాసన్నంబగుటయు.

సీ. అరుణోదయాంశువు ♦ లనుకరించెడు కెంపు
జడగుంపు శిరమునపై ♦ ముడిచికట్టి
ధళధళద్యుతులచే ♦ దళుకొత్తు స్వర్గంగ
మృత్తికఁ దనువెల్ల ♦ మెత్తిపూసి
కాయంబు పొడవుగాఁ ♦ గాషాయపటకంచు
కంబు ధరించి మధ్యంబు బిగిచి
మెడచుట్టు స్ఫటికాల ♦ మెలికలు పెద్దరు
ద్రాక్షల సరులు వ్రే♦లాడ వైచి
గీ. ఫాలతటిఁ గుంకుమము బొట్టు ♦ గీలుగొలిపి
పుస్తకంబును జపమాల ♦ బొబ్బమెకము
తోలు నాగబెత్తమును జే♦దోయి దాల్చి
యిచ్చ నొక పరివ్రాజిక ♦ వచ్చుచుండె.

గీ. భయదతీక్ష్ణంపుదృష్టులు ♦ పార్శ్వభూమి
యందుఁ బ్రసరింపఁజేయుచు ♦ మందగతిని
జనులు తనుజూతురనెడు శం♦కను గృహోప
వనిఁ బ్రవేశించు నాపరి♦వ్రాజికఁ గని.

గీ. వచ్చెఁబోనేఁడు నాపాలి ♦ భాగ్యదేవి
యనుచు హేమావతియుఁ దదీ♦యాంఘ్రియుగళి

శిరము సోఁక నమస్కృతుల్ ♦ జేసి శతము
పర్ణశాలకుఁ దోడ్తెచ్చి ♦ భక్తిమించి.

క. తడయక నర్ఘ్యము పాద్యం
బిడి తడిఁ బయ్యంటనొత్తి ♦ హెచ్చగు వేడ్కన్
అడరఁగ నాస్తరణంబిడి
జడదారియు విశ్రమించు ♦ సమయమునందున్.

గీ. అమ్మ కుశలమే ? మీ శిష్యుఁ ♦ రాండ్రకెల్ల
సేమమే ? భక్తకోటికి ♦ శ్రీకరములె
తావకాశ్రమసీమలు త్రైధ్ధకాగ
మనము నిర్విఘ్నతనుజెంది ♦ మహిమఁ గనునె!

వ. అని యడిగి సోమిదమ్మ యాగినికిం గంధమూల ఫలాదికంబుల నుపహారంబు గావించి తన మృదుకరంబులఁ దత్పాదంబులొత్తి తాళవృంతంబున వీచుచుఁ, దల్లీ! భవదీయ సందర్శనంబునం జేసి నే నెల్లవిధంబుల ధన్యురాలనైతి. నాకుమారులును దాస దాసీజనంబులు గృహారామపశుక్షేత్రంబులు సర్వంబు నీయధీనంబు గావింతు. ఇంకమీఁద నీ పాదసేవనంబునఁ బ్రదుకనుండిన నా కేకొఱంతయుఁ గల్గదనియెంతు. అయినను బ్రాకృతురాలనై సంసారచక్రంబునఁ బరిభ్రమించుచుండుటంజేసి నిన్నొక్కటిఁ బ్రార్థింతు. నావిషయంబంతయుఁ ద్రికాలవేదినియగు భవానివలన వినియుందువు. దానికేమని సెలవిత్తువు ? అని దీనాననయై పాదంబులంబడి వెడవెడఁ గన్నీరు నించుచు వేఁడుకొనగా నాసన్యాసిని తనలోఁ దాను దీర్ఘాలోచనంబు చేసి తల యూచుకొని గంభీరస్వనంబున నాయిల్లాలితో నిట్లనియె.

ఉ. సారసనేత్ర! నీదుసిరి♦సంపద గౌరవబుద్ధి మేటిసం
సారపుతీవి మన్ననము ♦ సాధుసుసేవన మార్యభక్తి వి
స్తారకృపానురక్తి గని ♦ సంతసమొందె మనంబునందు వి
స్ఫార భవత్కృపోత్తమ స♦పర్యలదృష్టము లకృత్రిమంబులున్.

ఉ. సుందరతాపసిద్ధులగు ♦ శోభనగాత్రులకిట్టి సౌఖ్య ని
ష్పంద పరంపరాగత సు ♦ భాగ్యములబ్బు నె వర్ణనీయమై
నం దగ మాధ్యశాతిథి జ॥నంబును బోచుట లబ్బియుంట నీ
ముందటి పుణ్యభూరుహము ♦ పూచి ఫలింపకయుండునే సతీ!

ఉ. మానవజన్మమెత్తి యొక ♦ మానవునర్థశరీరమై సదా
మానవ భోగ్యసంపదల ♦ మానసమందుఁ దలంచి ధర్మ సం
ధానమహార్థకామ్యముల ♦దత్పరతన్ మదిఁగోరు దేవతా
రాణికినైనఁ గష్టములు ♦ రాయిడికోర్వక తప్పనేర్చునే?

గీ. సానఁబెట్టక వజ్రంబు సౌరుగనునె?
పుటము వేయక బంగారు ♦ పొలుపుగొనునె?
పత్రినిగూర్చిన కష్టముల్ ♦ పడక యువతి
పుణ్యసుఖములఁ గాంచు? నే మూలనుండి.

శా. కైలాసంబుననుండి నీ ♦ కొలువు మా కాత్యాయనీ దేవి తా
నీలీలన్ నను బంపునప్పుడె భవ ♦ ద్వృత్తాంతముంగంటి నేఁ
డేలా? చర్విత చర్వణంబు వృథల॥య్యెన్ రోజులీపాటికే
కాలాతిక్రమణంబుగల్గిన మహా ♦ కష్టంబు సంధిల్లెడున్.

గీ. ఇంతిరో! మానినీ! యింట నిన్నినాళ్లు
భక్తిఁ బూజించు హాటకే॥శ్వరు హరించి
కపటముని వేషియా వాని ♦ కంత మవనిఁ
గూల్చు మావలిపనిఁ జూచు ♦ కొందమనుచు.

వ. తదుపరి వృత్తాంతంబంతయు నిపుడు వచించుట కవకాశము లేదు. నేనిక మాధ్యాహ్నికంబులు సేయవలయు, కనుకఁ గొంతసే పే కాంతవాసినిగా నుందు సిద్ధవేషమున నీయింట మిమ్ము వంచింపనున్న మహాపాతకుని నేటిరాత్రి వధింపవలె. దానికిఁ బరికరంబులు సమ కూర్చుకొనుము. పొమ్మనిన విని యా విప్రగృహిణి యదిరిపడి భయ

కంపితయై యిదియేమి యన్యాయంబనుచు నేతద్వ్యయంబు విశదం బుగా వివరింపకపున్న నేనిచ్చటనుండి వెడలిపోవుటకైన శక్తి చాల కున్నయది యని యా పరివ్రాజిక పాదములపైఁ బడి వేడుకొనుచు నిట్లనియె.

చ. తపసి మహానుభావు వర♦ధర్మచరిత్రుని సత్యశీలు ని
ష్కపటుని సర్వభూత హిత ♦ కాముని శంభుపదైకపూజనుఁ
వ్యపగత మోహ జాడ్యుని ప్రపంచ పవిత్రకృదంఘ్రి యుగ్మునిఁ
గృపణతఁ జంపఁ బూనుటకుఁ ♦ గేవల రాక్షసినమ్మ యోగినీ.

గీ. పాపమన కిట్టి కృత్యంబు ♦ బలిమినైన
జేయఁ దగు కారణంబేమి ♦ చేరె మనల
చెప్పుమా దేవి చెప్పెనో ♦ చెడ్డయేమి
యైన మును నీకుఁ జేసెనో ♦ యతఁడు జటిని.

గీ. మాసములు నాలుగరిగె నీ ♦ మానినాథు
గృహమునందుండఁ బూజ్యుఁడై ♦ కేవలంబు
పరుల దర్శన స్పర్శన ♦ భాషణముల
నెఱుఁగఁ డెన్నఁడు శివపూజ ♦ మరఁగియుండు.

గీ. ఇట్టి ఘోరంబు లెచ్చోట ♦ నేని జరుగ
వలదటంచును వారించి ♦ బలిమినైన
బంపఁ గల మీరలీ యాజ్ఞ ♦ పరఁగ నేఁడు
నాకొసంగంగ బలు కార♦ణం బదేమొ!

వ. అనిన నిర్బంధించి ప్రశ్నించు నావిప్రగృహిణికిఁ బరివ్రాజిక యిట్లనియె.

ఉ. ఇంతిరో యాడుపుట్టువున ♦ కిట్టి యమాయకవృత్తిఁ జెల్లునే
వింతగఁ దోఁచు నీ దయిన ♦ వెఱ్ఱితనంబును గన్న యోగికిం
గాంతలు పూరుషుల్ సుఖ విలాస ముతో నివసించు నిండ్లలోఁ
బొంతల చాటు నుండి తపముల్ ♦ రచియించుట ధర్మమే? పతీ!

చ. నిజమగు యోగి వీఁ డయిన • నిష్ఠ వసింపగ శైలకానన
వ్రజములు నాశ్రమంబులును • రమ్య గుహావళు లుండ నీభువిన్
గజిబిజి యైన పట్నములఁ • గాంతి యొఱుంగని గొందె యిండ్లలోఁ
బ్రజలను గబ్బిలంబువలె • బాధలు సేయుట యోగికొప్పునే?

మ. మును వాల్మీకి శుకాది దివ్య మునులుం • బుణ్యాత్ములై నిత్య కా
నన వాసంబులఁ గందవాయు జలపర్ణాసీకముల్ మ్రింగి శాం
తిని గౌరీశ్వరు సేవఁ జేసి తుది ము • క్తిం జెందరే? వారి క
న్నను యోగ్యుండె పురంబులం దిరుగుచు • న్నన్ మోక్షమార్జింపఁగన్.

మ. తన యాత్మంగల శంకరుం గనిన మే • ధాశాలి కీ హేమ లిం
గని నైవేద్యపు బాధలేల ? యితనిం • గాంక్షించెనే యీశుఁడున్
ననుగొంపోయి గృహస్థు లిండ్లకడ నం • న్నంబుల్ ఘృతాపూపముల్
తనివిం దీరఁగఁ దెచ్చి పెట్టుమని క్షు • ద్బాధా నివృత్త్యర్థమై.

క. ఫలమో ! పత్త్రిమొ ! పుష్పమొ
జలమో తన కున్నయంత • సర్వేశ్వరునిన్
గొలిచి నివేదన యిడి ని
శ్చల భక్తి వనాననుండ • సమ్మతిఁ గనఁడే?

శా. కాని మైత్రనను బాపపుణ్యముల నా • గౌరీశుఁడే చూచు నం
చే నాత్మం దలపోతు నుంగరము మా • లేమంచు నూహింతువో
నీ నాథుండు వినంగఁ దీర్ఘ కథ లెం • తేఁ జెప్పి శైలాటవీ
శ్రేణిం జూడఁగ వేగఁ బంపి యిట వి • చ్చేయుంగ నే యోగమో ?

వ. కావున బ్రహ్మ కిరాతుండైన యా కపట జటిపుంగవుం డవశ్య వధ్యుం డది యెట్లంటేని. ఇందాఁక దాఁచితి నింక మదీయ ముఖ్య భక్తాగ్రగణ్యవు కావున నింక దాఁచియుంచుట కర్జంబుగాదు. కాన దత్కథ వినుపించెద వినుమని యా పరివ్రాజిక గృహిణికి వెండియు నిట్లనియె.

సీ. కలరు శాక్తేయులు • కఠిన చిత్తులు క్రూరు
లన్నదమ్ములు తుషా•రాద్రియందుఁ
గాళికాలయమందుఁ • గడునిచ్చ వసియించి
యైశ్వర్యకాముౖలై • యంబఁ గొలిచి
కడు దినంబును వేద • జడుని గర్విష్ఠునిఁ
గార్హస్థ్య యుక్తుని • గావు నేసి
యిష్టార్థములు గొందు • రిసుమంత కృపలేక
హారయించి రెందరి • నవనిసురల

గీ. వారిలో నగ్రజుఁడు దుష్ట • వర్తనుండు
కలవు వానింట హేమలిం•గంబు సిద్ధ
మహిమఁ జెన్నొందు నుంగ్రింపు•మణియు వీని
గొని చరించును భువి యెల్ల • గుటిలవృత్తి.

గీ. తపసి వేషంబు ధరియించి • ధరణిసురల
మందిరంబుల కతిథియై • ముందు ముందు
తాను జూడని తీర్థ క•థా విధాన
ముల నుపన్యాస మొనరించు • లలితఫణితి.

వ. అతం డీప్రకారంబునఁ జెప్పెడు కథలవలన మహాను భావుండని యేసంసారి తన్ను నమ్ముకొనునో యట్టి వానిచేత నొక సిద్ధాంగుళీయకంబు దొడిగి యాత్రిల కేగి రమ్మని పంపును. తప్పక యాయంగుళీయంబు తన్ను ధరించిన వానిని నతిశీఘ్రింబుగాఁ గొంపోయి హిమాలయంబునఁ గాళికాలయము ముందుంచును. అతం డెటింగియా యాత్రికుని మంచిమాటల నారాత్రి యుపచరించి యర్ధరాత్రింబునఁ గాళికాహుతిజేయు. ఇక్కడ జ్యేష్ఠుండు హాటకేశ్వర పూజావిధానంబు నెపంబునఁ దనయుదరంబుఁ బూరించుకొనుచుఁ గొన్నినాళ్లకుఁ దద్గృహి ణిని గృహంబుననున్న ధనంబును గొనిపోయి నిజనివాసంబునకుఁ జేర్చు కొని తత్సతీమతల్లుల ననేకవిధంబుల బాధించుచుఁ దమ యిష్టా

ముల దీర్చుకొనుచుందురు. ఇట్టి దుష్టశాక్తేయాగ్రేసరుండు నీయింటి కతిథియైవచ్చి తీర్థయాత్రల నెపంబున నుంగరంబిచ్చి నీప్రాణేశ్వరు పరదేశమున కనుపి నిన్నును నీధనంబును నపహరింప గోముఖవ్యాఘ్రంబు చందంబున వేచియున్నవాఁడు. ఇంతకుమున్ను వీఁడొక్క పర్యాయంబు నాచేఁ జిక్కియు నొక్క ధీశాలినియైన యోగినీకృపావిశేషంబున నిహతుండుగాక బ్రదికివచ్చి యిచ్చట నున్నవాఁ డదియు నుంగాక,

సీ. మత్తకాశిని! నీదు ♦ మగఁడు తుషారాద్రి
నుంగరం బీడ్చుచుం♦డంగఁబోయి
వీని తమ్ముఁనియింట ♦ వెట్టి గొడ్డువిధానఁ
జేరి వసించె స♦జీవుఁడగుచు
నిఁక నాల్గురోజుల ♦ కేతెంచు పూర్ణిమా
భృగువారమున బలి ♦ యగునతండు
అంతలో నిచటి కార్యములన్ని నెర వేర్చి
పోఁదగు నీపతిం ♦ బ్రోవ మనము

గీ. కాన హరియింపు స్వర్ణలిం♦గంబు ముఁదు
దాని సాహాయ్యమున హిమ♦ధరశిఖరము
చేరఁగలమద్ది యాకూర్రు ♦ చెంతనున్న
సమ్మలం బౌను మన కార్య ♦ నిచయమెల్ల.

గీ. స్వర్ణశివమూర్తి యొక్కఁడే ♦ చాలు మనకుఁ
బతిని రక్షింప హిమగిరి ♦ పజ్జకరుగ
మొనసి మాంత్రికుఁజంపుట యొక ♦ ముఖ్యమైన
పనియె? యని మదిఁ దలఁపకుఁ ♦ బాపి యతఁడు.

గీ. అతనిఁజంపక విడిచి యా ♦ హాటకేశుఁ
గైకొని చనంగరాదు త ♦ త్క్షణమె వాఁడు
తెలిసి మంత్రించినను దిమ్మ ♦ దిరిగి వాని
కాళ్ళముందర పడుటయె ♦ కలుగఁగలదు.

గీ. వాఁడు జీవించియుండిన ♦ వలనుపడదు
స్వర్ణలింగంబుఁ గొనకున్న ♦ వలనుపడదు
భర్తజీవంబు రక్షించు ♦ పనికిఁబోవ
సత్వరంబున నాహేము ♦ శైలమరుగ.

వ. కాన నీ రెండు కార్యంబు లవశ్యా చరణీయములు. ఇంకఁ దడవు చేయువలదు. వాఁడెటెంగిన మన మానప్రాణంబులకు ముప్పు వాటిల్లఁగలదు. అనేక మంత్రమహా మహిమంబున నెన్నెన్నియో మహాద్భుతంబులఁ గావించు మాయావిగాన నప్రమత్తవై కార్యంబు దీర్చ పొమ్మనిన నా పరివ్రాజికతో మారుబలుక వెలచి యొక్క విజనస్థలంబున నేకాకినియై కూర్చుండి యా విప్రగృహిణి యిట్లని వితర్కించె.

చ. పతి గురియించువార్తల శుంభంబయిత్రోఁచి మదీయ కాయమా
హుతవహుఁ జేరఁగాక మహితోజ్జ్వల తేజుఁడు భూసురుండు ధీ
యుతుఁ డదిగాక శంభు పదయుగ్మవిచారుఁడు గొంతగోయ నీ
క్షితితల మెల్ల హా యనదె? ఛీ యనరే సతులెల్ల నన్ననన్.

ఉ. నేనిలు చేరుదాఁక మహా ♦ నీయ చరిత్రుని వామదేవునిన్
మానిని! శంకరుంబలెఁ గుమారులు నీవును బూజసేయుఁడ
న్లానవిధేయులై యనుచు ♦ ప్రాణవిభుండిడు నాజ్ఞ దీర్పఁగాఁ
బూనక కంఠముం దునుము ♦ బుద్ధిజనించునె? నాకు దుర్విధిన్.

ఉ. నాలుఁగుమాసముల్ కడు వినమ్రత నాతని పాదసేవ చేఁ
దూలఁగ జేసి పాపముల ♦ దుఃఖములను మఱపించు దివ్యవా
గ్జాలకథా ప్రసంగములఁ గాలముఁబుచ్చుచునుండి దీక్షులన్
దూలెడు మానికంఠమును ♦ ద్రుంతునె? పాపము నాక యక్కటా?

సీ. తనకొసంగిన ఫలార్థము ముందు సుతులకుఁ
బంచిపెట్టకను భు ♦ జింపఁడెపుడు

పతిఁగూర్చి దిగులొందు ♦ పట్ల బిడ్డా! నీకు
భయమేల? విభుఁ డెల్లి ♦ వచ్చు ననును
అతివేగ గృహపతి ♦ యరుదెంచఁగాఁ జేయు
మని హాటకేశ్వరు ♦ నభినుతింతు
గురుని రాకకు మదిఁ ♦ గోరు శిష్యుల కువ
నిమదర్థజాలముల్ ♦ నేర్పుచుండు
ఆ. వె. తండ్రితాతగురుఁడు ♦ దైవంబు నాయొప్పి
కరుణ మమ్ము నరసి ♦ కాచుతపసి
పోయె నుంగ్రమంచుఁ ♦ బొగిలి నిద్రింపంగఁ
జంపఁజూతు నెటుల ♦ సాధ్వినగుచు.

చ కడువడి మంథరోక్తి విని ♦ కైకయు శ్రీరఘురాము కానకుం
దడయక పంపి పంక్తిరథు నం♦దనసీమకుఁ జేర్చెనంచుఁ దాఁ
బొడమినకీర్తి నేటికినిఁ ♦ బొందుట నేఁ జెప్పులార వించు నే
యెడఁ మునిచంద్రుఁ జంపఁదగు? ♦ నెట్టి వివేకవిహీననో కదా?

చి. సరసిజనేత్ర లెన్నఁ డతి♦సాహసురాండ్రని వ్రాఁతవ్రాసి యి
ద్ధర దరుణీకులంబునకె ♦ తప్పొనరించిరి కావ్యకర్తలం
చరయుదు కోపదృష్టి; నవి♦యన్ని మరట్టి వృథాభిమాన నీ
దురితము నేనె చేతునఁట ♦ దుర్విధి యెంతటి సాహసంబొకో?

సీ. నిగమసద్ధర్మైక ♦ నిష్ఠాపవిత్రమా
విప్రవంశంబున ♦ వెలయఁబుట్టి
సకలశాస్త్రవిచార ♦ సత్కర్మ నిరతుఁడౌ
యావజ్జనాభు న ♦ ర్థాంగినగుచు
ఉత్తమగుణుల వం ♦ శోచిత కర్ముల
సోమభాస్కరుల నా ♦ సుతులఁగనియు
దిగులులే కేనింత ♦ తిని యొక్కరికిఁ బెట్టు
సిరి నయాచితవృత్తిఁ జే వహించి

గీ. విప్రగోదేవ పూజనా • విధులుభక్తి
నిత్యము రచించు నేన? యీ ♦ నీచకార్య
మునకుఁ దెగినచో నీలోక•మున వనితలు
కఠికమానసు లనుట ని ♦ క్కంబుగాదె?

చ. నిరసనవృత్తిచే శివుని • నెమ్మదినమ్మి భజించుసిద్ధు ని
ష్కరుణను జంపఁ బాపమగుఁ; • జంపకమానితినేని నామనో
హరు నితఁడే వధింప గిరి • కంపుట 'నిక్కముకాఁగఁ దోఁచు; నిం
దరయఁగ నెద్ది మానఁదగు ♦ నౌనని యెద్ది రచింపనయ్యెడిన్.

ఉ. తెంపరినై మునీంద్రుఁ దలఁ ♦ ద్రెంచి వియోగినివెంట భర్త ర
క్షింపగ శీతశైలమును • జేరఁగఁబోయెడిబోన నాథునిం
జంపిరయేని నాబ్రదు క♦సహ్యమగున్ జగమందుఁ జచ్చుచోఁ
గొంపనుముంచి దుర్యశముఁ • గొంచును దుర్గతిఁ జేరనయ్యెడున్.

ఉ. ఇమ్ముగనిచంద్రపాణి మొక ♦ యెత్తుగఁ జూడుమటంచు నన్నుఁ దా
నమ్మి వచింప మంచిదని • నాథునిచేఁ జెయిఁజేర్చి పంపి నాఁ
డిమ్మెయి నట్టియాజ్ఞ మది ♦ నెంచక తుచ్ఛకిరాతవృత్తిఁ బ్రా
ణమ్ములఁ దీయుచుంటి నిఁక ♦ నాథుని నాగతి యెట్టులౌనొకో!

సీ. నిజముగాఁ బతియాజ్ఞ ♦ నిరసించుటొక్కటి
ప్రజలచే నిందింపఁ • బడుటరెండు
పుట్టినింటికి మాట ♦ పుట్టించుటలుమూఁడు
నాసరివారెల్ల ♦ నగుటనాల్గు
తగుబోటులను సుతుల్ ♦ తలవంపుబడు టైదు
బ్రహ్మహత్యను ద్రోయ ♦ బడుటయారు
కలకాల మఖిల దు • ర్గతులపాలగు టేఁడు
కొమరు సంసారంబు ♦ గూల్చుటెనిమి

గీ. దష్టకష్టంబు లివికల్గు ♦ టంతెకాక
పరమసాధ్వీ వ్రతంబును ♦ బాడుజేసి
యడవి కేనీ వియోగని ♦ ననుసరించి
పోవనయ్యెను నూర్గ(కా♦పురము విడిచి.

చ. అడవికి నేనుబోయి పతి ♦ యంఘ్రులమ్రొక్కిన మానివామదే
వుడు కుశలుండె? యన్న బర♦బుద్ధిని నాతని( జంపితన్న నా
థు(డు విని ఛీ యటంచు వగ♦తోడను బ్రాణముపీడ నిగ్వరం
గడువడి( జంపుమి త్తివలె ♦ గ్రమ్మటి నే( బురి చేరుదాననే?

ఉ. ఈపరివ్రాజి చెప్పినటు ♦ లేమునివర్యు వధించి యింటిలో(
దా(పినద్రవ్యముంగొని సు♦ తద్వయితోడ నరణ్యసీమ కెం
తే పయనంబు(గట్టునెడ ♦ నింటికి నాథు(డు వచ్చెనేని నే
నేపగి దామహాత్ము మొగ ♦ మెత్తి కనుంగొను దెప్పటట్టులన్.

చ. అనృతము(జెప్పనే? జటిని ♦ యంబిక చెప్పిన యాజ్ఞ నిందు నే
వినగ వచించెగాక జన ♦ విశ్రుత పుణ్యచరిత్రనై పతిన్
ధనమును బుత్రులన్ విడిచి ♦ త్యాగమునుం బచరించు యోగినుల్
జనులను బాపకార్యముల ♦ సల్పుమటంచని చెప్పనేర్తునే?

చ. తొలుత గృహంబునందె మది(♦దో(చిన యోజన( జేయకుండ ని
శ్చల గతి( గాళినిన్ వినుతి ♦ సల్పుట కే గుడి కేగనేల? నే
వెలయ( దదాజ్ఞ శీర్షమున ♦ విశ్రుత భక్తి ధరించి యీతనిం
దల( దునుమంగ సంశయము(♦దాల్చుట యేల? విమూఢచిత్తనై.

ఉ. యోగిని పల్కు శాంకరి న♦యోక్తుల( జేయ(గ మీరరాదు దు
ర్యోగి యటంచు సిద్ధు తల( ♦ ద్రుంచ(గ రాదు మదీయభర్తనున్
బో( గొని యూరకుండుటకు ♦ బుద్ధి జలింపదు గాన దేవి నా
కేగతి వెట్టెనో? యటుల ♦ నే యగు( గావుత మం చు ధీరయై.

గీ. మరల( దత్పరివ్రాజికా ♦ మందిరమున
కరిగి తనమది( గల సంశ♦యంబునెల్ల

దెలుప నాయమ్మ నవ్వుచు ♦ ధీరవృత్తి
విడువ వలదమ్మ సాధ్వీరో ♦ వెఱ్ఱివగుచు.

గీ. అనుచుఁ జేవిలోన నేమేమొ ♦ గొణిగిచెప్పి
భయము లేదమ్మ మేమున్న ♦ పట్ల ననుచు
కష్టము లభించె సౌఖ్యసం♦గతి లభించె
నేఁటితోఁ బొమ్మటంచు ము♦మ్మాఱుచెప్పి.

ఉ. కావిమడుంగుసంచి గల ♦ ఖడ్గము నొక్కటి దీసి యంబికా
దేవియు నీ కొసంగుమని , దీపనతో నిడె దీనిఁ గొంచు నీ
భావమునందుఁ గాళి పద ♦ పద్మములన్ వినుతించి మానివే
పావహుఁడైన మానితల ♦ నంటఁగఁ గోయుము ధీరచిత్తవై.

గీ. సాహసంబన్న స్త్రీలకు ♦ శత్రుకంఠ
ములను విదళించి పతులను ♦ బ్రోచు నెడలఁ
గాక వంటింటిలోఁ జేరి ♦ కాయగూర
లనుదినంబును దఱుగుట ♦ కానె? చెపుమ.

గీ. చనుము వేగంబ విజయ మా♦సన్నమయ్యె
లేక చేతఁగాదని చెప్పు ♦ మేఁ లే యటంచు
బోయెదను మద్ది యాశ్రమ ♦ భూమికేను
యింత బ్రతిమాలుదునె? యిసు ♦ మంతపనికి.

గీ, ఈ పరివ్రాజి ధర్మంబు ♦ లెనయకున్న
నిట్టి క్రూరులఁ జంప నీ♦యట్టి దేబె
నింత బ్రతిమాలుదునె? నేనె ♦ యింతలోన
గత్తిరింప నే యొకకయిఁ ♦ గుత్తుకలను.

ఉ. మానవకాంత లెన్నఁ డవ♦మానము కోర్వరటం చెఱింగియే
నేనిటువచ్చితిం గిరిజ ♦ నిష్ఠుర వాక్కులకోడి వచ్చినం
గానను గార్యరూపమును ♦ గాలము వ్యర్థమయయ్యెఁ బోదు మా
కానల కంచునున్నయవి ♦ కందము లీయుపచార మేటికిన్.

వ. అని సగర్వంబుగాఁ బరాక్రమించి పలుకు నా పరివ్రాజిక పలుకల కాలలితాంగి నిరుత్తరయై యేమియుఁ బలుక వెఱచి దుర్గా మహా ప్రసాదంబని యామెచేతి ఖడ్గంబుఁ గైకొని తన నెలవున కరుదెంచి యెట్టులైన నేనీ కార్యంబుఁ జేయక తీఱదనుచుఁ గృతనిశ్చయురాలై తత్కార్యసాధనంబుల సమకూర్చుచుండ దివాకరుం డపరగిరి శిఖరంబున కరుగుదెంచుటయు.

సీ. ఆవియోగినియాజ్ఞ • ననుసరించి గృహస్థు
రాలు సాయంకాల•మగుట గాంచి
దేవతాగృహమున • దీపముల్ వెలిగించి
సాహిత్య మంతయుఁ • జక్కఁబఱచి
మడుగుఁబుట్టముఁ దాల్చి • మంచితీర్థముఁదెచ్చి
సంధ్యావిధులు దీర్చి • జటినిఁబిలిచి
పప్పుఁబచ్చడి చారు • నప్పడంబులు నుప్పు
నరుగులు గలయట్టి • వంటకంబుఁ
గీ. జేసి శీఘ్రంబ సుతుల భు•జింపఁజేసి
సారఫలములుఁ బాలును • జటి కొసంగి
తాను భుజియించి యైణేయ•మైన తల్ప
భార మొకచోట నతనికిఁ • బరచి పిదప.

గీ. సుతులు శయనింప మునుపటి•చోటు విడచి
నింటిలో నొక్కగదియందు •నిర్వ్వరకును
వేఱువేఱుగఁ దల్పముల్ • వేయఁబనిచి
చిన్నవాకిండ్లు నొకటిగాఁ • జేర్చి మూసి.

సీ. వనములోనున్న యాపరి•వ్రాజికడకుఁ
గొని ఫలాహారవస్తువుల్ • కొన్ని గృహిణి
యతిరయంబులఁ జనియెఁ ద•దాత్మజుండు
సోముఁడంతట సత్కళా•స్తోముఁడగుచు

ఉ. నిద్ర యొకింతవో కమహానీయుఁడు మేల్కొనియుండి యెద్దియో
మునిన్రను దాల్చియున్నటుల • మూయుచు విప్పుచుఁ గన్నుదోయి ని
ర్నిద్ర నిజద్యుతుల్ వెలుఁగ • నింగినిఁ జూచుచునున్నవాఁడు నే
భద్రదమైన తచ్చరణ • పంకజసేవ నొనర్తు భక్తితోఁ.

వ. అని యామహానుభావుని డాయంబోయి వినమితశిరస్కుం
డై నమస్కరించి యాసోమకుమారుం డిట్లనియె.

సీ. జటివర్య! యోగ్యంబె? • శయనంబుమీఁదికి
నరుదెంచునే మార్గ • తార్భకంబు?
మనము విశ్రాంతినిఁ గొనియున్నదే? జప
ధ్యానంబులను శ్రమం • బెనయకున్నె?
ఇంతలో మాతండ్రి • యిల్లుసేరునె? నీదు
వ్రేలఁ జూతుమె? యంగు • ళీయకంబు
నీపాదముల నొత్తు • మేలైన భాగ్యంబు
నకుఁ బాత్రునిగఁ జేయు • నన్నుఁదాత?
గీ. అనుచు పల్లన ప్రతిమాలు • కొనెడు సోముఁ
దన సమీపంబునకుఁ బిల్చు • కొని జటిందుఁ
డాదరాయత్త చిత్తుఁడై • యంఘ్రులొత్తు
మనుచు సెలవీయ నాతండు • హర్ష మొంది
గీ. భక్తిదళుకొత్త సోముఁడా • వామదేవు
సర్వదేశాటన పవిత్ర • చరణయుగళిఁ
దన తొడలపైనిఁ జేర్చి య • థాసుఖంబు
గ మృదుకరముల నొత్తుచుఁ • గ్రమ్మఱ ననె.

సీ. అనఘ! నాహృదయంబు • నందెద్దియో భయ
భ్రమము దోఁచెడిని న • కారణముగఁ
గడుహాయిఁ జొక్కి భాస్కరుఁడు నిద్రించె మా
యమ్మ ధనాగార • మందు నన్ను

శయనింపుమని యాజ్ఞ • నలిపి గృహారాద్యాన
సీమకుఁ జనియె వి•శేష వన్య
ఫలములఁ గొని యుండె • పరగ మా తండ్రినిఁ
గూర్చి దుఃఖించుచుఁ • గూర్కె నేమొ ?

గీ. రెండుజాములదాఁక ని•ద్రింపకుండ
నెద్దియో తలంచుచు నుంటి • రేల ? మీరు
వామ భుజ నేత్ర పార్శ్వముల్ • వదల కదరఁ
జొచ్చె; నాకెట్టి యాపద • వచ్చు నొక్కొ ?

చ. అన విని వామదేవముని • యాగృహనాథునిముద్దుపట్టితో
ననియె నిజంబు నీ తలఁచి • నట్టులె నేఁడు సువర్ణ లింగమూ
ర్తినిఁ దగఁ బూజసేయు నెడ • దీప్తిఁ దొలంగిన జాడఁ దోఁచినన్
మనమున సంశయించి శివ • మంగళ మిమ్మని సన్నుతించితిన్.

క. రేపో నేఁడో యొక్క మ
హాపద జనియించు మనకు • నన్యులవలనన్
పోపొమ్ము కలఁడు శ్రీ గౌ
రీపతి మన పాల నొక్క • లెక్కయె కడువన్.

గీ. ధైర్యవంతున కెన్నఁడు • తప్ప నాప
ద లని వచియింతు రెమ్ము న్ను పెద్దలు వినంగఁ
గానఁ దత్పరిహారంపుఁ • గార్యకలన
నప్రమత్తులమై యుంట • నవసరంబు

వ. కావున.

శా. వన్యాహారముఁగొంచు మీజనని తే • వన్ తోఁటకేఁగంగ నే
ధన్యాత్ముల్ దయచేసి రచ్చటికిఁ జి • త్రింబయ్యెఁ జూడంగ ధీ
మాన్యుల్ మిమ్ముల నింటనుండుమని పే•ర్మిం జెప్పె నేకారణం;
బన్యుల్ దుష్టులు మిత్రభేదములఁ జే • యంజూచుటల్ దోఁచెడున్.

గీ. నేఁటి సాయాహ్నపూజనా ♦ నిచయమెల్ల
వేగ సలుపంగ మీాయమ్మ ♦ వేఁడుకొనియెఁ
బనులతొందర గలదంచు ♦ ఘనకుశాజి
నంబు లిచ్చుటఁ బఱచె సం♦జయు మునుఁగ.

కం. ఈవిధమెల్లను గన నే
డో వంచనకొఱకు దుష్టు ♦ లుపవనమున హే
మావతియుపచారములన్
గావింపఁగ నున్నరీతి ♦ గనుపట్టు మదిన్.

ఉ. మానవతీశిరోమణి యు♦మాయకురాలు భవద్గురుండు యా
త్రానియతిన్ విదేశములఁ ♦ దక్కవసించెను బాలురాటచేఁ
గానఁగలేరు దుష్టజన♦కార్యములన్ మునుముందు దీక్ష చే
మానముఁదాల్చి నేఁ గుజన ♦ మార్గములన్ గమనింప మానితిన్.

గీ. స్వర్ణశివమూర్తి నెవ్వరో ♦ సంగ్రహింపఁ
దలఁచి మాయాపరిచారులు ♦ ధ్యానమునకు
వచ్చియుందురు మునివేష ♦ భాషణములఁ
బరగఁ దమమార్గ మెవ్వరు ♦ నెఱుఁగకుండ.

గీ. మాయతంత్రంబులను బన్ని ♦ మంచిసమయ
మిది యటంచును వంచకు ♦ లదయు లగుచు
గపట మునివృత్తితోడను ♦ గాచియుందురి
సంశయంబేల? యాపదల్ ♦ సంభవించు.

గీ. తీర్థయాత్రలకొఱకు నేఁ ♦ దిరుగువేళ
నెందరో ఖలుల్ వంచించి ♦ హేమలింగ
మపహరింపంగఁ దలఁప న♦య్యెద నెఱింగి
వారి వంచించి యిటకేను ♦ వచ్చియుంట.

కం. వారలు నాకొఱకై యిటఁ
జేరుచునుందురు నిజము వ♦చింపంగను ఘో

రారణ్యముల వసింపక
యూరుల నేనున్న వార • లోర్వరు గంటే?
గీ. తల్లికిని బుత్త్రినకు విరో•ధంబు దెచ్చి
నాలుమగలకైనను బెంచు • నాగ్రహంబు
యతినిఁ బురికొల్పు నధికదు• రాశ కవని
గానఁ గనకంబువంటి దు•ష్ఖలుఁడు గలఁడె?
వ. అదియునుగాక.

సీ. మునుయాత్రిలను జేయు • బుద్ధిచే హిమశైల
తటమునఁగల వనాం•తరమునందుఁ
దిరుగు చేనుండంగఁ • బరమభక్తులరీతిఁ
జేరిరి యొకయన్న • సెల్లెలిరువు
రతిదుష్టమానసు • లహరహంబును నన్నుఁ
గొలిచి మహాశ్రిమ • స్థలమునందు
వంచించి నను దుష్ట • వామమార్గుల శక్తి
బలికిచ్చి పాటకే•శ్వరు హరింపఁ
గీ. జూచుసమయంబున మరొక్క • జోగురాలు
వచ్చి శాక్తేయులను జంపి • భక్తి నాదు
కత్తుపాలను నను గొని • కడుజవంబు
మీరఁ దనయాశ్రిమంబును • జేరె నపుడు.
ఆ. వె. కాలివేగమొప్ప • ఖలు లన్నసెల్లెండ్రి
చనిరి జటిసిచేతి • చాపుదప్పి
ఆ సుశీల నన్ను • నతిభక్తి నటనుండ
వేఁడుకొనిన నుండ • వెఱచి పఱచి
గీ. దుష్టులని మంచివారని • తోఁపకుండఁ
గపటమునివృత్తి నాగిరిం•గలరు నరులు

గాన నచ్చోటనుండక ♦ గడుపుచుంటి
దినములను హాటకేశుతో ♦ జనపదముల.

కం. ఆనాఁటిభయము లిప్పటి
కైనను స్వప్నమునఁదోఁచు ♦ నన వింతయుఁగా
దేనేమి సేతు శివుఁడుం
దానేమి యొనర్పనెంచెఁ ♦ దగ నట్టులగుఁ.

గీ. దానిపేరు కరాళ యు ♦ ద్దానియన్న
పేరు వికటుం డటంచు నా ♦ పిన్నజోగు
రాలు చెప్పి శాత్రేయ చ♦యంబునకును
రాయబారులు వీరు జా ♦ గ్రత్త యనియె.

వ. ఇదియునుంగాక నీకు వినిపింపఁదగినట్టి విశేషం బింకొక్కటి గల దద్దాని వచియింతు వినుమని వామదేవుండు సోమకుమారున కిట్లనియె.

సీ. మొన్న నే గంగను ♦ మునిఁగి సైకతసీమ
సావిత్రి జపియించు ♦ సమయమందు
ఆనదీతటమార్గ ♦ మనుసరించి వియోగి
నీవేషమునఁ గాళి ♦ నిలయమునకు
సత్వరగమనయై ♦ చనుదెంచె నొకవ్యక్తి
తనువెల్లఁ గాషాయ♦మున మునుంగ
సాధుబృందమటన్న ♦ సంతసంబున మ్రొక్క
వాఁడనైనను జప ♦ భంగమునకు

గీ. వెఱచి పల్కమి నదియును ♦ వేగగతిని
గుడికిఁజనియెను మరలి నే ♦ నడచి తటకు
గమనచాతుర్యమునుగన్న ♦ కపటయోగి
విధము దోఁచెను నామది ♦ వినుము సోమ!

వ. అని యోగానందుండు పలుకుట విని సోమకుమారుండు భయకంపితుఁడై మనంబున నించుక విషాదంబునొందుచు నిది యేమి యాశ్చర్యంబని మునివర్యుని పజ్జకుంజని రహస్యంబుగ నిట్లనియె.

ఉ. తాత! మదీయమాత మది • తాపముఁ బాయ భవానిదర్శనం
బాతతభక్తితో సలిపి • యాశుత నింటికి వచ్చుటాదిగాఁ
జేతము నూత్నపద్ధతులఁ • జేరినయట్టులఁదోఁచె నాకు
మో తగుకార్యమగ్నయయి • యుండు సహంబును రేయిఁ జూచినన్.

గీ. నాటనుండియు మన్ములఁ • దోఁటలోని
కేఁగవలదంచు నాజ్ఞఁ దా • నిడియె నప్పఁ
డప్పు డుద్యానమున కేగి • యరుగుదెంచు
చుండు; మాతండ్రికై దిగు • లొందుచుండు.

కం. అని సోముఁడు వచియించిన
విని ముని తలయూచి యిట్టి • విధి జరుగుట నే
ననుకొంటి ముందు నట్టులె
చనుదెంచెను కార్యభరము • సన్నిహితంబై.

సీ. గాంగతీరమున నేఁ • గనిన వ్యక్తి భవాని
గుడియందు నుండ నా • గుడికి దేవి
దరిశింప మీయమ్మ • తరలిపోయిన వ్యక్తి
చేరి తా నేమేమొ • మీరరాని
పద్ధతి నుపదేశ • భంగి వచించిన
వికలయై సాధ్వి యా • వేషధారి
నుపవనంబునఁ జేర్చి • యుండఁ బోలుఁ దదీయ
కృతిచేత నాపద • కీడు మనలఁ

గీ. జుట్టు ముట్టునో? తెలియ దాగుట్టు నిపుడె
తెలియ గుడికేగి యాదుష్టు • బలిమిఁ బట్టి

కొని యరుగుదెంతు నాపై యా ♦ గుడిని లేక
యున్న నతివేగవత్తు నిం♦దున్న యట్లు.

గీ. అవసరము లేక యెన్నఁడో ♦ యరుగుదెంచు
నాపదలఁ గూర్చి యత్నించు ♦ టఘుడు కలుగు
మునికిఁ దానూరకుండినఁ ♦ బూనివచ్చు
ఖలులఁ జంపక విడుచుట ♦ కార్యమగునె?

క. నేవచ్చుదాఁక మేల్కొని
నీ వాయుద్యాన వనము♦నే కాంచుచునా
త్రోవల నెవ్వరుగానీ
పోవఁగ రాకుండ నిలుము ♦ బుద్ధిఁగుశలివై.

క. గుడినుండె నేనని నాఖలుఁ
దడయక మెడనీడ్చి పట్టి ♦ తప్పక తెత్తుఁ
గుడిలేక యున్న వచ్చెదఁ
గడువడి మనదోఁట వెదకి ♦ కనుఁగొన వానిన్.

క. అని యుపవన మార్గంబున
ఘనమతియగు సోమ నాముఁ ♦ గాపుంచి వెసన్
ముని కరదీపిక నొక్కటి
గొని యేగె విభీతవృత్తి ♦ గుడి కారేయిన్.

సీ. నడురేయి నిశ్శబ్ద ♦ మడరు వీధులు దాఁటి
యారీతి నతివేగ ♦ నాతఁ డేగి
గుడిబీగమును వీడ్చి ♦ గొట్టి లోపలఁ జేరి
కరదీపికను గ్రమ్ము ♦ కాంతిచేత
మూలలఁ బరికించి ♦ మూఁతపోయిన భేరి
కాగోళమును మూసి ♦ కప్పియున్న
సంచి నొక్కటిఁదీసి ♦ సవరించి యందున్న
నల్లని వస్త్రంబ♦ నార్పు చేర

గీ. యట్టి రవికయు ముకురంబు • నంజనంపు
బరిణె మొదలైన వస్తువుల్ • పారఁ జూచి
గుండె నీరయిపోయి • దిగ్గునను లేచి
సంచి వేరొక్కచోఁ దాచి • జటివరుండు.

కం. చిత్తం బస్థిరమై యు
న్మత్తునిక్రియఁ బరుగుతోడ • మాయావి దురా
యత్తుఁడు తోఁటకు జేరెను
బెత్తనమిఁకఁ దలఁపఁ దుదకు • వెతలగు ననుచున్.

సీ. మును నన్ను హిమశైల • వనమున వంచించి
సౌవర్ణ లింగంబు • సంగ్రహింపఁ
దలఁచి యోగినిచేతఁ • దనచావుముందుగాఁ
దప్పికాననసీమఁ • దారుకొన్న
బాలిశురాలు క•రాళి దుర్బుద్ధిని
మించుదాష్ట్యము విర•మించు కొనక
జటినివేషముఁదాల్చి • సంచరించుచు నిట
నాయున్కిఁ దెలిసి యా•నగజగుడికి

గీ. చేరి ద్విజపత్ని గుడికేగు • దారిఁగాచి
యెవ్వరో దుష్టనీతుల • నింతిమనము
బ్రమయఁజేసి తదీయమా • ప్రార్థనమున
నుపవనంబునఁజేరె నా • కపటచరిత.

గీ. నన్నుఁ గొలిచెడునాఁట నా•నాఁటిదాల్చు
నల్లవన్నియచేల యీ•నాఁడు గుడినిఁ
గొన్ని పరికరంబులతోడఁ•గూడఁ దాచె
సిద్ధమీది కరాళి యటంచు • బుద్ధిఁ దలఁతు.

గీ. కాంతలకు యోగ్యమగు నలం•కార వస్తు
వితతి దేవాలయంబున • వెలఁది విడచి

చనుట మోహింప జటలుఁ గాషాయములను
దాల్చియుండెఁ గాఁబోలు నుద్యానమందు.

కం. హిమశైల మేడ? జనపద
రమణీయగృహంబులేడ ♦ రక్కసినై సం
యమినీవిధు లందునటె వ
సుమతి నసాధ్యంబుగలదె? ♦ సుదతుల కెందున్.

గీ. గహనవాసిని రక్కసి ♦ కఠినచిత్త
నిరత మానవహింసాతి♦నీచహృదయ
తరుణి మాయాప్రచారిణి ♦ తలఁచి చేయ
దాని కిల ఫలింపని దొక్క♦టేని గలదె?

గీ. అంతపనిజేసె నాయందుఁ ♦ బంతమూని
మున్ను; నివు డెట్టి హింసను ♦ బూని చేయఁ
దలఁచి వచ్చెనో యిచటికి ♦ దానిమాట
యన్న నాడెంద మెంతో భ♦యంబునొందు.

గీ. పారిపోయెను దనచావు ♦ దూరమైన
ముందు; నివు డెట్లు పోనిత్తు ♦ నిందు దాని
తనువు గ్రద్దలఁ కిడకుండఁ ♦ దపసిరేఁగ
దల పొలము నుండదనుట త♦థ్యంబుగాఁగ.

కం. అని విస్మయ సంభ్రమ సం
జనిత మహోద్వేగ పరవ♦శతలు బెనఁగొనన్
ఘనతమిని మిఱ్ఱు పల్లం
బని తెలియక వచ్చుచుండె ♦ నతఁ డవ్వేళన్.

వ. అంత నిక్కడ.

చ. మునివరు నాజ్ఞశిక్షమునఁ ♦ బూని కుమారుఁడు సోముఁ డట్టిరే
యిని వనమార్గమందుఁ జరి ♦ యించుచుఁ జిత్తమునందుఁ గన్నతం

డ్రినిఁ గృపఁ బ్రోవుముచుఁ బలు ♦ రీతుల శంకరు సన్నుతింపుచున్
జననియుచాతురీకృతిక ♦ నమ్మతిఁజూపుచు దుఃఖమొందుచున్.

ఉ. మూఁడవజాము రాఁదొడఁగెఁ ♦ బోయినతాపసి రాఁడు దుష్టు లీ
జాడల నైజవర్తనలు ♦ సల్పుట కానఁగరాదు మాయ లిం
కేడఫలించు సిద్ధుని యు ♦ హీన నిజద్యుతిముందు రేపటం
బ్రొద్దతనంబుఁజూపి రిపు ♦ పుంజములన్ నడపింతు రచ్చలన్.

చ. తొలుతఁ గరాళ వచ్చుటకుఁ ♦ దొయ్యలిచే రచియింపఁబడ్డ నా
వెలుపలి తోఁటవాఁకిటికి ♦ విప్రుఁడెఱుంగని దారుయంత్రపున్
జిలుకుబిగించి సోముఁడల ♦ సిద్ధకుశాజనశయ్యయందు ని
శ్చలముగఁ బవ్వళించె సువి ♦ చారుఁడు మీరిన నిద్రసౌఖ్యనన్

వ. ఇట్లు సుకుమారుండగు సోమకుమారుం డారాత్రి మూఁడవ యామంబు సగంబు నంతవఱకు సిద్ధుని యాజ్ఞాప్రకారంబు జాగరణం బత్తి జాగరూకుండయి రచియించి యలసటనొంది తన్మని యోగ్యం బగు తల్పంబునందు శయనించి చల్లగ వాతపోతమ్ముల కెంతయు హాయిఁజెందుచుండ నంత.

సీ. సకల జీవుల కహా ♦ శ్చ్రమదావు మంత్రంబు
ముల్లోకముల కన్ను ♦ మూఁతమందు
పుణ్య జాగరణ ని ♦ ర్మూల్యలవ సూత్రంబు
అతివేగ రాత్రుల ♦ సంపుజోదు
పైసొమ్ముఁగొల్లుచ్చి ♦ పంపుమచ్చలమారి
ఘన తస్కరులపాలి ♦ కన్నతల్లి
జగదంత లాదృశ్య ♦ సంచార యోగిని
స్వప్నేంద్రజాలిక ♦ పంగడీఁడు

గీ. జపతపోయోగ విఘ్నవి ♦ చారముద్ర
మూఢ విద్యార్థి శిరముల ♦ నాడు భద్ర

పంక్తికంఠాను జన్మ కృపాసముద్ర
నిద్రయుర్వీశ సోము సన్నిధినిఁ జేర.

గీ. నట్టనడురేయి యావజ్ర • నాభ సుతుఁడు
జ్యేష్ఠతోఁ గూడి నాట్యంబు • సేయ నిద్రఁ
గాంచి యానంద వివశుఁడై • కన్నుదోయి
యర్ధముగ మూసి హాయని • యావులించె.

గీ. కావిడుప్పటి తనువెల్లఁ • గప్పుకొనియుఁ
గొట్టిలేపినఁ దెలియని • గుర్రుతోడ
గాఢ నిద్రనుజెందె నా • కాళరాత్రి
గృహమునెల్లెడ నైశ్శబ్ద్య • మెసఁగుచుండ.

వ. అంత నక్కడ హేమావతి తానుదెచ్చిన ఫలాహారంబు లెల్లఁ గరాళికకు నివేదనం బాచరించి యిష్టాగోష్ఠికథనంబులఁ గొంత కాలంబు పొద్దుపుచ్చి వివిధహింసా విచారంబుల కుపచయంబైన యర్ధరాత్రం బాసన్నంబగుట నెఱిఁగి తన కార్యంబు నిర్విఘ్నంబుగా సమాప్తి నొందున ట్లనుగ్రహింపుమని కరాళీచరణంబులకు బ్రణమిల్లి ముందారక్కస మొసంగిన ఖడ్గంబు కరంబునం దమర్చి నిశ్శబ్దంబైన తన గృహాంగణంబు నలువంకలఁ బరికింపుచుఁ బ్రాంగణంబున నున్న కుశాజిన తల్పంబున గాఢ నిద్రావశంబున శయనించియున్న సుకుమారుండు తన కుమారుండని యెఱుంగక సిద్ధుండని తలంచి తెగ వ్రేయ నిశ్చయించి శీర్ష భాగంబున నిలువంబడి యాకాశంబువంక జూచి తనకిష్ట దేవతయగు భవాని కభివందనంబుఁ గావించి యిట్లని నుతించె.

సీ. పతివార్త తెలియక • పరితప్తమా మది
నిదమిద్ధ మనుమాట • నెఱుఁగలేక
సంసార మెల్ల నీ • జటిలి చేత క్షీణింపఁ
గల దన్న దుర్భీతి • కలుగు కతనఁ

బతి రక్షణ రచించు ♦ వని పతివ్రత ముఖ్య
విధులయంచు బయనమై ♦ వెడలుకతన
నీ వియోగిని చెప్ప ♦ హింసా విచారంబు
నీయాజ్ఞ యని నమ్మ ♦ జేయుకతన
మానవతినయ్యు సాహస ♦ స్త్రీనినాట
దానఁ బాపంబటంచు నేఁ ♦ దెలిసి తెలిసి
చేయుచుంటిని నిన్ను సా ♦ క్షిగను జేసి
తుదకు నన్నేమి చేయ నెం ♦ చెదవొ తల్లి!

గీ. భువనములకెల్లఁ గర్తవు ♦ భోక్త వీవె
కాన నీపంపుఁ జేయుట ♦ కార్యమగును
గరము నాయది తీక్ష్ణ ఖ ♦ డ్గంబు నీది
కార్యమిది యెట్లు లగునొకో ♦ కడకుఁ దల్లి!

గీ. అనుచుఁ గన్నుల నఱమోడ్చి ♦ యంబ కెఱఁగి
మనము పెనువజ్ర తుల్యంబు ♦ గను రచించి
ఖడ్గధారను దనయుని ♦ కంఠలతిక
ధీరయై తన్వి మువ్మారు ♦ తీడి గోసె.

వ. అంత.

ఉ. కన్నులుగానరాక భయ ♦ కంపితయై వెసఁ దల్లడిల్లుచుం
దిన్నఁగఁ జేతులం గనిన ♦ తెన్నున రక్కసియున్న చోటికా
పన్నతఁబోయి తద్రుధిర ♦ పంక విలేపిత ఖడ్గహస్తముల్
మున్నుగ మోడ్చి మ్రొక్కులిడి ♦ భూసురపత్నియనే భయంబునన్.

ఉ. పుట్టినదాది పాపములఁ ♦ బూనిక చేయనిచేతు లివ్వి నే
డిట్టి యసహ్యకృత్యము త్వ ♦ దీప్సితసిద్ధికిఁ గాఁగఁ జేసె నిం
కెట్టి యనుజ్ఞ నిచ్చెదవొ ♦ యిప్పుడు చేతును సంశయంబు లే
నట్టి మనంబుతో; నరక ♦ మెట్టులు తప్పదు నాకు యోగినీ!

చ. అనినఁ గరాళి నవ్వి ♦ యబలా! జయమందితి వింక లేని భీ
తినిఁగొనకమ్మ! కత్తి నిటు ♦ దెచ్చి జలంబులముంచి చేతులం
బనువడ నీరముంగడిగి ♦ స్వర్ణమయంబగు లింగమూర్తినిన్
గొనియిటు తెమ్ము; జాగు వెడ♦గుల్ కలిగించును; లెమ్ము పైనమై.

చ. తనయులఁబంపు నీదుతలి♦దండ్రులయింటికి ముఖ్యమైన సొ
మ్మును మణివస్త్రరూప్యచయ♦ముంగొని వేగ మెరమ్ము, తెల్లవా
రిన శుభ వేళ గాదు, పలు♦రీతుల లోకులు విస్ఫురంగముల్
పొనరుచుచుందు, రెంతవడిఁ ♦ బోయిన యోజనమైన సాగునే?

ఉ. వేగమె శీతశైల తట ♦ విశ్రుతకానన సీమఁజేరి ది
వ్యాగమవేదియైన పతి ♦ ప్రాణభయంబును బాపునప్డు నా
త్యాగముఁ జూతుగాక యిది ♦ తక్కఁగలేదిట కార్యమెద్ది నీ
భోగవిలాససంపదకు ♦ మూల మతండు పతివ్రతామణీ!

గీ. వినుము కలవెన్నొ తొందర ♦ పనులు ముందు
మనకు నిచ్చోటఁ దడయుట ♦ మంచిదగునె?
అమ్మ! ఆలస్య మమృతం వి ♦ షమ్మటనఁగ
వినమె పెద్దలు బోధింప ♦ వెలఁది మున్ను?

వ. అనుచు నాకరాళి మిక్కుటంబుగ నవినీతులు బోధింప విని విని యా లతాంగి తలయూచి యప్పుడు.

గీ. పాపభయమొక్క ప్రక్క వి♦భ్రాంతియొక్క
యెడను బాధింపఁ బూజనా ♦ గృహముఁ జొచ్చి
స్వర్ణశివమూర్తి యుండిన ♦ చందనంపుఁ
బెట్టియకుఁగల తాళముల్ ♦ విప్పుచుండ.

చ. ముని కడువేగవచ్చి తన ♦ ముందువచించినచోట సోమునిం
గనక గృహంబుఁ జేరెనని ♦ కల్పితమౌ నిజశయ్య జాడకున్
వినుత నవీనకంఠరవ ♦ విశ్రుతపక్కిని దల్పు నంగుళీ
ధ్వని వెలయించుచున్ బలు వి♦ధంబుల సోముని బిల్చుచుండగన్.

చ. నవగళశబ్ద విశ్రుతి వినంబడినంతనె యాలతాంగి త
చ్ఛివునటపీడి సీ యనుచు • శిష్యులు పాఠముఁజెప్ప పుత్రునిన్
సవరణఁబిల్చిరంచు గృహాశాలను దాఁటి కవాటపక్షముల్
జవమునలాగి ద్వారమున • సంయమివర్యునిఁజూచి భీతయై.

గీ. వెఱ్ఱిబట్టినరీతిని • వెఱగుపడియు
నిట్టనిలువున నీరయ్యె • నీరజాక్షి
పరుగు పరుగున ముంగిటి • కరిగి దూఁగి
శయ్యపైనున్న దుప్పటి • జారనీడ్చి.

గీ. దీర్ఘనిద్రను గంఠంబు • దెగి పరుండి
యున్న సుకుమారు సోముని • గన్నులారఁ
జూచుకొని బొమ్మములు జొటజొటను వ్రాల
నెత్తిమోదుచు నన్నుఁ దండ్రీ! యటంచు.

చ. పుడమినిఁ దిల్లులెల్లఁ గడుఁ • బున్నపు నోములు నోచి పుత్రులం
బడసి తదీయపత్నులతి • భక్తినిఁజేసెడు సేవలందుచున్
గడు సుఖియింపఁజూచియు నకారణరీతిఁ గిరాతవోలె నేఁ
గొడుకును బుద్ధిమంతు గుణిఁ • గోవిదుఁ గొంతునుగోసి చంపితిన్.

క. కన్నులకు విందుసేసెడు • కడుపుపంట
వంశకర్తను సత్కళా • ప్రకటమూర్తి
నన్ని చదువులు • నేర్చిన యాత్మజాతుఁ
జంపుకొనుపాపి నేఁగాక • జగతి గలదె?

గీ. తలపఁ దానొక్కదానిని • దైవమొకఁటి
తలఁచు ననుమాట భువి నసత్యంబయగునె?
స్వర్ణలింగంబు నల్లన • సంగ్రహింపఁ
దలఁచి జ్యేష్ఠపుత్రుని వధ • సలుపుటయ్యె

చ. పరుల నకారణంబుగను • బట్టి వధింపఁగ బూనునట్టి ము
ష్కరులకు నాత్మనాశనము • గల్గుట సిద్ధము మూషకంబు ని

బ్బరముగ వడ్డపుట్టిఁ యని ♦ పాముల పెట్టెను జీర్చి లోనికిం
బరుగున బోయి భోగి కళంనంబగు చందము నైతి నే నిలన్.

కం. అని యేత్రోవను నెట్టులఁ
జనియెనొ? యమితాశ గతిని ♦ శక్యమె తెలుపన్
గను రెప్ప వాల్చునంతకు
వనజాక్షి కరాళిపాద ♦ వనజములఁ బడెన్.

ఉ. సిద్ధుఁ డటన్న బ్రాంతి నత ♦ నీకుసుమాంగు వధించితిన్ సుతున్
బుద్ధి నశించి యాసుముని ♦ పుంగవుఁ డెచ్చటి కేగెనో ప్రభా
బద్ధశరీరుఁడై యిపుడు ♦ వచ్చి చరించుచునుండె, నోషధీ
సిద్ధులు చావరన్న నుడి ♦ సిద్ధమయయ్యె నిఁకెట్లు లమ్మరో!

ఉ. సన్నిధిఁ గాంచి పోఁగొనిన ♦ బీదవిధంబున సోముఁ జంపుటన్
ఖిన్నత గన్గెఁ బ్రాణపతి, కిం గడుదారము నైతి యోగసం
పన్నుఁడు మానియుం బ్రిదికెఁ ♦ బైఁబడివచ్చె నకీర్తిభూత మే
నన్నివిధంబులం జెడితి ♦ నమ్మరో! నాగతి యేమి యింకిటన్?

గీ. చెలఁగ యీపెద్దకొడుకు సం ♦ జీవితునిగ
ముందుగాఁ జేయు నీప్రజ్ఞఁ ♦ బూనవేని
నేను దగుదంచు నీవెంట ♦ రాను తల్లి!
విడిచెదను బ్రాణపంక్తిని ♦ వేగనిపుడు.

వ. అని వృకావలి జుట్టుముట్టుకొని యాత్మనాథుఁ బరిగ్రహింప నంతాపించు సారంగి చందంబునఁ బాదంబులం బడి పరిదేవనంబు చేయు నాహేమావతిని లే లెమ్మని యూదలించి యాయినుమంత పని కై యింత సంతాపింపవలయునే యని వికటంబుగా హాసంబు సేయుచు సాహసురాలగు నాడుపుట్టువునకు సాధ్యంబుగాని దుండునే యని యామె చెవియం దొక మహామంత్రిం బుపదేశించి ఖడ్గం బొసంగి పంపిన నాకులకాంత యప్పటి కంతకన్న వేరొండు మార్గంబు తేమిని,

తల్లీ! నీపంపు పాపం బైనను బవిత్రింబని చేయుముఁగాక యని, మరలి మునియున్నచోటికి కరుదెంచు నంత.

చ. తలుపు గుభాలునం దెఱచి ♦ తళ్కొకదీప్తినిఁ గాంచి యచ్చటన్
నిలువక పర్వునం జనిన ♦ నీరజనేత్రను గాంచి సంశయా
కులమతి ముందుగాఁ దనకుఁ ♦ గూర్చిన తల్పముఁ జేరి సిద్ధుడం
దుల శయనించె సోముఁడని ♦ తొందరపాటునఁ దప్పి పిల్చినన్.

చ. పలుకఁడు నిద్రపట్టెనని ♦ పచ్చడ మవ్వల కీడ్చి నెత్తురుల్
పలపల కారుచుండ మెయి ♦ బాసిన కంఠముఁ గాంచి డిగ్గునన్
నిలిచి నభస్స్థలంబునకు ♦ నిట్టగఁ జేతుల నెత్తి హా హరా!
తులువలు నేనటంచితని ♦ ద్రుంచిరి, కుఱ్ఱను బాసెనే కటా!

ఉ. పాఱుని ముద్దుకుర్రనిలు ♦ పాపము నెంచక చంపియున్న యా
క్రూరులు నన్నుఁబట్టుకొని ♦ గొంతునుగోసిన నాకు మేలు చే
కూఱునటందు నీపదమె ♦ కోరుచుఁ గాయముఁ బాయునట్టి వి
స్తారసుఖంబెకాని యయ ♦ శస్స్థితి కల్గఁగఁ జేసితే ప్రభూ!

వ. అని పలువిధముల ధరణీసురకుమారు మృతికి సకరుణం బుగాఁ బురహారుఁ గూర్చి పరిదేవనంబుఁ జేయుచున్న నా యోగపురుషునిసమీపంబున కా ద్విజసువాసిని యతిసాహసంబునం జనుదెంచి తన చేతనున్న ఖడ్గంబు మునిముందటం బడవైచి శిరోజంబులు విరియ ధూళిధూసరితాంగియై మిన్నుముట్టెడి భయస్వనంబున ముఖతాడనంబుఁ గావించుకొనుచు 'రక్కసుండగు నీమునిహాతకుండు కపటోపాయంబున నాపతి నడవికంపించి నన్ను నాధనంబును నపహరింపఁ దలచి సోమకుమారునిఁ బట్టి వధించుచున్నవాఁ డక్కటక్కటా! యింత యన్యాయం బుండునే? నేనింత దిక్కుమాలిన యనాథనై తిఁగదా యని యుచ్చైస్స్వనంబున రోదనంబు గావించుచున్నంత.

గీ. ఊరి వారెల్లఁ బరుగునఁ ♦ జేరవచ్చి
యద్భుతంబు విషాదంబు ♦ నందుచుండి

రెంత యన్యాయమిదియంచుఁ • జింత మునిఁగి
యున్న హేమావతినిఁజూచి • యుస్సురనుచు.

ఉ. కత్తిని ముందువైచియు న • కారణరీతిని నేడ్పుచున్నయా
బిత్తరిఁ గాంచి తాఁ బయిని • వేయఁగడంగెను నింద యక్కటా!
నెత్తికినెక్కె జ్యేష్ఠ, కను • నీచగుణంబున కాస్పదంబునై
చిత్తము క్రూరబోధనలఁ • జిక్కెను సాధ్వికి నేమిచెప్పుదున్.

చ. పరమతిఁజిక్కు నీయువిద • పద్ధతిఁ గూర్చి నిజంబుచెప్పినం
దిరముగ నమ్మువారెవరు • దిట్టగఁజేసియుఁ జేయనట్టు లీ
నరహంతకుండు చెప్పునని • నప్పుడు రంతియకాక లాభమే
మరయఁగలేదు నే జరుగు • నట్టిది చూచుచునుందు మౌనినై.

ఉ. ఈసతిఁ దెల్పు వార్తవిని • యీపురినేలు విభుండు న్యాయవి
న్యాసము గాంచలేక వడి • నాదగు కంఠముఁ ద్రుంప నాజ్ఞ త
ద్దాసుల కిచ్చుఁగాక మఱిఁ • దత్తఱమందకయుందు నిట్టిస
న్న్యాసిమృతింపఁగాఁ గొఱత•యానొకొ! బ్రాహ్మణబాలుఁడేచనన్.

సీ. పుట్టినప్పటినుండియు • భూరిదుఃఖ
ములకుఁ బుట్టినిల్లైన యీ • భూమిసురుఁడు
న్యాయవిధిహీన రాజుచే • నపయశంబు
గడప మృతినొందుకంటె భా•గ్యంబుగలదె?

గీ. తోఁటనుండి కరాళి యీ •దుఃఖకార్య
మును రచించెను సందేహ•మును గొనంగఁ
బనియులే దిప్పు డావార్త • బయలు పఱుప
రాదు పరువెత్తు నేఁడు క•రాళి యటుల.

గీ. నేఁ దెలియ నట్టులనె యుండి • నీవె చంపి
తంచు నన్నెవ్వరడిగిన • నౌనటంచుఁ
బలుకు చుండెదఁ దనగుట్టు • బయటికేమి
వెళ్ళదనుచుఁ గరాళి కో•న్నాళ్ళునిలుచు.

గీ. సకల బ్రహ్మాండములనేలు ♦ శర్వుఁ డజుఁడు
వజ్రినాథుని నిచటికిఁ♦బంపెనేనిఁ
బుత్త్రిఁ బ్రదికించి పతికిఁ జ♦రిత్రిఁ దెలిపి
మొగమున నలదుదుఁ గ్రాళిఁ ♦ బూది నేసి.

వ. అని మనంబున యోగానందుండు నిశ్చయించుకొని యెవ్వ రేమి యనినను బల్కరింపక నేలఁ జూచుచు మనంబున శివధ్యానంబు సేయుచు మౌనముద్రఁ దాల్చి యున్నంత నుషఃకాలం బగుటయు

గీ. కర్మసాక్షి నై యిటువంటి ♦ కార్య మవని
పతికి నెఱిఁగింప కుండుట ♦ భావ్య మగునె?
యనుచుఁ జనుదెంచనో యన♦నతి విభా స్తిఁ
దపనుఁ డుదయించె వేగ ను♦దయ శిఖరికి.

గీ. తెల్లవాఱె నటంచును ♦ నెల్లవారు
గుంపులై వచ్చి పోవ నా ♦ గోలఁ జూచి
నృపతియాజ్ఞఁ గైకొని భటుల్ ♦ నెలఁతమాట
తథ్యమని పట్టుకొనియు నా ♦ తపసివరుని.

సీ. క్షితిపాలు ముందట ♦ నతివేగఁ గొంపోయి
కట్టియుంచిన రుక్మ♦కాంతు డపుడు
మతిమంతుఁ డగు తన ♦ మంత్రినిఁ బిలిపించి
యిందలి సత్యంబు ♦ నెఱుఁగు మనుచుఁ
పెద్దలై తగుధర్మ ♦ వేత్తల రావించి
సతినిఁ దత్సుతుని భా♦స్కరునిఁ బిలిచి
వివిధ సామంతులు ♦ వినతులై కొలువంగ
సింహాసనంబునఁ ♦ జేరియుండి

గీ. తీక్ష్ణ ఖడ్గంబుతోఁ గూడఁ ♦ దెగిన సోము
కంఠము శరీరమును గని♦కరము దోఁప

సభ్యతతి ముందు పెట్టించి సత్యమంత
నేఁట పలుపంగ లేఁడయ్యె • ధీరుఁడయ్యె.

సీ. ధీరుఁడౌ తపసి భ • క్తిజ్ఞాన వైరాగ్య
నిరత సదాచార • నియతి నెఱిఁగి
పరమ పాతివ్రత్య • భరితయౌ నిజపత్ని
సూనృతవ్రత మనః • శ్శుద్ధి నెఱిఁగి
నిరతంబు యజమాన • నిత్య యత్నోవ్రత
చిరకాంక్షితంబైన • చిత్తమెఱిఁగి
గుణవంతుఁ డగుసోము • గురుతర వినయాది
సుగుణ సంపత్తి వి • శ్రుతి నెఱింగి

గీ. సతత విశ్రుత శాస్త్రార్థ • సత్కృతార్థ
మైన తద్గృహపుణ్య వి • ధాన మెఱిఁగి
నృపతి తన సభయందు దిద్ది • నిజమటంచు
నేర్పఱుప లేఁడ యితరుల • కేమి తెలియు?

గీ. చంపితేమయ్యె? సుతుని నో • సంయమి యన
నిజము నిజమన్న మాటయే • నిగిడి పలుకు
సాక్షి నాకేల యనుచును • సాగిపలుకు
యోగనిష్ఠుండు లోన నేం • దో? తలంచు.

వ. ఇట్లు మాణిక్య పురాధినాథుండగు రుక్మకాంతుండు సత్యాసత్య విచారంబు నేర్పరుపఁ జాలక యున్న సమయంబున; నచ్చట దుహినగరి పరిసరంబున సుశీలయాశ్రమంబున వజ్రనాభుండు సుఖంబునఁ గాలంబుగడపుచు గృహారామ పుత్రమిత్ర కళత్రాదులఁ జూడఁ గోరి నిర్గమనోన్ముఖుండై కరయుగంబు మోడ్చి పరోపకార శీలయగు నాసుశీల కిట్లనియె.

మ. సతినిం బుత్రుల నాప్తబాంధవుల నే • సంతోష మువ్పొంగ స
మ్మతిఁ జూడంగ ననుజ్ఞ నిచ్చి యిఁకఁ బం • పన్ రాదె మాసంబు స

ఖ్యాతమం దొప్పఁగ నేగె నుంగరము వే♦డ్కన్ నాకు నిప్పింపు నే
గృతకృత్యుండ నటంచు నేఁగెద మదీ ♦ యేచ్ఛా ప్రకారంబునన్.

గీ. తవిలి సౌభాగ్యలతిక సం♦దర్శనంబు
చేయు భాగ్యం బదెప్పుడు ♦ చేరు నాకు
ననుచు బ్రీతిమాలుకొనుచున్న ♦ యవనిసురుని
రమ్మటంచును దా నేఁగి ♦ రయము మీఱ.

వ. ఇట్లా వియోగిని వజ్రనాభుని నొక్కచో నుండ నియమించి ముందు నేనేగి యాదేవితో నీ వచ్చు వార్త విన్నవించెద నవసరం బైనచో భవత్సంకేతార్థంబుగా నొక్క శంఖా రావంబు గావించెద. అది విని రావలయు నని పలికి సుశీల చనిన యనంతరం బొక్క ముహూర్తకాలంబునకు శ్రవణసుఖంబగు నొక్క శంఖా రావంబు వినవచ్చుటయు భూసురుండు గృహద్వారంబుఁ బ్రవేశించి యచట నొక తేజోరాశియగు వ్యక్తిం గాంచి సౌభాగ్యలతికా మహాదేవి యామెయగుట మనంబున నిశ్చయించుకొని సాష్టాంగంబుగ నమస్కరించి ధ్యానించి నిలిచి చేతులు ముకుళించికొని తన చరిత్రంబంతయు నవిస్తరంబుగా నెఱింగించి తన సిద్ధాంగుళీయకంబుఁ గటాక్షించి యిప్పింప వలయునని వేడుకొనిన నా గృహస్థున కద్దేవి యిట్లనియె.

సీ. పృథివీసుర జ్యేష్ఠ ♦ వింటి నీ చరితంబు
నంతయు మదిగల్గె ♦ నంత మిగుల
మాణిక్యపురి నీదు ♦ మందిరంబున నున్న
సిద్ధుని చరితంబు ♦ చెలఁగి నీవు
మాసుశీలకుఁ జెప్ప ♦ మతిమంతురాలైన
యది వచ్చి నాతోడ♦నప్పుడపుడు
వినఁజెప్ప నతఁడు మా♦ప్రియ బాంధవుం డగు
నాతిధ్యమున నీవు ♦ నతని నలరఁ

గీ. జేసితివటన్న నీవు మా ♦ స్నేహితుండ
వతని నిచ్చోటికిని వచ్చునట్లు♦ నేయు

టరయు ముఖ్యంబటంచు ని ♦ న్ననుసరించి
వచ్చునట్లు సుశీల నేఁ ♦ బంపఁగలను.

ఆ. వె. ఆసుశీలదేవి ♦ కంగుళ్యమణి నిచ్చి
పంపుదాన నదియు ♦ బజ్జ వచ్చె
నేని నొరులబాధ ♦ లెనయక నీయింటఁ
జేరఁగలవు పొమ్ము ♦ శీఘ్రగతిని

చ. అని సెలవీయఁ గైకొని ధ♦రామరుఁ డప్పుడు దేవి చిత్తమం
చును మరివెన్కకుఁ మరలి ♦ శోభిలుచున్న గుహాప్రదేశ మం
దునఁ గడు దేజరిల్లు నల ♦ యోగ్యాలి దివ్యతనూవిలాసముం
గనుఁగొని యబ్బురం బొదువఁ♦గ్రమ్మఱి ముందటిచోటఁ జేరితాఁ

ఉ. చేఁగనుచుండఁ దగ్గుహ వి♦సర్మలబుద్ధి సుశీల చేరుటల్
బాగుగ నివ్వెఱందరిగెఁ ♦ బట్టుఱుఁ జూచినఁ గానరాదు తా
నీగుహనున్న దేవియగు ♦ నీ? తలఁపక మరికాదు తన్మహా
దోగ్యగ విధాన సంగతిని♦యుక్తగనై చనబోలుఁ గానకుఁ

వ. అని వితర్కింపుచుఁ దన యెప్పటి నెలవునకు వచ్చి యంత కుమున్న వచ్చి యచ్చోటఁ దన యాగమనంబున కెదురు చూచు చున్న సుశీలాదేవిం గాంచి యత్యంత విస్మయంబంది, తాపసీ! నేన మ్మహాదేవి సందర్శనంబునకు వచ్చునపుడా దేవి నన్నొక్క కార్యా ర్థంబు తన దేశికురాలి యాశ్రమంబునకుఁ బంప నేనాపని నెరవేర్చు కొని వచ్చునంతకు నీతోడ మాదేవియే కొంత సంభాషణం బొనరిం చుచుండుటం గాంచి తదాజ్ఞ గైకొనక యందుఁ బ్రవేశింప రామి నిచ్చోట వసించి భవదాగమనంబు నిరీక్షించుచుంటి, నని పలికి యూర కున్న నద్ధరణీసురవరుం డా జటాధారిణితో నిట్లనియె.

మ. జననీ! నీపరమాదరంబున మన ♦ శ్శాంతంబు ప్రాపించె స
న్మునిసేవ్యంబగు తీర్థశైలవన సం ♦ దోహావలోకంబు గ

గైను ధన్యత్వముఁ జెందె జన్మము నడంగెం బాపపుంజంబులున్
వనితం బుత్త్రులఁ జూడ రేపె చన నాజ్ఞం జేసె నీతోడుతన్

ఉ. తల్లి! మదీయమైన సుకృతంబుల కన్నిటికన్న మిన్నయై
చెల్లిన కార్యమొక్కటి రచింప ననుజ్ఞ యొసంగె దేవి నీ
వెల్లి సుశీల వెంటగొని యేగుము సిద్ధతపఃఫలంబు శో
భిల్లఁగ నుంగరంబు కడవ్రేలికి దాల్చి యటంచు సత్కృపన్

ఉ. యోగిని ప్రాణదాత్రి మహి మోజ్జ్వల చారుశరీర సత్కృపా
త్యాగ గుణప్రశస్త ననుఁ దల్లిగఁ బ్రోచిన పుణ్యసాధ్వి ధీ
సాగర దేవి పంపునఁ బ్రసన్నత నా వెనువెంట నింటికిన్
రాఁగలదంట నాసుకృతరాశి ఫలించును రేపు పక్వమై

గీ. నిన్ను మాసిద్ధు నొకచోట నియతిఁ జేర్చి
యాలు బిడ్డలతోఁ గూడి యర్చనంబు
జేసి యాతిథ్యమిడు భాగ్యసిద్ధిఁ రేపు
గలుగు నాయింట నెంతటి ఘనసుకృతమొ?

కం. కాన నుమాపతి తొలుతం
బూని మహాకష్టములను బొసఁగించి తుదన్
దానొసఁగు సుఖము దుఃఖ
స్యానంతర మఖిలసౌఖ్య మనునుడి కిరవై

సీ. ఒకపక్షమునఁ జంద్రున కొసంగి కార్శ్యంబు
చేయఁడే సత్కళా స్థితిని మఱల
నొక మాసమున మోడు లోఁగఁ జేసి తరువులఁ
బొందింపఁడే తిర్గి పుష్పవితతి
ఒకవేళ నదనదీ నికరంబు లెండించి
నిండింపఁడే వానిని మహోకతతి
ఒకయేటఁ జేసి ని* రుద్యోగిగా నాత్మఁ
బ్రకటింపఁడే మహత్త్వంబు తిరిగి

గీ. సకల జగములు త్రుటిలోన ♦ సగుణ నిర్గు
ణత్వ మొనఁగఁజేయు చిత్కళా♦నందమూర్తి
తొలుత దుఃఖంబుఁ గూర్చి సం ♦ తోష మిపుడు
కలుగఁజేయుట చిత్రమే? ♦ కరుణఁజూచి

వ. కావున భవత్ప్రయాణం బెల్లి యవశ్యకర్తవ్యంబని విన్నవించిన నాభూసురమౌళికి సుశీల యిట్లనియె.

చ. తమగృహమం దున్న సన్ముని ♦ తథ్యముగా నిజభర్తయంచుఁ దా
మమత దలిర్ప మీపురికి ♦ మున్నన నన్ను నుపాంగఁ బూనె నా
కమలదళాక్షి యాతఁ డటు ♦ గాసియొదర్ వృథయౌనుగాదె నా
శ్రమగొను టెల్ల నుండునె తిరంబుగ నొక్కయెడర్ మహాత్ముఁడై?

కం. మనమేగుదాఁక నీగృహ
మున నుండునె యతఁడు నీవు ♦ మును నాతోడన్
వినిపించి నట్టి తత్కథ
లనుమానము లేనియట్టి ♦ వని ద్విజవర్యా!

వ. అని యనేక విషయంబుల సిద్ధునిం గూర్చి విచారించు నాసుశీలతో మహీసురుండు, తాపసీ! నీకింత సంశయం బేల? నినుఁబోటి మహనీయురాలితో నసత్యంబు లాడుదునే? నిక్కంబుగ మాయింట నున్న సిద్ధపుంగవుని చరిత్రంబును సౌభాగ్యలతికా మహిదేవీ చరిత్రంబును విన్నతోడనే యెట్టివారికైన వారిద్దరును దంపతులనుట పయింబయిఁ దోఁచుచుండు. ఇదికాక వారిరుపురి దేశ గ్రామ నామంబు లొక్కపేర నొప్పియుండుటచేఁ గడమ సంశయం బెల్ల నివారణంబగుచుండు. ఇంకఁ దడవేల? సత్వరంబుగఁ బయనంబు సిద్ధంబు గావింపు మనిన మంచిదనుచు సుశీల, మా దేవికిం జెప్పి మొక్కివత్తు, నని తద్గృహద్వారంబుఁ బ్రవేశించి ప్రిపఁబుట్ట బుజంబునఁ దగిలించుకొని తద్రిసాంగుళీయకంబు ధరియించి వచ్చిన వారిద్దరును నొక్క శుభలగ్నంబునఁ బశుపతి నారాధించి వన దేవతల కెల్ల మొక్కులిడి సమీపా

శ్రీమ మునిముఖ్యులకెల్ల బోయివత్తునని చెప్పి వారల వీడ్కొని యనతిదూరంబుననున్న యొక్క రమ్య సరోవరంబు తీరంబునకు నిర్గమనంబుఁ గావించి యిష్టాగోష్ఠీకథనంబుల నారాత్రి సుఖయామంబు గావించి, మరునాఁ డుషఃకాలమున శుచిస్నాతులై కాల్యంబులు దీర్చి సిద్ధాంగుళీయకంబు ధరియించి దక్షిణాదిశాభిముఖులై పరస్పర హస్తాకర్షణంబులు గావించి జయ పరమేశ్వరా యని పరమహంసంబుల చందంబున గగనంబున కుద్గమించి వైమానిక మార్గగాములై యతిశీఘ్రంబున మాణిక్య నగరోపకంఠంబున భూమికిం దిగి పురంబుం బ్రవేశించి రాజమార్గంబునా నిజగృహసందర్శనా కాంక్షులై యతివేగంబున నరుగుచుండి.

కం. రాజగృహస్థలి ముందటి
బాజారున గుంపులైన ♦ ప్రజలను చింతా
భాజనులను గాంచి విధి ని
యోజితులై వారలిరువు ♦ రొగిచని కాంచన్.

ఉ. న్యాయము దీర్పలేక నర ♦ నాథుఁడు యోగి కిరాతుఁడంచు న
న్యాయ విచారుఁడై యతని ♦ నాశుగఁ గంఠముఁద్రుంప నాజ్ఞఁదా
జేయఁగఁ దద్భటోత్తములు ♦ చెచ్చెరఁ దా మురికంబమందు దు
ర్జేయుఁడటంచెటుంగక యు ♦ ర్చిరి♦ యోగిని నిర్దయాత్ములై.

వ. అంత నా భటులతర్జన భర్జనంబు లాలకించి గృహస్థుండు దుస్సహ వేదనా దూయమాన మానసుండై యప్పుడు

సీ. సుతవియోగార్తిచే ♦ శోకించి స్రుక్కిన
పరమసాధ్వీమణిఁ ♦ బత్నిఁ గాంచి
యురికంబమునఁ బ్రాణ ♦ ముండ దింక నటంచుఁ
శివునాత్మ స్మరియించు ♦ సిద్ధుఁ గాంచి
కంఠంబు ఛిన్నమై ♦ కట! కటా! మహినున్న
సుకుమారుఁడగు పుత్రు ♦ ముకముఁగాంచి

జనకుండు భ్రాంతియు • సమసి రంచుఁ దలంచు
పరితాప మొందు భాస్కరునిఁ గాంచి
గీ. పదిజనంబులు పదినోళ్ళఁ • బలుకుచుండ
రచ్చపాలైన తన యింటి•మచ్చఁ గాంచి
కలుషహార! శంకరా! యెట్టి • కష్టమనుచు
భూమిపైఁ దెళ్లె ద్విజుఁ డంత • మూర్ఛమునిఁగి
వ. అంత.
కం. జటినీమణి యీ యద్భుత
మటనున్న జనంబువలన • నంతయు విని యు
త్కటసంభ్రమాకులత నం
తటఁ జని యా రాజుఁ గాంచి • తడయక పలికెన్.
మ. నరనాథోత్తమ! యేర్పఱించితివిగా • న్యాయంబు చాల్పాలు నీ
పొరపాటెంతయుఁ గాంచలేవు విడుమీ•పుణ్యాత్ము మానింద్రనిం
దరుపెద్దల్ భవదీయసత్సభ వసిం • చంగల్గి ధీమంతమా
వరమంత్రాంగముగల్గి యిట్టులఁ బ్రజా•ప్రాణంబులం దీయుదే?
గీ. అనపరాధిని నపరాధి • నరయ లేక
నొసఁగెదవు చాల నురిశిక్ష • యుత్తములకు
రాజపద మిందుకొఱకె మా•ర్గాలలీల
మూఢక ప్రాణహరణమై • పొసఁగుచుండు.
గీ. నిలుపుమీ దండనం బిదు • సెలవు నాకుఁ
దెలిసి మఱవచ్చి నీకెల్లఁ • దెలుపఁగలను
నొక్క ఘటికాద్వయంబు మా • యొక్క తెల్విఁ
గాంచు మన రాజు సం[illegible]ష • కలితుఁడగుచు.
వ. దేవీ! నీచెప్పినట్లు చేయఁగలవాఁడ. నీబుద్ధి కుశలత్వం బిందుఁ బ్రదర్శించుచు మమ్మానందింపజేయుమని వేడుకొని యా సిద్ధపుంగవు విడిపించి వజ్రనాభునిఁ దత్సతీసుత సహితంబుగా నొక్క

చోటఁ గాఁపు వెట్టించి సోముని కళేబరంబుఁ గాపాడుచుండఁ దగు వారల నియమించి తాను బ్రధానామాత్య దండనాయక సామంత విద్వజ్జన పరివేష్టితుండై నిండుకొలువుండియుండ నా రుక్మాంగుని యాస్థానంబున నొక్క ముహూర్తకాలంబునకుఁ దప్పకవచ్చి, భూపతీ! యిందలి సత్యాసత్యంబులెల్ల నే నెఱింగితిని. సవిస్తరంబుగ విన్నవింతు వినుమని సభవారెల్ల విస్మయచిత్తులై చిత్తరువుల చందంబున నిరుత్తరులై చూచుచుండ మృదుమధుర గంభీర స్వనంబున నిట్లని చెప్పం దొడంగె.

సీ. అధిప! యీ సిద్ధుండు ♦ హైమాద్రితటసీమ
వసియించి శంకరు ♦ పరమకృపను
ఉంగరంబును స్వర్ణ ♦ లింగంబు నార్జించి
నిత్యంబు తీర్థసం♦సేవఁ దొలఁగ
రక్కసియొకతె క♦రాళయన్ బేరిది
వంచించి యతని న ♦ మ్మించి తెచ్చి
శాక్తేయులకు బలి ♦ సల్ప నందీయ వా
రర్ధరాత్రము కాళి ♦ కర్పణంబు
గీ. చేయఁబూనుచో నేనొక్క ♦ సిద్ధు కరుణఁ
బడసినట్టి యాశంఖ శ♦బ్దంబువలన
వారి కృత్యమంత నెఱింగి♦వచ్చి ఖలులఁ
జంపి, మాసీందు్రి విడిపించి ♦ పంపియుంటి

కం. మాయాశ్రమమున నిలుమని
చేయెత్తి నమస్కరించి ♦ చెప్పిన సరకుం
జేయక యచ్చో విడివడి
ధీయుతుఁడై జనపదములః ♦ దిరుగుచునుండన్

కం. అప్పుడు నాచే మృతి నటఁ
దప్పి కరాళియు జటీంద్రు ♦ తపసీయశివుం

డెప్పుడు నాచేఁబడు నని
చెప్పుడుగాకుండ నతని ♦ సరసనె వచ్చున్
గీ. వజ్రనాభుని యింట నీ ♦ వర మునీంద్రుఁ
డుండు సమయంబు వేచి తా ♦ నుండె నగర
బాహ్యసీమను వెలుగు భ♦వాని గుడిని
సర్వభూతుక భూతియు ♦ జడలు దాల్చ
గీ. దైవవిధిఁ దీర్థయాత్రలు ♦ తా రచింప
సమయమిది యంచు సిద్ధుని♦సంచినున్న
యుంగరంబు ధరించి యా ♦ యుర్వీసురుఁడు
దివ్యహిమశైల తటమునఁ ♦ దిరుగుచుండి
గీ. విధివశంబున వచ్చిన ♦ వెతలు గొన్ని
తప్పఁగొని తీర్థయాత్రా వి♦ధాన మెల్లఁ
దీర్చుకొని వచ్చి కుశలియై ♦ ధీరబుద్ధి
నస్మదాశ్రమ వనసీమ♦యందు నిలిచె
కం. సతియగు హేమావతి తన
పతివార్త వినంగరామిఁ ♦ బటుతరచింతా
యతమతియై చనియెను బా
ర్వతిగుడికిన్ దేవి కెరగి ♦ ప్రార్థింపంగన్

వ. అట్టి పరమసాధ్వీమణి యగు హేమావతి తనకుల దేవత యగు భవానినిఁ బ్రార్థించుచుండుతఱిఁ గరాళియుఁ దద్గర్భాలయంబున నొక్కచో డాఁగియుండి ప్రత్యక్షంబగు భవాని చందంబునఁ గరుణారసంపుమాటలు వెదజల్లుచు నీయింటనున్న మునిహాతకుండు నీపతిం గపటంబుగా నడవుల కంపించి నిన్ను నీతనయుల ధనయుక్తంబుగా నపహరింపఁ దలఁచి గోముఖ వ్యాఘ్రంబు చందంబున నున్నవాఁ డతనిఁ జంపితేని నీకార్యంబులన్నియుఁ జక్కఁబడు, నిన్ను నీపతి సన్నిధిఁ జేర్పుటకు బుద్ధిమంతురాలగు దూతిక నంపుదు, నది చెప్పినట్లు వర్తింపు

పొమ్మని పంచిన మహాప్రసాదంబని దేవి కరుణారసంబు నేటికి నాపయిఁ బ్రవహించెఁగదాయని నమస్కార సహస్రంబు లర్పించుచు నింటికివచ్చి మఱునాఁ డుదయంబున దేవి పంపున వచ్చితినని కోటం బ్రవేశించిన కరాళినిఁ బూజించుచుఁ దన్నియోగంబున సిద్ధునిగొంతుఁ గోయ్యఁ దలంచునంత దైవవశంబున నతండు దప్పి జనుచే సోముండు నిహతుండుగాఁగ నది తెలిసి పరితపించుచుఁ గరాళి యుపదేశంబునఁ దన యపయశంబుఁ బాఁపుకొనుటకై హేమావతి తన కుమారుని మునివధించెనని ప్రకటించె; నట్టి క్రూరరాక్షసి యైన పిశాచి బ్రహ్మఘ్ని విప్రగృహోపవనంబున నొక్క పర్ణకుటీరంబున నున్నయది. దాని ముందుగా నిచ్చటికిఁ దెప్పించినఁ దమకు నెల్లయుం దేటపడు నని చెప్పి, నేనిట్టి విశేషంబు మద్గురు కటాక్షంబున సంపాదించిన జ్ఞానవేదియను శంఖప్రభావంబునఁ దెలిసికొని మీకెల్లరకు విన్నవించితినని చెప్పి ధర్మ శీలయగు నా సుశీల శివధ్యానంబుఁ గావించుచు నూరకున్నంత.

ఆ. వె. ఆసుశీల చెప్పి ♦ నట్టి సర్వము విని
తనదుపట్టు నయుట ♦ దన రెసనుచు
ధరణిసురునిపత్ని ♦ తల్లడిల్లుచు భూమి
పైనిఁబడియె మూర్ఛ ♦ వచ్చినట్లు.

శా. రాజన్యుండవు డబ్బురంబొదవ దా ♦ రావించి సేనానినిం
దేజంబొప్పఁ గరాళి నిచ్చటికిఁ దో ♦ డ్తెమ్మన్న నాఁడేగి త
ద్రాజాజ్ఞన్ వినిపించి బంధముల నా ♦ రాకాసినింగట్టి వి
భ్రాజద్విద్వదగణ్యమౌ నృపసభా ♦ ప్రాంతంబునం బెట్టినన్.

చ. నృపతి తదీయమౌకుటిల ♦ నిష్ఠుర వక్రదృగాస్యయాన ధీ
చపలతలన్ సమస్తముఁ గు♦శాగ్రమతిం దిలకించి నిక్క మిం
తపనికి నిద్ది సూత్రమని ♦ నమ్మె సెబాసనె దత్సభాంతరం
బునఁగల పెద్దలట్టులనె ♦ బుద్ధిఁదలంచి దానిఁ జూపుచున్.

చ. కుమతి కరాళి యానృపతి ♦ గొప్పసభం దిలకించి యచ్చటన్
విమలమనస్కుఁడై పడిన ♦ విప్రగృహస్థుఁ జూచి మున్ను తా
హిమగిరిఁ జూచివచ్చిన య♦హీనగుణాఢ్య సుశీలఁ గాంచి నే
సమయుట నిక్కమింక నని ♦ చచ్చినరీతిఁ బఱుండె భూమిపై.

గీ. కొసరిపిలిచినఁ బలుకఁడు ♦ ముసరికొనిన
ప్రజలదిక్కును జూడడు ♦ భయముచేత
వంచిన శిరంబునెత్తడు ♦ వంచకులకుఁ
గలుగు కష్టంబు లిట్టివి ♦ కడకు జగతి.

గీ. అఖిల జనములు బ్రహ్మహత్యం ♦ డనినఁగాని
అవని పతియాజ్ఞ భటులీడ్చు ♦ నపుడుగాని
అధిపుఁ డురిదండనంబిడి ♦ నపుడుగాని
యించుకైనను సిద్ధుండు ♦ కించఁగొనఁడు.

కం. హితు లహితులైన లేమిఁ
సతి తనయులు దూరమైన ♦ నలుపని చేఁతల్
మతినమ్మ నృపతి కొట్టిన
మతిమంతుఁడు సహజధృతిని ♦ మానునె? యెపుడున్

వ. ఆసమయంబున

సీ. పరబుద్ధిఁ జేసి నేఁ ♦ బట్టిని వధియించి
పాపినైతి నటంచుఁ ♦ బణతికుంగఁ
బుత్త్రిఁ డీవిధిఁజెంద ♦ భూమినిఁ దలయెత్తి
మనుదునేయని యజ ♦ మానుఁ డేడ్వ
ననుఁగూర్చి సోముండు ♦ జననిచే హతుఁడయ్యె
నని మాని యుపకీర్తి ♦ కిని గలంగ
నీనాఁడె క్షేత్రజ్ఞనా ♦ కేఁడులు నూరంచు
బ్రహ్మఘ్నుమైన ♦ కరాళి వనర

గీ. అగ్రజుఁడు నన్ను నిఁకఁ బిల్వఁ ♦ డంచు భాస్క
రుండు దుఃఖింపఁ జూచుచు ♦ నుండి నృపతి
యధిక సంశయావిష్టుఁడై ♦ యందు నెవరి
నేమిచేయంగలేక యి ♦ ట్లనియె సభను.

గీ. తల్లి! యోగిని యిందెద్ది ♦ ధర్మమనుచు
నమ్మ యిప్పింతు నురిదండ ♦ నంబు మరల
నేమితోఁచదు నామది ♦ నిందు నీవు
చెప్పినట్టులఁ జేతు నీ ♦ చిత్తమింక.

వ. అని సవినయంబుగ నిండు సభయందుఁ బలికిన నృపతి సంశయంబుఁ బాఁపందలంచి సత్యశీలయగు నాసుశీల యిట్లనియె.

గీ. నృపతిచంద్రమ! నామాట ♦ నిజము నిజము
అనృత మెన్నండుఁ బలుక నాఁ♦వంతయైన
భూమిపతినీవు నొకసాక్షి ♦ నామనంబు
శంకరుండును నీభూత ♦ చయము సాక్షి.

వ. అని యీప్రకారంబున సత్య నిర్వాహణశీలయగు నాసుశీల నిష్సాక్షికంబును దైవసాక్షికంబును దైవసాక్షికంబగు సూనృత ప్రతిజ్ఞనొనర్చి యూరకున్న ధర్మశాస్త్ర విచారణ ధురంధరులగు సభ్యులెల్లరుఁ బరమాద్భుతంబుల నేమియుఁ బలుక నేరక చూచుచుండ వింజమాకొన్న భంగి నారాజ సభాభవనం బెల్ల నిశ్శబ్దంబై యుండు నప్పుడు.

సీ. కోమలానన లస ♦ త్కుంకుమం బొక వంక
నొక వంక వరభస్మ ♦ నికర రేఖ
లలితమౌ కుటిలకుం♦తలపంక్తి యొకయోర
నొకయోర శశికళా ♦ యుత శిరంబు
నవరత్నరచిత హా♦రవితాన మొకచెంత
నొకచెంత భోగి భూ♦షోత్కరంబు
జిగిపసిండిమెరుంగు ♦ చేలంబు నొకయెడ
నొకయెడ శార్దూల ♦ ప్రకటచర్మ

గీ. మమరఁ బురుషుఁడో కాంతయో ♦ యనుచు నఖిల
జనము లత్తెత్తి చూడఁ దే♦జఃప్రకాండ
మిలయు సభమును మిరుమిట్లు ♦ గొలుప నొక్క
దివ్యరూపంబ యచ్చోట ♦ దిగుచునుండె.

సీ. ఘుమ ఘుమార్భటి దిశల్ ♦ ఘూర్ణిల్ల సురధునీ
కల్లోలముల చల్ల ♦ గాడ్పులెనయ
దాక్షాయణి ప్రేమ ♦ దాక్షిణ్యసుకటాక్ష
వీక్షణాంచిత శుభ్ర ♦ వక్ష మమర

తరుణేందుకిరణ ని♦స్సర దచ్ఛ రుచిమంద
హాసంబుతోడ స్నే♦హంబు సలుప
వివిధాగమాధార ♦ వీవని తెల్పెడు
ప్రమథసన్నుత జగ♦త్ప్రభుత తెలియ

గీ. సకల గీర్వాణ గణ శిర ♦ నికరమకుట
వజ్రసంఘాతదీప్త శుం♦భత్పదాబ్జ
యుగ సమాశ్రిత బ్రహ్మాది ♦ యోగియైన
యంబికాపతి ప్రత్యక్ష♦మయ్యె నపుడు.

గీ. ఇట్లు ప్రత్యక్షమైన బా♦లేందుమౌళిఁ
గాంచి యానందవివశులై ♦ కదలకుండ
నుండిరట సభ్యు లవనీశ్వ♦రుండు మ్రొక్కి
భక్తి నిట్లని వినుతించెఁ ♦ బ్రమథపతిని

సీ. పంచాక్షరీ దివ్య ♦ భవనాగ్రసంచార!
ఓంకారపీఠ స♦ముజ్జ్వలాంగ!
బ్రహ్మాండ రత్నగో♦పన హేమసంపుట!
జగదాళివిజ్ఞాన ♦ జనకసూత్ర!
బాలేందు కుసుమ లీ♦లా లంకృతజూట!
విద్యుత్ప్రియాకార! ♦ హృద్యనేత్ర!
ఆసత్యరస పరి♦వ్యాప్త శాంతాకార!
ఆదిమధ్యాంత శూ♦న్యప్రచార!

గీ. ఢమరుకధ్వని విభ్రమ♦ఢాకినీము
ఖర మహాభూత భేతాళ♦గణ మహీ జ
లాగ్ని మరు దభ్ర రవి శశి♦యాజకాది
మూర్తియుత! శర్వ! సర్వజ్ఞ! ♦ మునిహృదాఢ్య.

ఉ. దక్షసుతా హృదబ్జదళ♦ధామనిధీ! పిశితాశనాన్వయా
ధ్యక్షవిరోధి! క్రూరగజ♦దానవభేది! సరోజనాభసం
రక్షణ కార్యమోది! ముని♦రంజన సత్కరుణాపయోధి! ఫా
లేక్షణ! వహ్ని నిర్జిత సు♦మేషు వినోది! విరించి సారథీ!

ఉ. సుందరసుస్మితానన! వి♦శుద్ధతపోధన రాణ్ణిధాన! సం
క్రందనముఖ్య దిగ్రమణ ♦ రమ్యశిరస్సట సేవ్యమాన! ని
ష్పందకృపాకటాక్షచయ! ♦ భాగ్యవిధాన! నిజాశ్రితావనా!
వందనమియ్యదే కొను శి♦వా! గిరిజాధవ! భక్తబాంధవా!

ఉ. కందసమానకంధర! వి♦కర్తనసూను ముదాపహార! ని
ష్యందసుధారసోపమ వ♦చః పరిమోహిత దారుకాంగనా
నందకృదంగజాత! కద♦నప్రకటీకృత శౌర్యవైభవా!
వందన మియ్యదే కొను శి♦వా! నతదేవపయోజసంభవా!

మత్త. శంకరా! భవదీయ దివ్య వి♦శాలరూపముఁ గాంచి హృ
త్సంకటంబులు బాసె జన్మము ♦ సత్కృతార్థతఁ జెందె ని
ష్పంకమయ్యెఁ బురంబు రాష్ట్రము ♦ బంధువుల్ ప్రజలెల్ల నీ
కింకరత్వము గోరి యుండిరి ♦ కేవలంబగు భక్తితోన్.

మత్త. రాజనామముఁ జెందునే యిల ♦ రమ్యమానసులైన సా
మాజికుల్ ద్విజుఁగూర్చి సత్యము ♦ మైత్రిఁ దెల్పరు తోఁపమిన్
రాజశేఖర! తెల్పి సత్యము ♦ రాష్ట్రమున్ ననుఁ బ్రోవవే!
పూజసేతు భవత్పదాబ్జముఁ ♦ బూర్ణభక్తి నుమాపతీ!

వ. అని యాపన్నుండై తన్ను సన్నుతించుచున్న రుక్మకాంతుని యెడఁ గరుణారసం బుప్పతిల్ల నప్పరమేశ్వరుం డిట్లనియె.

సీ. రాజచంద్రి సుశీల ♦ రహిఁ దెల్పినట్టిది
సత్యంబె యగు లే ద♦సత్య మిందు
సిద్ధుండు నిర్దోషి ♦ చిత్తస్థిరతలేమిఁ
బరబుద్ధిచేఁ బతి♦వ్రతయునయ్యు
నీకృత్య మొనరించె ♦ హేమావతి కరాళి
దుర్బుద్ధియే యిట్టి ♦ దుఃఖవిధికిఁ
గారణంబగు యాత్రి ♦ ధారుణీసురుఁ డేఁగి
రాకుంటచే ♦ గుణరాశియైన
గీ. సోముఁ డీకష్టమృతిఁ జెందె ♦ శుద్ధమతులు
సభ్యులీవును ధర్మశా♦స్త్ర ప్రమాద

జనిత కలుషంబుఁగొనక విచారణంబు
సలిపితిరి మీకు దీన దోషంబు గలదె ?

చ. అని వచియించి సిద్ధుని భయాకులచిత్తుని మౌనముద్రనే
కొని తనపాదముల్ మదినిఁ గోరి భజించెడువాని వామదే
వునిఁగని శీర్షమందునను బొల్పగు హస్తమునుంచి శంకరుం
డనియెఁ గృపారసోచితములైన తగు చల్లనిచూడ్కిఁ జూచుచున్.

ఉ. మెచ్చితి లెమ్ము నీదగు నమేయమహాత్త్వము శాంతచిత్తమున్
సచ్చరితంబు నీవెపుడు సల్పెదు హాటకలింగపూజనల్
వచ్చెను నాకు నీయెడను బాపములే దిసుమంత రమ్ము నేఁ
డిచ్చెద నీకభీష్టము లహీన శుభస్థితివేఁడు మమ్మెడిన్.

వ. అని నిజాశ్రితజన రక్షణ పరాయణుండైన పరమేశ్వరుం డానతిచ్చిన పలుకులు శ్రవణపుటంబుల కానందరస పరిప్లుతంబులై హాయినింప సిద్ధుండు వెరఁగుపడి లేచి యపవాదంబుననైన భయంబు విడిచి తదీయపాదంబుల కభివందనంబు లాచరించి వినుతించి యిట్లనియె.

మ. జలజాతాసన వాసుదేవ ముఖులుం జర్చించి పూజించి క
న్నులఁ జూడంగను లేని యీశుఁడగు నిన్నుంగూర్చి విచ్చేసి యా
దలపై దివ్యకరంబునుంచి నపుడే ధన్యుండనైతిం దగన్
గలదే! యింతటికన్న భాగ్యము మహిం గాంక్షింపఁగావేఱొగిన్.

గీ. అభవ! నినుఁగూర్చి మాబోంట్ల నహరహంబు
భక్తిఁ బోషించు నీసతీపతుల కార్తిఁ
గలుగకుండంగ నాపైని వెలయు నింద
తొలఁగ సోమునిఁ బ్రదికించు; దుఃఖహారణ!

గీ. అన్నికోర్కులు తీరెనో పన్నగేశ
భూష! యెటనున్నదో నాదు పుణ్యసాధ్వి
దానికిని నాకు నీదివ్య ధామమందు
నిలుచునట్లుగఁ జేయుము నిరత మభవ!

గీ. అనిన మృత్యుంజయుం డట్ల యౌనుగాక
యనుచుఁ దత్సోమసుతు కాయమును గృపార్తిఁ

గనిన సోముండు నిద్ర మే ♦ ల్కొనిన కరణి
కనులు నులుముచు లేచి భా♦స్కరునిఁ బిలిచె.

మ. జనకుం డప్పుడె వచ్చెనంచు మదిలో ♦ సంతోష ముప్పొంగ నో
జననీ! లెమ్మిదె తండ్రివచ్చెనని మె♦చ్చం జెప్పుచున్ సిద్ధునిన్
గని పాదంబులఁ జేరి మ్రొక్కి యిటులన్ ♦ రానేల! తాతా! యటం
చును దాఁ జూచెడువారి కన్నులకు మె♦చ్చుం గూర్చె సోముండటన్.

గీ. శంకరుని పాదయుగళ సం ♦ స్పర్శమునను
ముద్దుకొమరుని ప్రేమ సంబోధనమున
వజ్రనాభుండు నాహేమ♦వతియు లేచి
సుతులతోఁ గూడి పార్వతీ♦పతికి మ్రొక్కి.

చ. చరణములందుఁ జేరి తగ ♦ సాగిలి మ్రొక్కెడు విప్రదంపతీ
స్థిరతరభక్తి మెచ్చుకొని ♦ దీవనలిచ్చుచు నుండునంత కి
న్నరసతియై కరాళి యెల ♦ నవ్వుల నాపురవైరి పాదపం
కరుహయుగంబులొత్తుచును ♦ గమ్మని గానము పాడె వేడుకన్.

వ. అంత నా విప్రకుటుంబం బద్భుతంబంది "మహానుభావా! యిదియేమి యింత? రాక్షసియై నిరంతర హింసా ప్రచారంబున వర్తించు నీ కిరాతి కిన్నరస్త్రీ యెట్లయ్యె; నాన తీయవలయు" నని వేడుకొనిన నభవుం డిట్లను. "మున్ను గిన్నరస్త్రీ యయ్యు. హిమాలయంబున నొక్క కిన్నరునింగూడి విహరించుచు నన్నుఁ గూర్చి తపంబు సలుపు నీసుశీలను బతిని వీడిన యాడుపడుచున కేటి తపంబని పరిహసించుచుఁ జెంతనున్న సరోవరంబున జలక్రీడాపరత్వంబున విహరించుటం జేసి రాక్షసీత్వంబు సంప్రాప్తించిన, నంత నాకిన్నరి భయంబునొంది, యిది యంతయు సుశీల మహిమంబని యెఱింగి తన యపరాధంబునకు వగచుచు, సుశీల పాదంబులంబడి తన పాపంబుఁ బాఁపవలయునని వేడుకొనిన నాదేవి కరుణించి నాకెన్నఁడు పరమేశ్వరుండు ప్రత్యక్షంబగు నప్పుడు నీశాపవిమోచనంబగును

పొమ్మని యనుగ్రహించి పలికిన, యంతనుండి కరాళియను పేర మహా రణ్యంబుల హింసాకృత్యంబు లాచరించుచుండి నేఁడు పుణ్యవంతంబగు మీయింట వసించిన సుకృత విశేషంబునం జేసి దాని నాజన్మంబు పాసి కిన్నరీత్వంబు సంప్రాప్తించెనని శివుండానతిచ్చు నవసరంబున నా కిన్నర యువతీ లలామంబు నా దేవదేవు నాజ్ఞ గైకొని సోమభాస్కరుల నాశీర్వదించుచు వియన్మార్గ గామినియై నిజేచ్ఛం జనుదెంచిన.

ఉ. అంత నగాధిరాజసుత • యా నృపసత్సభయందు విప్రుఁడుం
జింత దొరంగ సోముఁడు స • జీవితుఁడౌటఁ దలంచి నెమ్మదిన్
సంతస మొంది యామునిని • సన్నుతశీల సుశీల నెంతయుం
జెంతకుఁ బిల్చి వారలను • జేతులు జేతులు చేర్చి యిట్లనున్.

సీ. అవనీశ! విను వీర • లగ్రజన్ములు ధర్మ
పురవాసులగు మహా • పుణ్యమతులు
ఈతన్వి సుతకాంక్ష • చేత నీసంసార
మును వీడి పతిఁబాసి • ఘనతపంబు
మమ్ముఁగూర్చి చేసె ని • యమవంతమగు మది
నీసిద్ధవేషియా • గృహావిభుండు
స్థిరభక్తి హాటక • శివలింగ పూజనా
పరుఁడయ్యెఁ గాలంబు • భక్తిఁగడపెఁ

గీ. గానఁ దత్పుణ్యమున వీరు • గాంతుగాక
నొక్క కొమరుని నధిక స • ముజ్జ్వలాంగు
వానివలన నైహిక సుఖ • ప్రాప్తిఁగాంచి
యంత శైవసాయుజ్యంబు • నందఁగలరు.

కం. అని శాంకరి పలికిన విని
మనుజేంద్రుఁడు సభ్యులెల్ల • మహితాద్భుత మీ
మునివరు సచ్చరితం బని
ప్రణుతించిరి వామదేవు • పరుస సుశీలన్.

వ. ఆసమయంబున నాశశాంక శేఖరుండు తద్వసుమతీనాథుని సంశయంబు వారింపందలంచి సభ్యులెల్లరు వినుచుండ మేఘగంభీర స్వనంబున నిట్లనియె.

గీ. ధరణినాయక ! యీభూమి • సురకుటుంబ
యుగళమందున దండనీ • యు లిఁక లేరు
లేరు, వీరలు నీచేత • గారవార్హు
లీవు ధన్యుండ వపరాధి • గావు తలఁప.

కం. అనిచెప్పి చంద్రశేఖరుఁ
డనుపమ తేజంబుతోడ • నార్యాయుతుఁడై
మునులెల్లఁగొలువ నప్పుడె
ఘన వేగముతోడఁ జేరెఁ • గైలాసంబున్.

సీ. అభవుఁ డంతర్ధాన • మైనంత నారాజు
వజ్రనాభుని హేమవ • తిని వామ
దేవునిఁ దత్పత్ని • స్థిరభక్తిఁ బ్రార్థించి
నిజమందిరముఁ జేర్చి • నిఖిలబంధు
జనులను మ్రొక్కించి • ఘన వస్త్రభూషణా
దుల సమర్పించి సం • తోషమొదవ
మహనీయులార ! మీ • మహిమంబునం జేసి
శూలినిఁ గాంచి నే • సుకృతినైతి

గీ. ననుచు వా రలంకృతులుగాఁ • బనిచి పట్ట
పేన్గుపైఁ జేర్చి వాద్యంబు • లెలమి మ్రోయఁ
బాదచారియై శుభవేళ • వారిగృహము
వేడ్కఁ జేర్పించి వారల • వీడుకొలిపె.

కం. సతి సుతు లెంతయుఁ గడు స
మ్మతితోఁ దనయాజ్ఞ మెలఁగ • సంతతయాత్రా

స్థితులెల్లఁ దెలుపుచును స
త్కృతిమై గృహమందునుండె ♦ ద్విజపతియంతన్

గీ. వజ్రనాభునియింట నావామదేవుఁ
డంగనామణియుక్తుఁడై ♦ యనుదినంబు
శీతశైలంబు కథలెల్లఁ ♦ జెప్పుకొనుచు
నుండిరెంతయు సుఖముగా ♦ నిండువేడ్క.

సీ. సాధ్వియై పెంపుడు ♦ సంసారమును వీడి
యోగివృత్తినిఁ గానఁ ♦ కేగి నియతి
శివునిఁగూర్చి తపంబుఁ ♦ జేయుచు ద్విజవర్యు
ప్రాణముల్ కాపాడి ♦ పాపగతులఁ
జంపి తన్మహిమాది ♦ సంపత్తి నార్జించి
క్షితిసురు నింటికిఁ ♦ జేర్పవచ్చి
యపనింద రాజుచే ♦ నసువులవీడ సం
సిద్ధుఁడౌ పతిని ర♦క్షించి మెచ్చి

గీ. హరుఁడు ప్రత్యక్షమై యిడ్డ ♦ వరముఁగొనుచు
నృపతి మన్నన నిజభర్తఁ ♦ గృపను మరలఁ
గైకొని యపత్యకాంతుఁ శృం♦గారచారు
గాత్రియగు సుశీలకు సాటి ♦ గలరె జగతి?

కం. ముని నియమవంతుఁడయ్యెను
దినముల్ సౌవర్ణమయునిఁ ♦ ద్రిపురారిని న
ర్చనసేయు ఫలముచే వెత
లను మీఁటి సుఖంబుఁ గీర్తి ♦ లక్ష్మిని గొనియెన్.

కం. అని సూతుఁడు వినిపించిన
విని శౌనకముఖులు మిగుల ♦ విస్మితులై హె

చ్చినభక్తి పాటకేశ్వర
ఘన పూజామహిమ వృథయుఁ ♦ గాదని రెలమిన్.

ఆశ్వాసాంతము.

కం. శ్రితపోషణ! రిపుభీషణ!
హితతోషణ! మందహాస ♦ మృదుభాషణ! దు
ష్కృతశోషణ! కులభూషణ!
మతిపూజిత పాపతరణ! ♦ మాధవచరణా!

కం. ఆనందరస సముల్లస
దానన! స్మితపూర్వభాషణా! గోవిందాం
బానందన! భజిత యశో
దానందన! పాత్రవిహిత ♦ దాననిధానా!

ఉ. శ్రీశివరామ నామకృత ♦ చింతన కార్యఫలానుభోగ భూ
కోశ సుదుర్గమార్థచయ ♦ గుంభిత మూలపదానులోకితా!
శ్రీశివరామ నామకృత ♦ చింతను కార్యఫలానుభోగవ్యా
త్కోశ సుదుర్గమార్థచయ ♦ గుంభితమూల పదానులోకనా!

ఉ. అంచను గించు సేసి, విధి ♦ యాలినిఁ దూలఁగఁ జేసి, తమ్మి ను
మ్మించి, పటీరధాటి నెగ ♦ మీటి సుధాకరు శ్రీకరాంశు గా
వించి, సురాపగం గడుఁ బ ♦ విత్రతరాపగఁ జేసి దిక్కులన్
ముంచి త్వదీయకీర్తి జగ ♦ ముల్ మరపించెను రెడ్డిపుంగవా!

కం. సురుచిర మహానందాంబా
దరహాసవిలాస నూత్న ♦ ధవళజ్యోత్స్నా
నిరతస్యందిత జలశశి
ధరమణి ఖచితాలయాగ్రి ♦ తల్పవిహారీ!

మాలిని. సతత విహితతుంగా • స్నానపూతోత్తమాంగా
ధృతజలకణ గంగా•తీర శ్రీరామలింగా!
హతభవగుణ సంగ•న్యస్త తత్త్వాంతరంగా!
వితత జవతురంగా! • వేదశాస్త్రప్రసంగా!

గద్య.

ఇది శ్రీ మదనుములాన్వయ సింధుజైవాతృక భారద్వాజస గోత్ర
పవిత్ర వీరరాఘవ సుధీమణిపుత్ర నిఖిలకవిమిత్ర శ్రీ
రంగమాంబాగర్భ శుక్తిముక్తా ఫలాయమాన
విబుధవిధేయ సుబ్రహ్మణ్య నామధేయ
ప్రణీతంబైన వజ్రనాభచరిత్రం
బను మహాప్రబంధంబు
నందు సర్వంబును
తృతీయాశ్వాసము
సమాప్తము.

